# ఆ బిరుదు అక్కర్లేదు

## -మిస్తీ చక్రవర్తి



**ముద్దు ముద్దుగా క్యూట్‌గర్ల్‌గా కనిపించే బెంగాలీ పాప మిస్తీ చక్రవర్తి తొలిసినిమా 'చిన్నదాన నీకోసం'తో మంచి విజయం అందుకుంది. ఈ సినిమాలో కేవలం గ్లామర్‌కే పరిమితం అయ్యిందన్న అపవాదు మూటకట్టుకున్న మిస్తీ బాలీవుడ్‌కి వెళ్ళిపోయింది. దాదాపు మూడు సంవత్సరాల గ్యాప్ తరువాత ఓ అడల్ట్ సినిమాతో తెలుగు ప్రేక్షకుల ముందుకు వచ్చింది. ఈ సందర్భంగా మిస్తీ చక్రవర్తితో....**

**మీ అసలు పేరు ఎందుకు మార్చుకోవలసి వచ్చింది?**

ఇంద్రాణి చక్రవర్తి అనే నాపేరును బాలీవుడ్ డైరెక్టర్ సుభాష్ ఘాయ్ గారు మిస్తీ చక్రవర్తిగా మార్చారు. మొదట్లో పేరు మార్పు కొంత బాధ అనిపించినా, ఇప్పుడు ఈ పేరే నాకు బాగా నచ్చుతోంది.

**తెలుగులో గ్యాప్ రావడానికి కారణం?**

తెలుగులో నా మొదటి సినిమా తరువాత బాలీవుడ్, బెంగాలీ సినిమాలు పూర్తి చేయవలసి వచ్చింది. దాంతో ఇక్కడ అవకాశాలు వచ్చినా చేయలేకపోయాను. ఇక నుంచి తెలుగులో ఎక్కువ సినిమాలు చేయడానికి ప్రయత్నిస్తాను.

**'బాబు బాగా బిజీ' మాతృక 'హంటర్' చూశారా?**

చూడలేదు. దాని ప్రభావం నామీద ఉండకూడదనే చూడలేదు. కానీ తెలుగు దగ్గరకి వచ్చేసరికి చాలా మార్పులు చేశారు. ఇక్కడి నేటివిటీకి అనుగుణంగా మార్పులు చేర్పులు జరిగాయి. ఈ విషయం సినిమా చూసిన వారికి ఇట్టే తెలిసిపోతుంది.

**ఈ సినిమాలో అవకాశం ఎలా వచ్చింది?**

డైరెక్టర్ నవీన్ గారు ఇక్కడ నేటివిటీకి అనుగుణంగా కథ రాసుకుని నా దగ్గరకు వచ్చారు. ఈ సినిమా చేసే ముందు బాగా ఆలోచించాను. ఇలాంటి పాత్రలో ప్రేక్షకులు నన్ను ఆదరిస్తారా? అన్న అనుమానం కలిగింది. నా పాత్రలో అశ్లీలత ఎక్కడా ఉండదు. ఒక మెసేజ్ మాత్రమే ఉంటుందని నవీన్‌గారు నాకు నచ్చ చెప్పారు. సినిమా పూర్తి అయిన తరువాత నా పాత్రను మెచ్చుకుంటారని నమ్మకం కలిగింది. నా నమ్మకం వమ్ముకాలేదు. హిందీలో రాధికా ఆప్టేగారు చేసిన పాత్ర తెలుగులో నేను చేశాను. డైరెక్టర్ నవీన్‌గారికి ఇది మొదటి సినిమా. అయినా ఎక్కడా తడబడకుండా పక్కా స్క్రిప్టుతో షూటింగ్ మొదలు పెట్టడంతో ఎక్కడా ఆగకుండా చకచకా పూర్తయింది.

**అవసరాల శ్రీనివాస్‌తో చేయడం ఎలా ఉంది?**

తెలుగులో ఆయన సినిమాలు చూశాను. తెరమీద ఎంత అమాయకంగా కనిపిస్తారో బయట కూడా అంతే అమాయకంగా కనిపిస్తారు. మంచి మనిషి. చక్కగా మాట్లాడతారు. తాను నవ్వకుండా ఎదుటివారిని నవ్వించడంలో దిట్ట. షూటింగ్ మొత్తం బాగా ఎంజాయ్ చేశాం. షూటింగ్ ఇంకా కొన్ని రోజులు ఉంటే బాగుండేదని అనిపించింది.

**మీతో పాటు నటించిన మరో ఇద్దరు హీరోయిన్ల గురించి....?**

చెప్పడానికి ఏమీ లేదు. ఎందుకంటే వారితో చేసే సీన్లు లేవు. నా షూటింగ్ సెపరేట్‌గా జరిగింది. సినిమా చివరలో మాత్రమే వాళ్ళని కలిసే అవకాశం వచ్చింది.

**సినిమాలు చేయడంలో మీ మొదటి ప్రాధాన్యం?**

గ్లామర్ పాత్రలు చేయను అని చెప్పను కానీ, నా మీద ఆ ముద్ర పడకుండా జాగ్రత్త పడతాను. అదే సమయంలో నటనకు అవకాశం ఉన్న సినిమాలే చేస్తాను. తెలుగులో నా మొదటి సినిమాలో గ్లామర్‌కే పరిమితమయ్యాను అన్న వార్తలు వచ్చాయి. ఆ సినిమాలో కథాపరంగా అలాగే కనిపించాలి. అయినా ఆ సినిమాలో నా నటనకి మంచి మార్కులే పడ్డాయి. గ్లామర్ డాల్ అన్న బిరుదు నాకు అక్కర్లేదు. క్యారెక్టర్లతో ప్రయోగాలు చేయడం నాకు ఇష్టం. నా మరో సినిమా 'శరభ' కూడా వైవిధ్యమున్న పాత్రే!

**తెలుగులో చేస్తున్న సినిమాల గురించి...?**

కథలు విన్నాను. వేటికీ ఓకే చెప్పలేదు. త్వరలోనే బాలీవుడ్‌లో మరో సినిమా చేసే అవకాశం ఉంది.

-భరత్ కుమార్

## నవ్యవీక్లి-తురగా ఫౌండేషన్ సంయుక్త నిర్వహణలో



### తురగా జానకీరాణి కథల పోటీ

| | | |
|---|---|---|
| ప్రథమ బహుమతి | : రూ. | 10,000 |
| ద్వితీయ బహుమతి | : రూ. | 8,000 |
| తృతీయ బహుమతి | : రూ. | 7,000 |

5 విశేష బహుమతులు

కథ ఒక్కింటికి : రూ. 5,000

### తురగా కృష్ణమోహనరావు హాస్యకథల పోటీ



| | | |
|---|---|---|
| ప్రథమ బహుమతి | : రూ. | 10,000 |
| ద్వితీయ బహుమతి | : రూ. | 8,000 |
| తృతీయ బహుమతి | : రూ. | 7,000 |

5 విశేష బహుమతులు

కథ ఒక్కింటికి : రూ. 5,000

### కథ/హాస్యకథ: నిబంధనలు

- కథ తెలుగు వారి జీవితాన్ని ప్రతిబింబించేలా ఉండాలి.
- ప్రపంచంలోని ఏ ప్రాంతమైనా కథకు నేపథ్యం కావచ్చు. అయితే అది తెలుగువారి జీవితానికి సంబంధించినదై ఉండాలి.
- కథలు అరటావు సైజులో 10 పేజీలకు మించకుండా ఒకవైపునే రాసి పంపాలి. దస్తూరి చక్కగా అర్థమయ్యేలా ఉండాలి. డి.టి.పి. చేసిన పక్షంలో అది 6 పేజీలకు మించరాదు.
- కథను పంపేటప్పుడు రచయిత/రచయిత్రి పేరు అందులో ఉండరాదు. పేరు, పూర్తి చిరునామా వేరే కాగితం మీద రాసి జతపరచాలి. అనుకరణ, అనుసరణ కాదని, బ్లాగుల్లోనూ, వెబ్ మాగజైన్స్‌లోనూ రాలేదని హామీ పత్రం విధిగా జత చేయాలి. కవరు మీద 'తురగా జానకీరాణి కథల పోటీకి' అని స్పష్టంగా పేర్కొనాలి. పోటీకి హాస్యకథ పంపుతున్నట్టయితే కవర్ మీద 'తురగా కృష్ణమోహనరావు హాస్యకథల పోటీకి' అని పేర్కొనాలి.
- విదేశాల నుంచి కథలు పంపించే రచయితలు/రచయిత్రులు మాత్రమే ఈ-మెయిల్ (navyaweekly@andhrajyothy)కి పంపగలరు.
- బహుమతి పొందిన కథలు 'నవ్య' వీక్లీలో ప్రచురితమవుతాయి.
- పోటీ గడువు తేదీ పొడిగించేందుకు కానీ, అర్హమైన రచనలు రాకపోతే బహుమతుల్లో మార్పులు చేసేందుకు కానీ 'నవ్య వీక్లి' యాజమాన్యానికి సర్వహక్కులూ ఉన్నాయి.
- కథల ఎంపిక విషయంలో తుది నిర్ణయం నవ్య సంపాదక వర్గానిదే! ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలకు కాని, వాద ప్రతివాదాలకు కాని తావు లేదు. ప్రచురణకు అనర్హమైన కథలు తిప్పి పంపడం సాధ్యం కాదు.

### కథలు పంపవలసిన చిరునామా

నవ్య వీక్లి
ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్
ప్లాట్ నెం. 76
రోడ్ నెం 70
అశ్వనీ లే అవుట్
హుడా హైట్స్
జూబ్లీహిల్స్
హైదరాబాద్-500033

## కథలు, హాస్యకథలు చేరవలసిన ఆఖరు తేది

# 30 జూన్ 2017

* నిబంధనలు వర్తిస్తాయి



# 8

## కలసి ఉంటే కలదు సుఖం

ఆధునికత, నాగరికత, శాస్త్ర, సాంకేతిక పరిజ్ఞానం అన్నీకలిసి ఉమ్మడి కుటుంబవ్యవస్థపై తీవ్ర ప్రభావం చూపిస్తున్నాయి. కుటుంబవ్యవస్థను రక్షించేందుకు ఐక్యరాజ్య సమితి నడుం బిగించింది. మే 15వ తేదీ అంతర్జాతీయ కుటుంబ దినోత్సవం సందర్భంగా ఆ విశేషాలు మీ కోసం....

## 42

### దగ్గరయ్యే దారులెన్నో

సమయాభావం, ఒత్తిడి వంటివాటివల్ల భార్యాభర్తల మధ్య గొడవలు పెరిగాయి. హ్యాపీ రొమాంటిక్ లైఫ్ లీడ్ చేసేందుకు రిలేషన్‌షిప్ నిపుణులు చెబుతున్న ఎన్నెన్నో విషయాలు చదవండి

## 72

### ఇంటర్వ్యూ

నట కుటుంబం, నట గురువుల కుటుంబం నుండి వచ్చిన నటుడు రాజీవ్ కనకాల. భవిష్యత్తు తెలుగు చిత్ర పరిశ్రమదే అంటున్న ఆయన ఇంటర్వ్యూ ఈ వారం....

## సీరియల్స్



## కథలు



## ఫీచర్స్



ముఖచిత్రం: అనుష్క


రచనలు, కథలు పంపవలసిన చిరునామా
నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్33. email: navyaweekly@andhrajyothy.com





### గొప్ప ఆలోచన

మోసపోయింది. భర్త చేతిలో సర్వనాశనం అయిపోయింది. చేసిన పాపం ఏమిటో, తనలో ఉన్న లోపమేమిటో తెలియడం లేదు. ఎవరో చెప్పారు, దూరంగా కొండమీద ఓ సాధువు ఉన్నాడు, అతన్ని వేడుకుంటే పరిష్కారం లభిస్తుందని. సరేనని సాధువును ప్రార్థించేందుకు బయల్దేరిందామె.

ఎండనక వాననక ప్రయాణించింది. వందలాది మైళ్ళు నడచింది. అంతెత్తున ఉన్న కొండెక్కింది. సాధువును సమీపించింది.

"స్వామీ"

"ఏమి"

"నా జీవితం నా భర్తకి అంకితం చేశాను. నా యవ్వనం అతనికి ధారపోశాను. కంటికి రెప్పలా కాపాడానతన్ని. ఇప్పుడేమో ఎవరో యువతిని చేరదీసి, నన్ను పొమ్మంటున్నాడు. బతుకు దుర్భరం అనిపిస్తోంది. నేను చేసిన తప్పేమిటి? నాలో ఉన్న లోపం ఏమిటి? నేనేం చెయ్యాలి?" అడిగిందామె.

సమాధానంగా ఆమె చేతిలో నిమ్మపండు సైజులో ఓ కోవాముద్ద పెట్టాడు సాధువు.

"తిను" అన్నాడు. తిన్నదామె.

"ఎలా ఉంది? బాగుందా?" అడిగాడు సాధువు.

"చాలా బాగుంది"

"ఇంకో ముద్ద కావాలా?"

"తప్పకుండా! ఇస్తానంటే కాదంటానా?" అన్నదామె.

సన్నగా నవ్వుతూ ఆమె కళ్ళలోనికి చూశాడు సాధువు. అన్నాడిలా.

"సమస్య ఏమిటో నీకిప్పుడు అర్థమైందనుకుంటాను."

ఆలోచనలో పడిందామె. కాసేపు మౌనం వహించింది. తర్వాత అన్నదిలా.

"అర్థం అయింది స్వామీ! అత్యాశే మనిషిని నాశనం చేస్తోంది. మన దగ్గర ఉన్నది మనకి చాలదు. ఇంకా కావాలి. ఇంకొకటి కావాలి. మరొకటి కావాలి. కొత్తది కావాలి. ఆశకు అంతులేకుండా పోతోంది స్వామీ! ఏదీ శాశ్వతం కాదు. దేనికీ స్థిరత్వం లేదు. ఈ పరమ సత్యాన్ని తెలుసుకోవాలి. తెలుసుకుంటేనే ప్రశాంతంగా ఉండగలుగుతాం."

"నువ్వు అలా అర్థం చేసుకున్నావా? నా ఉద్దేశం అది కాదు. నువ్వు బాగా లావుగా ఉన్నావు, కొంచెం తిండి తగ్గించుకుంటే మంచిదనిపించింది." అన్నాడు సాధువు.

–వైనతేయ

www.navyaweekly.com

పుస్తక పఠనం ఎంతటి బాధనయినా మరపిస్తుంది.

# నవ్య

సంపుటి: 14 సంచిక: 11

17-5-2017

మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ

## మొదటి పేజి

### తులసి

ఆమె అసలు పేరు ఎవరికీ తెలియదు. అగ్రహారం పెట్టినపేరే అందరికీ తెలుసు. ఆమెకు అగ్రహారం పెట్టినపేరు 'తులసమ్మ'. అగ్రహారీకులందరికీ తులసివైద్యం చేస్తుందామె. అందుకే ఆమెనంతా తులసమ్మని అంటారు. తులసమ్మవైద్యానికీ, తులసి వైద్యానికీ వేళాపాళా లేదు. ఎప్పుడు పడితే అప్పుడు, ఎక్కడ పడితే అక్కడ వైద్యం చేస్తుందామె. కొంగున కట్టుకున్న తులసి ఆకుల్ని చేతిలో ఉంచి కళ్ళకద్దుకోమంటుంది. పొద్దున నీలాటిరేవుకి వస్తుందా? ఎవరైనా ఆమెను పలకరించి నవ్వారనుకో! నవ్విన అమ్మాయి పలువరుస పచ్చగా ఉంటే... ఏమిటే పిల్లా, పచ్చగా ఆ పళ్ళూ నువ్వూ? అసహ్యంగా లేదూ? కాసేపు ఆగిన తర్వాత మా ఇంటికి రా! గుప్పెడు తులసి ఆకులు పెడతాను. ఆ ఆకుల్ని ఎండబెట్టుకుని, చూర్ణం చేసుకో! ఆ చూర్ణంతో పళ్ళు తోముకో, పచ్చదనంపోయి తెల్లగా ముత్యాల్లా మెరుస్తాయి పళ్ళు. అప్పుడు నీ నవ్వుకోసం అగ్రహారం కుర్రకారంతా పడి చస్తుంది అంటుంది తులసమ్మ. దగ్గరగా పిలిచి, నోరు తెరవమని చెప్పి, నోరు వాసనొస్తోందే పిల్లా, ఇంద! ఈ  తులసి ఆకులు తీసుకో! ఇంటికి వెళ్తూనే ముందు వీటిని నీటిలో నాన బెట్టుకుని, సాయంత్రం ఆ నీరు తాగు, అంతే! ఇంత కంపూ ఇట్టే పోతుంది. నోటిపొక్కులు కూడా పోతాయి అంటుంది. నాలుగు తులసి ఆకులు ఆ పిల్ల చేతిలో ఉంచుతుంది.

అంతలో ముక్కు చీదుతూ, దగ్గుతూ ఎవరైనా కనిపిస్తే, ఏంటి పిన్నీ దగ్గుతున్నావు? జలుబా? అడుగుతుంది. అవునమ్మా అంటే... గుప్పెడు తులసి ఆకులు ఆమె చేతిలో పెట్టి, రసంతీసి, ఆ రసంలో తేనె కలుపుకుని రోజుకి రెండుసార్లు చొప్పున ఓ మూడురోజులు తాగమంటుంది. తాగితే నీ జలుబూ, దగ్గూ నిన్నే కాదు, ఈ అగ్రహారం కూడా వదలి పారిపోతుంది అంటుంది. పట్నంపిల్ల. కొత్తపెళ్ళి కూతురు. నిద్రలేక కళ్ళుమంటబెడుతోంటే, కళ్ళలోంచి నీరు కారుతోంటే...చఛ! ఏంటా కళ్ళు? ఓ పని చెయ్యి, ఈ తులసి ఆకులు తీసుకో! ఇంటికి వెళ్తూనే రసం తీసి, ఆ రసంలో దూది ముంచి, ఆ దూదిని కనురెప్పల మీదపెట్టుకో! ఈ మంటలూ, నీళ్ళూ ఉండవు. కళ్ళు ఎంచక్కా పువ్వుల్లా విచ్చుకుంటాయి అంటుంది. పట్నంపిల్లకి భరోసా ఇస్తుంది. నడవలేక నడవలేక రేవుకి నడచివచ్చే దుక్కసుందరిని చూసి, ఏంటే రోజురోజుకీ పెరిగిపోతున్నావు? పెళ్ళికావాల్సిన పిల్లవి, తగ్గు. ఇదిగో! ఈ తులసి ఆకులు తీసుకో! మజ్జిగలో వేసుకో! ఆరారా తాగు! దెబ్బకి ఈ లావూ, ఒంట్లో కొవ్వూ తగ్గకపోతే నన్ను అడుగు అంటుంది. ఆకుల్ని అరచేతిలో పెడుతుంది. రక్తహీనతా? తులసిని వాడు. ఉబ్బసమా? తులసి కషాయం తాగు. అజీర్తా? నాలుగు తులసి ఆకులు భోజనానికి ముందు బుగ్గన ఉంచుకుని చప్పరించు! కడుపులో కొండలు కూడా కరిగిపోతాయి అంటుంది తులసమ్మ.



చుట్టూ తులసివనం, మధ్యలో ఇల్లు. పెరట్లో తులసికోట, ఇంట్లో తులసమ్మ... ఇంతే తప్ప తోడెవరూ లేరామెకు. ఒంటరి తులసమ్మను పిల్లలు ఖాతరు చెయ్యరు. ఆమె ఇంటిపక్కనే క్రికెట్ ఆడుతూ అల్లరి చేస్తారు. బాలొచ్చి తులసి వనంలో పడితే దానిని వెదికేందుకు వనంమీద పడతారు. కుమ్మికుమ్మి వనాన్ని పాడుచేస్తారు. అలాగే స్టంప్స్‌కోసం తులసి మొక్కల్ని పీకి పెడతారు. తప్పురా అంటే వినరు. వద్దురా అంటే గొడవపడతారు. తులసమ్మసహా పెద్దలంతా చెప్పి చూశారు. అయినా పిల్లలు పట్టించుకోలేదు. పైగా విషయం పెద్దలవరకు తీసుకుని వెళ్ళిందని తులసమ్మంటే పిల్లలకి కోపం. ఆ కోపంతో ఒకసారి గురి చూసి తులసమ్మ మీదికి బాలుని విసిరారు కూడా. వీపుమీద తగిలి గొల్లుమందామె. అది ఆనందం కలిగించింది పిల్లలకి. ఆ ఆనందాన్ని రెట్టింపు చేస్తున్నట్టుగా తులసమ్మ దూరపు బంధువెవరో పోతే, ఆమెకు పట్నం వెళ్ళక తప్పలేదు. వెళ్తూ వెళ్తూ పిల్లలకి చెప్పి మరీ వెళ్ళింది తులసమ్మ. నా మీద కోపం ఉంటే నన్ను కొట్టండి! తిట్టండి! అంతేకాని అగ్రహారం సంజీవని ఈ తులసివనాన్ని పాడుచెయ్యకండి అంది. వేడుకుంది. పిల్లలు వింటారా? వినరనుకుంది. అలా అనుకుంటూనే పట్నం వెళ్ళి దినాలయ్యేవరకూ ఉండి తిరిగి వచ్చింది తులసమ్మ. అగ్రహారం మలుపు తిరుగుతూ ఈ పన్నెండురోజుల్లో వనం పూర్తిగా పాడై ఉంటుంది. పిల్లలు పీకిపెట్టి ఉంటారు. పీకిపెట్టకపోయినా మొక్కలకి నీళ్ళుపోసే నాథుడేడి? వాటంతటవే కునుకేసి ఉంటాయి అనుకుంది. అనుకుంటూ ఇంటి ముందుకు వచ్చి పచ్చగా ఉన్న మొక్కల్ని చూసి తన కళ్ళను తానే నమ్మలేకపోయింది. ఏమిటీ విడ్డూరం? అనుకుంది. తులసమ్మా! అగ్రహారమ్మీదా, తులసివనం మీదా నీకున్న ప్రేమే నీ మొక్కల్ని నిలబెట్టింది. పిల్లల మనసులు తిరిగాయి. నీ మొక్కలకు నీళ్ళు పొయ్యడమే కాదు, నీ మొక్కల్ని కంటికి రెప్పలా కాపాడుతూ వచ్చారని చెప్పారెవరో! అవునా! అని ఆశ్చర్యపోతూ చూసింది తులసమ్మ. నీళ్ళకుండల్తో పిల్లలు నిలబడి కనిపిస్తే చేతులు జోడించి నమస్కరించింది వాళ్ళకి.

నవ్య

WOW

## గుర్రపుడెక్కతో....

చెరువులు, కుంటల్లో కలుపు మొక్కలు పెరగడం సహజం. వాటివల్ల నీరు కలుషితం అవడమే కాకుండా, పర్యావరణాన్ని కూడా కలుషితం చేస్తాయి. వాటిల్లో ముఖ్యంగా చెప్పుకోదగ్గది గుర్రపుడెక్క. చెరువుమీద చిక్కగా పచ్చగా పారుతూ, కొంతకాలం తర్వాత ఏకంగా చెరువునే మింగేస్తుంది. అయితే ఇదే గుర్రపుడెక్క కాడలతో అద్భుత కళాఖండాలు తయారు చేయిస్తున్నాడు అబ్దుల్ ముజీబ్. 70 మంది మహిళలకు ఉపాధి కల్పిస్తున్నాడు. గుంటూరు జిల్లా తెనాలికి చెందిన అబ్దుల్ పనికిరాని గుర్రపుడెక్కను ముడిసరుకుగా వాడి, కళాఖండాలు తయారీని కుటీరపరిశ్రమగా అభివృద్ధి చేశాడు.

మొదటగా గుర్రపుడెక్కను స్థానికంగా



ఉండే చెరువు నుంచి సేకరించి ఎండబెట్టి, ఒక్కో కాడను సన్నగా చీరి, మ్యాట్ తయారు చేశాడు. అక్కడినుంచే మొదలైంది అతని ప్రయాణం. పరిశోధనలో భాగంగా ఒకసారి అస్సాంకి వెళ్ళి, అక్కడ ఇలాంటి కలుపు మొక్కలతోనే అందమైన హాండీక్రాఫ్ట్ తయారు చేయడం గమనించాడు. తిరిగి ఆంధ్రాకు వచ్చి, సర్వే చేసి, 2014 అక్టోబర్‌లో అల్లిక అనే సంస్థను స్థాపించాడు. ఆరుగురు మహిళలతో ప్రారంభించి, క్రమంగా మార్కెట్ మీద పట్టు సంపాదించాడు. హాండ్ బ్యాగులు, బుట్టలు, డైనింగ్ మ్యాట్స్, హోం డెకార్, లంచ్ బాక్సులు, వాటర్ బాటిల్స్, ల్యాప్‌టాప్, కాన్ఫరెన్స్ బ్యాగులు, లాంప్ షేడ్స్ తదితర వస్తువులు తయారు చేసి మార్కెటింగ్ చేస్తారు.

గుర్రపుడెక్క సేకరించడానికి కొందరిని నియమించుకున్నాడు. వాళ్లంతా చుట్టుపక్కల ప్రాంతాల్లోని చెరువుల్లో గుర్రపుడెక్కను కోసి తీసుకొస్తారు. మార్కెటింగ్ అంతా ఫేస్‌బుక్ ద్వారానే చేసుకుంటాడు. ఎక్కడ ఎగ్జిబిషన్ జరిగినా అక్కడ స్టాల్స్ పెడతాడు. ఎలక్ట్రికల్ ఇంజినీరింగ్ చేసిన అబ్దుల్ ముజీబ్ ఆలోచనంతా పర్యావరణ పరిరక్షణ మీదనే. భవిష్యత్తులో దాని ఆకులు, వేర్లు ఎండబెట్టి సేంద్రియ ఎరువు తయారు చేయాలనే ప్లాన్‌లో ఉన్నాడు. తద్వారా మహిళలకు ఆర్థికంగా చేయూతనివ్వడమే కాకుండా, గుర్రపుడెక్క బారినుంచి చెరువులను తనవంతు సాయంగా కాపాడాలని చూస్తున్నాడు.

# మెయిల్ బాక్స్

## అక్షర విందు, నవ్య పసందు

శృతిహాసన్ ముఖచిత్రం ఈ వారం నవ్య వీక్లీకి సరికొత్త అందం తెచ్చింది. సరికొత్త శీర్షికలతో చదివింపజేస్తూ షడ్రుచులతో కూడిన అక్షరవిందు అందిస్తోంది మా నవ్య. అరుదైన ఫీట్లు, సరికొత్త రికార్డులు అచ్చెరువొందించాయి. సెన్సేషనల్ లేడీ డిటెక్టివ్ రజనీపండిట్ గారి గురించి ఎన్నెన్నో సంగతులు తెలుసుకుని ఆశ్చర్యానికి లోనయ్యాం. ఇలాంటివారి గురించి ప్రపంచానికి మరోసారి తెలియజేసిన నవ్యకు వందనాలు. అలుపెరుగని సాహితీజీవి సుధామగారి జీవిత విశేషాలు, విజయాలు తెలుసుకోగలిగాం. సీరియల్స్ ఆసక్తిగా సాగుతుండగా, కథలు కట్టిపడేస్తున్నాయి.

**–నీలిమ సబ్బిశెట్టి, రాజానగరం, తూర్పుగోదావరి**

## దమ్మున్న నటి

అవును డేటింగ్ చేశా అని హెబ్బాపటేల్ చెప్పడం ఆమె ధైర్యసాహసాలు చాటి చెబుతున్నాయి. చేసింది ధైర్యంగా బయటకు చెప్పగల ధైర్యం, దమ్ము ఎంతమందికి ఉంటాయి? అతని నుంచి చాలా నేర్చుకున్నాననీ, ఈ రోజు ఇలా ఉండటం అతని చలవే అని చెప్పడం వెనుక ఆమె ఎదుగుదల కనిపించింది. మంచి ఇంటర్వ్యూ రాశారు.

**–అశోక్‌తేజ, వరంగల్**

## అలరించిన మధుకైటభుల కథ

హరివంశం కథ కళ్ళకు కట్టినట్టు రాస్తున్నారు. మధుకైటభుల పేర్లు వినడమేగానీ వారి రాక్షసచర్యలు, వారి చరిత్ర తెలియదు. హరివంశంలో అరణిగారు వివరించగా చదివి ఎంతో సంతోషించాం. మధుకైటభుల శరీరాలనుండి వచ్చిన కొవ్వుతోనే భూతలం ఏర్పడిందని, అందుకే భూమాతను మేదిని అంటారని చదివి ఆశ్చర్యపోయాం.

**–వల్లీపద్మావతి, ఎస్సార్‌నగర్, హైదరాబాద్**

## రక్తికడుతున్న వెట్టి సీరియల్

మధుబాబుగారి వెట్టి సీరియల్ చదువుతున్నాను. అప్పుడప్పుడు మిస్ అయినా దాదాపు చదువుతున్నాను. శివారెడ్డి ఎస్టేట్‌ను అప్పులబారి నుంచి కాపాడి బాజిరెడ్డి ఆక్రమణకు గురికాకుండా చూసేందుకు హీరో వెట్టి పాత్ర చుట్టూ కథ నడిపిస్తూ ఎంతో బాగా రాస్తున్నారు రచయిత. బాజిరెడ్డి, శివారెడ్డి, వెట్టి పాత్రలు వారం వారం కళ్ళకు కడుతూ సినిమాకథను తలపిస్తున్నాయి. కథలు, జోకులు బాగుంటున్నాయి.

**–విశ్వేశ్వరరావు, భీమవరం. ప.గో.జిల్లా**

## సెక్స్‌లైఫ్ టిప్స్ సూపర్బ్

శ్రుతిహాసన్ ముఖచిత్రం ఎంతో అందంగా ఉంది. సెక్స్‌లైఫ్‌ను విజయవంతంగా ఎలా కొనసాగించాలో చక్కగా చెప్పారు. సరిగ్గా చదివితే భార్యాభర్తల మధ్య అనుబంధం పెరగడానికి కవితగారి ఆర్టికల్ ఎంతో ఉపయోగపడుతుంది. ఇంటిమసీ పెరగడానికి, భాగస్వామి మూడ్ గురించి ఎన్నో సులువైన మార్గాలు చెప్పారు. టిప్స్ సూపర్బ్. ఇవన్నీ భార్యతో చేస్తేనే మంచిది. జోకులు, కార్టూన్లు నవ్వించాయి.

**–కృష్ణకుమార్, విశాఖపట్నం**

## ఈ తరానికి తెలియని హరివంశం

అరణిగారు రాస్తున్న హరివంశం సీరియల్ మమ్మల్ని భక్తిపారవశ్యంలో ముంచెత్తుతోంది. సముద్రుడే భీష్ముడి తండ్రిగా శంతనుడుగా అవతరించాడనీ, ఆయన భార్య గంగ అనీ భూమాత భారం నిర్మూలించే దేవకార్యం నిర్వహించేందుకు వారు మానవులై జన్మించారని ఈ కథ ద్వారా తెలుసుకున్నాం. మాకు తెలియని ఎన్నో గాథల్ని హరివంశం ద్వారా తెలియజేస్తూ పురాణవిజ్ఞానం అందిస్తున్న అరణిగారికి ధన్యవాదాలు.

హరివంశం

**–టి.సత్యవతి, విజయవాడ**

## పూర్వజన్మ సుకృతం హరివంశ పఠనం

హరివంశం వారం వారం చదువుతున్నాం.. ఎన్నో విషయాలు తెలుసుకుంటూ ఆశ్చర్యపోతున్నాం . ఇప్పటివరకు మాకు తెలియని ఎన్నో పూర్వగాథల్ని హరివంశంద్వారా చెబుతూ మమ్మల్ని ధన్యుల్ని చేస్తున్నారు. వంశక్రమం, పూర్వీకులపేర్లు నిజంగా తెలుసుకోదగినవే. మేరుపర్వతంపై దేవతలతో శ్రీమహావిష్ణువు సమావేశం ఒక అద్భుతఘట్టంగా కళ్ళకు కట్టారు.

**–శ్రీనివాసులు, హైదరాబాద్**

## ఎమ్మెస్ గురించి తెలిసి ఆశ్చర్యపోయాం

నవ్య వీక్లీలో వచ్చిన ఎమ్మెస్ నారాయణ జీవిత కథ పుస్తకంగా రావడం ముదావహం. ఈ సభలో సినీ నటులు, ప్రముఖులు పాల్గొనడం, ఎమ్మెస్ గురించి గొప్పగా చెప్పడంతో తెరమీద కనిపించే ఒక కమెడియన్ వ్యక్తిత్వం, ఆయన వ్యక్తిగత జీవితం ఎంతో గొప్పదనీ, ఆయన మంచి రచయిత, సాహితీవేత్త అనీ తెలిసి ఆశ్చర్యపోయాం.

**–విశాల్, ఖమ్మం**

## పాక్ బుద్ధి మారదు

కాశ్మీరుకోసం వెయ్యేళ్ళు యుద్ధం చేస్తానంది పాకిస్థాన్. ఆ దేశం ఒక ఉగ్రవాద దేశం. దాని లక్ష్యం చాలా స్పష్టంగా అందరికీ తెలిసిపోయింది. అది మనపై యుద్ధం ఆపదు. ఏదో రూపేణా మనల్ని సతాయిస్తూ, కాల్పులు జరుపుతూ మన జవాన్లను హతమారుస్తుంది. మనదేశాన్ని రెచ్చగొట్టేందుకు ప్రతి అవకాశాన్నీ ఉపయోగించుకుంటోంది. రివ్యూలో రాజశుకగారు చెప్పినట్లు ఖండనలు చేసినంతమాత్రాన దాని బుద్ధి మారదు. దానికి గట్టి బుద్ధి చెప్పాల్సిందే.

**–కె.పి.ప్రభాకర్, ఉప్పల్, హైదరాబాద్**

# పీసీఓడీ సమస్యకు అమూల్యమైన చికిత్స

**స్త్రీలలో** యుక్తవయస్సురాగానే రుతుక్రమం మొదలవుతుంది. ఈ రుతుక్రమం నెలకొకసారి క్రమపద్ధతిలో రావడం అనేది స్త్రీల ఆరోగ్య వంతమైన జీవితానికి ఒక సూచికలాంటిది. ఈ నవీనయుగంలో యుక్తవయస్సు, మధ్యవయస్సులో వచ్చే సర్వసాధారణ సమస్య పీసీఓడీ. దీనిని సాధారణ భాషలో నీటి బుడగలు అంటారు.


**డాక్టర్ గోరంట్ల చంద్రశేఖరరావు**
ఎం.డి, పీహెచ్‌డీ (హోమియో)
డి.ఎస్‌సి. హోమియో (అమెరికా)
మేనేజింగ్ డైరెక్టర్, హోమియో ట్రెండ్స్
హైదరాబాద్, సికింద్రాబాద్, విజయవాడ, వైజాగ్
ఫోన్స్: 77 3000 1000, 77 3000 2000




### ఎందుకు వస్తుంది?

1. వంశపారంపర్యంగా వస్తుంది.
2. ఊబకాయం. స్త్రీలలో బరువు ఎక్కువగా ఉంటే ఈ పీసీఓడీ వచ్చే అవకాశం ఉంటుంది.
3. స్ట్రెస్, ఒత్తిడి, సరైన వ్యాయామం లేకపోవడం, ఆందోళన మొదలగు మానసిక కారణాలు కూడా పీసీఓడీ రావడానికి దోహదపడతాయి.

### పీసీఓడీలో ఏమి జరుగుతుంది?

ఆడవారిలో సరైన రుతుక్రమం కొరకు హార్మోన్ల సమతుల్యత అవసరం. పీసీఓడీ సమస్యలో హార్మోన్ల సమతుల్యత దెబ్బతినడం జరుగుతుంది. ఆడవారిలో ఆండ్రోజన్ అనే మగవారి హార్మోన్ల శాతం పెరగడం జరుగుతుంది. దీనివల్ల మొటిమలు, ముఖం, శరీరం మీద అవాంఛిత రోమాలు, నెలసరి లేటుగా రావడం, మెడచుట్టు నల్లటి దళసరితనం రావడం జరుగుతుంది.

### లక్షణాలు

1. రుతుక్రమం ఆలస్యంగా రావడం
2. శరీరం, ముఖం మీద అవాంఛిత రోమాలు
3. జుట్టురాలడం, పలుచబడటం జరుగుతుంది.
4. ముఖం మీద జిడ్డు ఎక్కువగా ఉత్పత్తి కావడం వల్ల మొటిమలు వస్తుంటాయి.
5. నెలసరి ఎక్కువ రోజులుండి ఆగిపోవడానికి మందులు వాడాల్సి వస్తుంది.
6. బరువు పెరుగుతారు. తక్కువతిన్నా, వ్యాయామం చేసినా తగ్గరు.
7. మెడచుట్టూ నల్లబడటం జరుగుతుంది.
8. అండం ఎదుగుదల లోపం, అండం సరైన సమయంలో విడుదల కాకపోవడం వల్ల సంతానలేమి సమస్య ఉండటం జరుగుతుంది.

### పరీక్షలు

అల్ట్రాసౌండ్ పెల్విస్, ఎఫ్ఎస్‌హెచ్, ఎల్‌హెచ్, ఎఫ్ఎస్‌హెచ్, ప్రొలాక్టిన్, టెస్టోస్టిరాన్ రక్తపరీక్షలు చేసి నిర్ధారించవచ్చు.

### హోమియో చికిత్స

పీసీఓడీ నిర్ధారించిన తరువాత త్వరగా హోమియో వైద్యం మొదలుపెట్టాలి. పేషెంట్ యొక్క మానసిక తత్వం, శారీరక తత్వంతోపాటు ముఖ్యమైన వ్యాధి లక్షణాలను కలిపి హోలిస్టిక్ చికిత్స ద్వారా పీసీఓడీని నయం చేయవచ్చు. ఈ హోమియో వైద్యంతో ఎటువంటి దుష్ఫలితాలు లేకుండా సహజంగా హార్మోన్స్ బ్యాలెన్స్ అవుతాయి.

# దాంపత్య సమస్యలకు దీటైన వైద్యం


**డాక్టర్ టి.ప్రభాకర్,** MD హోమియో
MS సైకాలజీ & కౌన్సెలింగ్,
పీజీ డిప్లొమా ఇన్ సెక్సాలజీ
బెస్ట్ డాక్టర్ 2016, హోమియో ట్రెండ్స్
హైదరాబాద్, సికింద్రాబాద్, విజయవాడ, వైజాగ్
ఫోన్స్: 77 3000 3000 , 77 3000 4000




**అసంతృప్త** జీవితం, నిరాశజనకం, భార్యాభర్తల మధ్య తరచూ జరిగే మానసిక సంఘర్షణకు కారణం. జీవనగమనంలో ఎన్నో ఒత్తిళ్లు, ఇబ్బందులు వీటికి తోడు దాంపత్య, సుఖ సమస్యలు తోడైతే జీవితంపై విరక్తి జనిస్తుంది. అందులో నేడు యువకులలో సైతం కలవరపెట్టే సమస్య ఎవరికీ చెప్పుకోలేక కుమిలిపోతుంటారు.

### శీఘ్రస్ఖలనం

ఇది దాంపత్య సుఖసమస్య. అంగప్రవేశం చేసిన వెంటనే వీర్యం పడిపోతుంది. తృప్తి కలగదు. పురుషుల్లో కలిగే అతిపెద్దభయం. శీఘ్రస్ఖలన సమస్యకు కారణం ఒత్తిడి, మానసిక సమస్య, హార్మోన్ లోపాలు. కండరాలు, నరాలు, రక్తనాళాలు వీటి పాత్ర తక్కువ. పరిశోధన ద్వారా తేలిన నిజమేమిటంటే

- రక్తనాళాల్లో నాడీ వ్యవ స్థలో అంతటా ఉండే సెరటోనిన్ పరమాణం తగ్గుట అని తెలిసింది.
- వంశానుగతంగా, జన్యుపరంగా వచ్చే లోపాలు
- ప్రొస్టేట్ వ్యాధులు
- యురెత్రా(మూత్రనాళం) వాపు, ఇన్‌ఫెక్షన్లు, రక్తపోటు, డయాబెటిస్, మధ్యపానం.
- యాంటీ డిప్రెషన్ మందులు వాడటం
- వెన్నెముక గాయాలు, పెరాలసిస్
- హైపర్ లేక హైపో థైరాయిడ్
- ఇతర ప్రమాదాలు, శస్త్రచికిత్సలు, నరాలు దెబ్బతిన్న వారిలో



**హోమియో వైద్య విధానంలో వ్యాధి మూలాలను సరిచేయుటకు అత్యంత శక్తివంతమైన, సులభమైన సైడ్‌ఎఫెక్ట్స్ లేని చికిత్స ఉంది.**

### చికిత్స

హోమియో వైద్య విధానంలో వ్యాధి మూలాలను సరిచేయుటకు అత్యంత శక్తివంతమైన, సులభమైన సైడ్‌ఎఫెక్ట్స్ లేని చికిత్స ఉంది. వ్యాధి నివారణ, అవగాహన, ఆహార, విహారాలు చేయాల్సిన ఇతర శారీరక ఎక్సర్‌సైజులు, అనుభవజ్ఞులైన, నిష్ణాతులైన వైద్యులచే చికిత్స హోమియోట్రెండ్స్‌లో లభిస్తుంది.

హెర్పిస్, క్యాండిడియాసిస్, గనేరియా, సిఫిలిస్, ఇతర సెక్స్ వ్యాధులకు సైతం హోమియోట్రెండ్స్‌లో చికిత్స లభిస్తుంది.

ADVT

మే 15 ప్రపంచ కుటుంబ దినోత్సవం సందర్భంగా...



# కలసి ఉంటే కలదు సుఖం

**భారతీయ సంస్కృతి, సంప్రదాయాలకు, నాగరికత పురోగతికి మూలం మన భారతీయ కుటుంబ వ్యవస్థ. ప్రపంచ దేశాలన్నింటికీ ఆదర్శం మన కుటుంబ వ్యవస్థ. అప్పట్లో ఉమ్మడి కుటుంబాలు ఉండేవి. కారణాలేమైతేనేం కాలక్రమేణా ఉమ్మడి కుటుంబాలు కాస్తా చిన్న చిన్న కుటుంబాలుగా మారిపోయాయి. . అప్పటి ఉమ్మడి కుటుంబాలు సిరిసంపదలతో తులతూగాయనడంలో సందేహం లేదు. సమాజాభివృద్ధిలో కుటుంబం పాత్ర చెప్పుకోదగినది.**

ఒక కుటుంబంలో మూడు నుంచి నాలుగు తరాలు 'ఉమ్మడి' గొడుగుకిందే ఒదిగిపోయేవి. ఇంటి పెద్దకు అందరూ గౌరవం ఇచ్చేవారు. అందరిదీ ఉమ్మడి వ్యవసాయం, సమష్టి సంపదే. సమష్టి గానే భోజనాలు చేసేవారు. తల్లిదండ్రులు, అత్తమామలు, అక్కచెల్లెళ్ళు, అన్నదమ్ములు, బావామరదళ్ళు, బంధుమిత్రులు, తాతలు, బామ్మలు, మనవలు, మనవరాండ్లతో ఆనాటి కుటుంబాలు కళకళలాడేవి. లేమి అనే పదానికి ఆ కుటుంబాల్లో తావుండేది కాదు. కష్టసుఖాలు సమానంగా పంచుకునే ఆత్మీయులు, ఆపదలో ఆదుకునే బంధుమిత్రులతో ఒంటరితనానికి చోటుండేది కాదు.

## అంతర్జాతీయ కుటుంబ దినోత్సవం

పెరిగిన ఆధునికత, నాగరికత పురోభివృద్ధి, శాస్త్ర, సాంకేతిక పరిజ్ఞానం వెరసి ఉమ్మడి కుటుంబవ్యవస్థపై తీవ్ర ప్రభావం చూపిస్తున్నాయి. ఇప్పుడున్న సమాజంలో రెండు కుటుంబాలు కాదుకదా రెండు మనసులు కూడా కలిసి జీవించడం కష్టంగా ఉంది. ఇంట్లో ఉన్న నలుగురు వ్యక్తులే ఒకరినొకరు పలకరించుకోలేని పరిస్థితి నెలకొంది. ఉమ్మడి కుటుంబాల్లో కలిసిమెలిసి మనగలిగే మనస్తత్వాలు లోపించి పెళ్ళైన మరునాడే వేరుకాపురాలు పెట్టుకుని జంటలుగా ఒంటరైపోతున్నారు. దీంతో సలహాలిచ్చే పెద్దదిక్కు లేకపోవడం, ఆపదలో ఆదుకునే ఆత్మీయులు దూరం కావడం, కనీసం మనసులో బాధలు పంచుకునే బంధువులు కరువవ్వడం నేటి సమాజంలో మనకు నిత్యం కనిపించే దృశ్యాలు. అందుకే ప్రపంచవ్యాప్తంగా కుటుంబవ్యవస్థను కాపాడుకోలేకపోతే కలిగే సామాజిక వైఫల్యాలను వివరించి ప్రజలను చైతన్యపరిచేందుకు ఐక్యరాజ్యసమితి నడుం బిగించింది.

విచ్ఛిన్నమవుతున్న కుటుంబాల మధ్య సఖ్యత పెంపొందించే దృఢ సంకల్పంతో వరల్డ్ ఫ్యామిలీ డే నిర్వహిస్తోంది ఐక్యరాజ్య సమితి. కుటుంబ నైతిక, సామాజిక సూత్రాలు రూపొందించి, సమాజాభివృద్ధిలో కుటుంబంపాత్ర పెంచడంకోసం కుటుంబ సమైక్యత, సంఘటితం గురించి ప్రజలందరికీ అవగాహన కలిగిస్తూ అంతర్జాతీయ స్థాయిలో సుస్థిర కుటుంబాల కోసం కృషి చేస్తోంది.

అంతర్జాతీయ కుటుంబ దినోత్సవం 1993లో ప్రారంభమైంది. ఈ దినోత్సవం నిర్వహించుకోవాలని ఐక్యరాజ్య సమితి జనరల్ అసెంబ్లీ ప్రకటించింది. పలుదేశాల్లో మే 15న దీన్ని జరుపుకుంటున్నారు. ప్రతి సంవత్సరం ఒక కొత్త ప్రతిపాదనతో ఈ కుటుంబ దినోత్సవం జరుపుకుంటారు. ఈ సందర్భంగా కుటుంబ ప్రాముఖ్యతపై వివిధ రకాల సంస్థలు అవగాహన కల్పిస్తాయి. ఏడాదిలో ఒకసారైనా కుటుంబంలోని అందరు సభ్యులు కలుసుకునేందుకు ఇవి తోడ్పడతాయి.

## ఎందుకిలా జరుగుతుంది?

ప్రగతిపథంవైపు జనజీవనరథం పరుగులు పెడుతోంది. ముందుకు వెళ్ళాలంటే మనం కూడా పరుగుపెట్టాల్సిందే. ఆ పరుగులో అలసిపోయినప్పుడు, మనవాళ్ళకు దూరంగా వెళ్ళినప్పుడు కుటుంబం గుర్తుకువస్తుంది. సమస్యల్లో చిక్కుకున్నప్పుడు కుటుంబ సభ్యులమధ్య సేదతీరాలనిపిస్తుంది. ఆర్థిక అవసరాలు తీర్చుకోవడానికి లేదా ఇష్టాయిష్టాలమేరకు ఓ కుటుంబంలో దంపతులిద్దరూ పనిచేయాల్సి వస్తోంది. పనివేళలు, ఒత్తిడి వారిపై విపరీత ప్రభావం చూపుతున్నాయి. ఇంట్లో మిగతా సభ్యులకోసం తగినంత సమయం వారు వెచ్చించలేకపోతున్నారు. మనసులో ఉన్న మమకారాన్ని వ్యక్తం చేసే తీరిక ఉండటం లేదు. చిన్నపిల్లలు, వృద్ధులున్న ఇళ్ళల్లో ఇది పెద్ద సమస్యగా మారింది. పిల్లల ఆలనాపాలన, ఆరోగ్యం, చదువువంటి అంశాలపై ప్రత్యక్షంగా తల్లిదండ్రుల పాత్ర తగ్గిపోతోంది. బిజీ లైఫ్‌లో ఇది తప్పడం లేదు. ఆప్యాయంగా సుద్దులు, బుద్ధులు చెప్పాల్సిన తల్లిదండ్రుల బిజీ ఒక రొటీన్ వ్యవహారంగా మారిపోవడంతో పిల్లలు మానసికంగా ఒంటరివారవుతున్నారు. యాంత్రిక జీవనానికి అలవాటుపడుతున్నారు. ఇక ఇంట్లో ఉండే వృద్ధుల్ని పలకరించేవారు, పట్టించుకునేవారు లేకపోవడంతో ఆ దిగులు వారిని మరింత కుంగదీస్తోంది. కొడుకు, కోడలు మంచివారైనాగానీ వారికి తీరిక లేకపోవడంతో వృద్ధులు ఓల్డేజ్ హోమ్స్‌లో గడపాల్సి వస్తోంది. ఇవన్నీ వారి మానసిక ఆరోగ్యాన్ని దెబ్బతీస్తున్నాయి. కుటుంబంలో అందరూ కలిసి,



హాయిగా గడపాల్సిన చోట హడావుడిగా, చిరాకుగా గడపడం తప్పడం లేదు. ఒకరికొకరు తోడుగా ఉండటం, బాధ్యతలు పంచుకోవడం, మానసికంగా నేనున్నాననే భరోసా ఇవ్వడం వంటి లక్షణాలు కుటుంబ సభ్యులకు ఉపశమనమిచ్చే అంశాలు. పాశ్చాత్య సంస్కృతిలో ఇది లోపించింది. ఇప్పుడిప్పుడే ఇది మనదేశంలో కూడా విస్తరిస్తోంది. అక్కడ అన్ని కుటుంబాలూ అలా ఉన్నాయనేం కాదుగానీ చాలా కుటుంబాల్లో పరిస్థితి మాత్రం అదే. ఇక్కడ ఒకరికోసం ఒకరనే రీతిలో కుటుంబ వ్యవస్థ మనుగడ సాగిస్తుంటే అక్కడ ఆర్థిక, వ్యక్తిగత ఇష్టాలదే ప్రాధాన్యం. అందువల్ల పాశ్చాత్యదేశాల్లో బలమైన కారణాలు లేకుండానే విడిపోతున్న దంపతులు కుటుంబ వ్యవస్థను దెబ్బతీస్తున్నారు. వారికి పుట్టిన పిల్లలు మానసికంగా దెబ్బతింటున్నారు. ఈ పరిణామం సమాజంపై పెనుప్రభావం చూపిస్తోంది. ఒక అధ్యయనం ప్రకారం ఇలా విడిపోయిన కుటుంబాల పిల్లల్లో 45 శాతం మంది వ్యసనాలకు బానిసలవుతున్నారు. 75 శాతం మంది యువత తల్లిదండ్రులతో కలిసి ఉండాలన్న ఆకాంక్ష వ్యక్తం చేస్తున్నప్పటికీ, అలా ఉంటున్న వారి సంఖ్య 40 శాతం లోపే. ముఖ్యంగా అమెరికాలో ఈ పరిస్థితి ఉంది. మరీ ముఖ్యంగా మహిళలు ఉద్యోగాల్లో చేరినప్పుడు కుటుంబంలో 'బాలెన్స్' తప్పుతోంది. కుటుంబ, ఉద్యోగ బాధ్యతలు రెండింటి వల్లా మహిళలపై ఒత్తిడి పెరుగుతోంది. ఇక ఓల్డేజ్ హోమ్స్‌లో చేరుతున్న పెద్దల మనసులోని భారం తగ్గించడం 'కుటుంబం' వల్లే సాధ్యమవుతుంది కానీ సమాజంవల్ల కానేకాదు.

### ఇది కూడా ఓ కారణమే

'ఇంటిని చూసి ఇల్లాలిని చూడాలి' అన్నారు పెద్దలు. ఎందుకంటే ఇంటి అలంకరణ మాత్రమే కాదు కుటుంబ సభ్యుల వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దేది కూడా మహిళలే. ప్రస్తుత ఆర్థిక పరిస్థితుల దృష్ట్యా భార్యాభర్తలు ఉద్యోగాలు చేస్తున్నారు. ప్రపంచంలో మహిళలకు ఉద్యోగాలు ఏడాదికేడాదికీ పెరుగుతున్నాయి. ఆర్థికంగా ఇది శుభసూచకమే అయినా కుటుంబ వ్యవస్థకు ఇదో పెద్ద సవాలు విసిరింది. ఇంటిని, కుటుంబ సభ్యులను దగ్గరుండి చూసుకునే ఇల్లాలు, ఉద్యోగానికి వెళ్ళడంతో కుటుంబం ఒంటరితనం భరించాల్సి వస్తోంది. అమెరికాలాంటి పెద్దదేశాల్లో ఇది పెద్ద సామాజిక సమస్యగా మారిపోయింది. మహిళలకు ఉద్యోగాల్లో ఎక్కువ అవకాశాలు కల్పిస్తున్న దేశాల్లో స్కాండినేవియా మొదటి స్థానంలో, కెనడా రెండో స్థానంలో, అమెరికా మూడో స్థానంలో ఉన్నాయి. ఈ పరిణామం అమెరికానే ఎక్కువ కలవరపరుస్తోంది.

### ఇప్పుడిప్పుడే తెలుస్తోంది

పోల్చిచూస్తే ఉమ్మడి కుటుంబవ్యవస్థ పూర్వం ఉన్నంత విస్తృతంగా ఇప్పుడులేదు. ఇప్పుడు చిన్న కుటుంబాలదే రాజ్యం. ఈ పరిణామంతో ఆర్థికంగా ఎదుగుతున్న కుటుంబాలు మానసికంగా బలహీన పడుతున్నాయి. ఈ పరిణామాలు కొన్ని కుటుంబాలను దెబ్బతీస్తున్నాయి. పరిమిత కుటుంబాల సంఖ్య పెరిగింది. ఈ నేపథ్యంలో ఇంటి పెద్దకు పనిభారం పెరిగిపోతోంది. లంకంత ఇల్లున్నా మహిళలు, పిల్లలు, పెద్దలకు ఒంటరితనం తప్పడం లేదు. మన దేశంలో ఈ విపరిణామం స్వల్పస్థాయిలోనే ఉంది గానీ, పాశ్చాత్య ప్రపంచంలో కుటుంబాలు కకావికలమైపోతున్నాయి. భారతదేశంలో కుటుంబ వ్యవస్థను పరిశీలించి, అనుసరించేందుకు ఇప్పుడు ఎన్నెన్నో దేశాలు ఉత్సాహం చూపుతున్నాయి. 'కుటుంబం' విలువ ఏమిటో ఈనాటి ఆధునిక ప్రపంచం ఇప్పుడిప్పుడే తెలుసుకుంటోంది. మిగతా వ్యవస్థలతో పోలిస్తే మనదేశంలో అల్లుకున్న కుటుంబ బంధం అంత సులువుగా తెగిపోయేదికాదు. కొన్నేళ్ళ క్రితం 'చిన్నకుటుంబం, చింతలేని కుటుంబం' అన్న ప్రకటన జనసామాన్యంలోకి ఎంతగా చొచ్చుకుపోయిందో అందరికీ గుర్తే. అధిక జనాభా అదుపుచేసేందుకు తలపెట్టిన కార్యక్రమాల ప్రచారంకోసం చేసిన ఆ ప్రకటన లక్ష్యం కుటుంబాన్ని పరిమితం చేసుకోవడమే. అయితే ఉమ్మడి కుటుంబాల విలువ, వాటి అవసరం ఏమిటో చాలామంది అనుభవంలో ఇప్పుడిప్పుడే తెలుసుకుంటున్నారు. 'నిండుకుటుంబం' కోసం తహతహలాడుతున్నారు.

– పుష్పలత

## కలిసి జీవించడానికే

*విడిపోతున్న తల్లిదండ్రులవల్ల పిల్లలు ఎదుర్కొంటున్న సమస్యలకు, సమాజానికి ఎదురయ్యే సవాళ్ళకు పరిష్కారం కుటుంబవ్యవస్థ వర్ధిల్లడమేనని తాజా అధ్యయనాలు వెల్లడిస్తున్నాయి.*

*అమెరికాసహా చాలాదేశాల్లో 56 శాతం యువత ఇంటిపట్టున అంటే కుటుంబంతో కలిసి ఉండాలని కోరుకుంటోందని ఓ అధ్యయనంలో తేలింది. దాదాపు 63 శాతం పిల్లలు తల్లితో చనువుగా, మనసువిప్పి మాట్లాడాలనుకుంటారని, ఇక 43 శాతం మంది పిల్లలు తండ్రితో చనువుగా, స్నేహంగా ఉండాలనుకుంటున్నారని తేలింది. అక్కడ 67 శాతం మందికి పైగా పిల్లలు వారి వారి తల్లిదండ్రులకు దూరంగా ఉండాల్సి వస్తోంది. అదృష్టవశాత్తూ భారతదేశ కుటుంబవ్యవస్థ ఇప్పటికీ చెక్కుచెదరలేదు. అయితే ఇప్పుడిప్పుడే పాశ్చాత్య పోకడలకు కొందరు ఆకర్షితులవుతూండటంతో ఇక్కడి కుటుంబాల్లోనూ కలకలం మొదలవుతోంది.*

## కుటుంబమే ప్రాధాన్యం

*మహిళలు అన్నిరంగాల్లో పురుషులతో పోటాపోటీగా దూసుకుపోతున్నా కుటుంబ బాధ్యతలను ఏమాత్రం విస్మరించడం లేదు. కొత్త అవకాశాల కోసం దేశ సరిహద్దులు దాటి ప్రయాణించినా ఇంటి అవసరాలు తీర్చడంలో మహిళలే ప్రధాన పాత్ర పోషిస్తున్నారు. డబ్బును బదిలీ చేసే సర్వీస్ ప్రొవైడర్లలో ప్రధానమైన వెస్ట్రన్ యూనియన్ సంస్థ 'ఇతర దేశాలకు వలసవెళ్ళిన మహిళలు– ఆర్థిక ప్రభావం' అనే అంశంపై అధ్యయనం చేసింది. ఆ సర్వేలో తేలిన విషయాలేంటంటే,*

- *గల్ఫ్ దేశాలకు వలసవెళ్ళిన మహిళల్లో చాలా మంది తల్లులు లేదా తల్లిదండ్రులకు చేయూత నిచ్చేందుకు వెళ్ళినవారే.*
- *ముఖ్యంగా పురుషులు, స్త్రీలు డబ్బు పంపుతున్నది ఎక్కువగా మహిళలకే (డబ్బును అందుకుంటున్న వారిలో మూడింట రెండొంతులు వారే). దీన్ని బట్టి ఇంటి ఆర్థిక వ్యవహారాల నిర్వహణలో మహిళలు ఎంత కీలకమో తెలుస్తోంది.*
- *ప్రవాసంలో ఉన్న యువకులు, తండ్రులు పంపుతున్న డబ్బుతో సమానంగా మహిళలు కూడా డబ్బు పంపిస్తున్నారు. మగవారి కన్నా తక్కువ సంపాదిస్తున్నప్పటికీ సంపాదనలో ఎక్కువ భాగం కుటుంబానికి పంపుతున్నారు.*



# పెళ్ళి



సెల్ : 98480 33150

రావులపాటి వెంకటరామారావు



**వేంకటేశ్వరస్వామి దర్శనార్థం గట్టు వద్దకు చేరేసరికి సాయంత్రం అయిదున్నర దాటింది. జనం చాలా పలచగా ఉన్నారు. రెండు జంటలు మెట్లు దిగుతున్నాయి. మరో ముగ్గురు కుటుంబ సభ్యులు ప్రసాదం ఆరగిస్తూ మెట్లమీద కూర్చుని ఉన్నారు. వాళ్ళను చూస్తూ పది మెట్లు గబగబా ఎక్కాను. కుడి పక్కన నీళ్ళపంపు కనిపించింది. వెళ్ళి నీళ్ళతో కాళ్ళు శుభ్రం చేసుకున్నాను. కళ్ళజోడు తీసి పైజేబులో పెట్టుకునే లోపల ఒక మెరుపు మెరిసినట్లైంది. నా చేతిలో కళ్ళజోడు లేదు. కిచకిచమని శబ్దమైతే అయోమయంగా పైకి చూశాను. కొమ్మమీద కూర్చుని ఉన్న కోతి చేతిలో నా కళ్ళజోడు ఉంది. ఎంత లాఘవంగా లాక్కుంది అని ఆశ్చర్యపోతూ కింకర్తవ్యం అని అనుకుంటుండగా... దేవుడిలా...ఇది దేవునిగుడేగా...అక్కడి స్టాఫ్ ఒకతను అక్కడికొచ్చి "కళ్ళజోడు కోతి ఎత్తుకుపోయిందా సార్? అయ్యయ్యో కొరుకుతుంది... ఉండండి చెబుతాను" అని అక్కడున్న పొడుగాటి కర్ర తీసుకుని పైకి ఎక్కుతున్నట్టు బెదిరించాడు.**

చేతి నుండి జోడు వదిలేసింది కోతి. దానికోసమే సిద్ధంగా ఉన్నట్లు చేతిలో ఉన్న కర్ర వదిలేసి, జారిపడుతున్న జోడును జాగ్రత్తగా పట్టుకున్నాడు అతను. కృతజ్ఞతలు చెబుతూ పది రూపాయలు చేతిలో పెట్టాను. నవ్వుతూ తీసుకున్నాడు. అందరిలాంటివాడే ఇతడు కూడా! మామూలు మనిషే కదా అనిపించింది. వెంటనే అలా అనుకున్నందుకు సిగ్గుపడ్డాను. గుడిలోకి ప్రవేశించాను. పూజార్లు అప్పటికే అలసిపోయినట్లు కనిపించారు. ఇద్దరిలో ఒకరు "బాబూ రండి! గుడి తలుపులు మూసే టైమ్ అయింది. అర్చన ఏమన్నా చేయిస్తారా?" అని ప్రశ్నించాడు. తలూపాను 'అష్టోత్తరం' అని అంటూ. స్వామికి మనసారా నమస్కరించాను. చాలా ఆకర్షణీయమైన విగ్రహం. అష్టోత్తరం అయిన తర్వాత మరో పూజారి హారతి ఇచ్చి తీర్థం ఇచ్చి శఠగోపం పెట్టారు.

"అయ్యా ఇటు చూడండి. మూలవిరాట్టు. ఈ స్వామి భక్తులకు కొంగుబంగారం. ఈ చుట్టుపక్కలే కాదు మన రెండు రాష్ట్రాలతో పాటు దేశంలోని వివిధ ప్రాంతాల నుండి భక్తులు వస్తారిక్కడకి. మొక్కులు తీర్చుకుంటారు. ప్రత్యేకత ఏమిటంటే ఇక్కడెవరూ రాత్రి నిద్ర చెయ్యరు. సూర్యాస్తమయం కాగానే గుడి తలుపులు మూసివేసి అందరం కిందికి చేరుకోవాల్సిందే! అదే తిరుమలగిరి క్షేత్ర మహాత్మ్యం!" స్వామికి సాష్టాంగపడి ఆలయం బయటకు వచ్చి ప్రసాదం తీసుకుని "బాబూ ఇక్కడ గాయత్రి సత్రం ఎక్కడ" అని సెక్యూరిటీని అడిగాను. "గట్టు దిగి అలా పది నిమిషాలు నడిస్తే పెద్ద బంగళా వస్తుంది. అదే గాయత్రి సత్రం" అని జవాబు చెప్పాడు.

సరిగ్గా పది నిమిషాలు నడిచేసరికి ఒక పెద్ద బిల్డింగ్ కనబడింది. కొంచెం దగ్గరగా వెళ్ళేసరికి తాటాకులపందిరి వేసివుంది. సందడి బాగా కనబడుతున్నది. వినబడుతున్నది కూడా. తాటాకుల పందిరి మీద పలచగా నీళ్ళు చల్లినట్లున్నారు. పచ్చివాసన కొడుతున్నది. నేలంతా బాగా చదునుచేసి నీళ్ళు చల్లి రంగురంగుల ముగ్గులు వేశారు. రంగులలో 'చి. వినయ్, చి.ల.సౌ. సౌమ్యల వివాహానికి మీకు స్వాగతం" అంటూ ఆకర్షణీయంగా రాశారు. 'వెరైటీగా ఉందే' అనుకుంటూ ముందుకు సాగాను.

'అదిగో మా శేషుబాబాయ్ ఎవరితోనో దబాయించి మాట్లాడుతున్నాడు. బహుశా ఇంగ్లీషులో ఇరగదీస్తున్నట్లుంది. ఇప్పుడు నేను కనబడితే నన్నూ వాయించేస్తాడు' అని నెమ్మదిగా వేరే ద్వారంవైపు నడిచాను. తప్పించుకున్నాను. ఇద్దరాడపిల్లలు లంగా ఓణీల్లో చక్కగా ముస్తాబై నాకు ఎదురయ్యారు. ముచ్చటేసింది. పర్వాలేదు. ఇలాంటి సందర్భాలలో సాంప్రదాయ అలంకరణ మర్చిపోలేదని ఆనందమేసింది.

"ఒరేయ్ రవీ... ఇదేనా రావడం" అని నవ్వుకుంటూ నావైపు వస్తున్న సత్యం బాబాయ్‌ని చూశాను. ధోవతి కట్టి పైన లాల్చీవేసి ఆపై కండువా వేసుకుని మెరిసిపోతున్నాడు. "బాబాయ్ ఏంటీ

## నవ్యవీక్లి-ఉపాధ్యాయుల భాస్కరరావు స్మృతి సాహితి కథల పోటీలో విశేష బహుమతి రూ.5,000 పొందిన కథ

మార్పు? గుర్తుపట్టలేదు తెల్సా నిన్ను! కాని ఈ డ్రెస్‌లో భలేగా ఉన్నావు" అన్నాను.

"ఏం రా అమ్మాయిని తీసుకురాలేదా? ఇద్దరూ కలిసి వస్తే భలేగా ఉండేది. ఎంతో ఎంజాయ్ చేసే వాళ్ళు".

"వీలు కాలేదు బాబాయ్. ఏమిటీ విశేషం? పెళ్లి సరే అనుకో.."

"పెల్లి కాదు పెళ్ళి. వెరైటీ ఏమిటంటే ఇది ఐదు రోజుల పెళ్ళి. గత నాలుగు రోజుల నుండి ఒకటే సందడి. అటూ ఇటూ రెండు కుటుంబాలు, స్నేహితులు, బంధువులు, అందుకే ఐదు రోజుల ముందు రమ్మన్నాను".



"బాగుంది బాబాయ్."

"పద పద! కాళ్ళు కడుక్కో. ఇంకో విషయం కొండపైకి రేపు వెళ్ళవచ్చు, అన్ని ఏర్పాట్లు చేశాను".

"స్వామి దర్శనం చేసుకునే ఇక్కడకు వచ్చాను బాబాయ్".

"ఇహనేం? భేష్! శేషన్నయ్యా... ఎవరొచ్చారో చూడు" శేషు బాబాయిని కేకేశాడు. ఇహ ఇంగ్లీష్ ఝరి తప్పదా? అనుకుంటుంటే "నన్ను దాటేసుకుని ఎలావచ్చావురా? క్షేమమేనా? ఒక్కడివే వచ్చావా? అమ్మాయి రాలేదా? పిల్లలు ఆస్ట్రేలియాలోనేనా? ఈ మధ్య ఏమన్నా వచ్చారా? నీ ఉద్యోగం ఎలా ఉంది? మీ ఆవిడ ఉద్యోగం చేస్తున్నదా?" ప్రశ్నలు కురిపిస్తూ ఆప్యాయంగా భుజం మీద చెయ్యి వేశాడు శేషుబాబాయ్.

"అందరం బావున్నాం... అద్సరే గాని, నువ్వేంటి బాబాయ్ షాకిచ్చావ్. ఇంగ్లీషులో తప్ప తెలుగులో మాట్లాడటానికి చిరాకు పడేవాడివి. ఇదేమిటి తెలుగులోనే దంచేస్తున్నావు" అన్నాను నవ్వుతూ.

"ఇది మా సత్యం ఆర్డర్. వాడి ఆనందం వాడిది. నేనెందుకు కాదనాలి చెప్పు. వాడు ఈ నాల్రోజులూ తెలుగే మాట్లాడాలన్నాడు. కాదనలేకపోయాను. ఏ మాటకి ఆ మాట చెప్పుకోవాలి. తెలుగు మాట్లాడుతోంటే బలే ఉందిరా అబ్బాయి. హాయిగా ఉంది." అని గట్టిగా

నవ్వాడు శేషుబాబాయ్. నన్ను అభిమానంగా దగ్గరకు తీసుకున్నాడు. బాగుందనిపించింది. యాంత్రిక జీవితం, దాని కృత్రిమత్వం గుర్తొచ్చి కళ్ళు చెమ ర్చాయి. వెళ్ళి కాళ్ళు కడుక్కున్నాను. ఎవరో టవల్ అందించారు. కూర్చోమని కుర్చీ చూపించారు. ప్రశాంతంగా కూర్చుంటూ వాతావరణాన్ని గమనిస్తు న్నాను. ఇంతలో జయ పిన్ని హడావుడిగా వస్తూ "ఏవర్రా! రవి వచ్చాడటగా, ఎక్కడ్రా వాడు?" అని ఎవరినో అడుగుతోంది. "ఇదిగో ఇక్కడ పిన్నీ" అని నేను కుర్చీలోంచి లేచి నిలబడ్డాను. "ఏమయ్యా ఇప్పుడు తీరిందా? సంతోషం..వచ్చావు. అదే పది వేలు. కాకపోతే నీకు యాభైశాతం మాత్రమే మార్కులు. అమ్మాయిని తీసుకు రాలేదుగా, దానికి యాభైశాతం కట్" అంటూ తన టీచర్ స్వభావాన్ని చూపించింది. నేను నవ్వుతూ పిన్ని సామాన్యు రాలు కాదనుకున్నాను. ఎంతైనా లెక్కల టీచర్! అనుకున్నాను. వేడి వేడి కాఫీ వచ్చింది. ఆ పొగల్లో కూడా ప్రేమ రంగరించినట్లుగా అనిపించింది. "చూడు రవీ.. నీవు ఎల్లుండి వరకు కదలడానికి వీల్లేదు. మాతో పాటే నీ తిరుగు ప్రయాణం. నాన్నా కృష్ణా! అన్నయ్యకు గెస్ట్ రూమ్ చూపించు. అన్ని సౌకర్యాలూ ఉన్నాయి వైఫై, ఇంటర్నెట్ తప్ప. మొబైల్ ఎలౌడ్ కాని అదేపనిగా చెవికి గమ్ రాసుకుని మొబైల్ని అంటిస్తే మాత్రం చెవికట్" అన్నది పిన్ని, ఆటపట్టిస్తూ.

"అలాగే పిన్ని" అనే లోపల మాయమైంది. లేచి నిలబడి నా బ్యాగ్ తీసుకుని రూమ్‌వైపు నడి చాను. నేలంతా నున్నగా ఉంది. అలికినట్టున్నారు. ఇటుక పొడుం రంగులో మెరుస్తోంది. మధ్యలో చిన్న వేదిక ఏర్పాటుచేశారు. ఎటునుంచి చూసినా వేదిక మధ్యలో ఉన్నట్టుంది. దక్షిణం వైపు కొంచెం ఎడంగా వరసగా గదులు. మధ్యలో పైకి వెళ్ళడా నికి మెట్లు. పైన మరో నాలుగు గదులు. ఆవరణ అంతా చెట్లతో, పూలమొక్కలతో నిండుగా ఉన్నది. ఎదురుబడ్డ వాళ్ళు నవ్వుతూ పలకరిస్తూ వెళ్తు న్నారు. శేషుబాబాయి కూతురు వేణి "రవన్నయ్యా! బాగున్నావా? నీలో ఏ మార్పూ లేదు, ఇంకా హీరో లానే ఉన్నావు" అన్నది.

"నువ్వింకా ఎదురుపడి పొగడడం లేదేంటబ్బా అనుకుంటున్నాను."

"ఇదిగో అన్నయ్యా! వీడు నా కొడుకు హితేష్" అని వాణ్ణి పరిచయం చేసింది. ఆశ్చర్యం వాడూ ధోవతి డ్రెస్‌లోనే ఉన్నాడు.

"ఒరే నిజం చెప్పరా, నువ్వు ఇష్టపడే ఈ డ్రెస్ తీసుకున్నావా? లేక..."

"కరెక్ట్‌గా గెస్ చేశావు మామయ్యా! ఫ్రీగా వస్తోంటే కాదనలేకపోయాను. కాని కట్టుకున్న తర్వాత చాలా కంఫర్టబుల్‌గా ఉంది. నాలుగు రోజుల నుండి ఇదే డ్రెస్.. కాకపోతే ప్రతీరోజు ఉతుక్కోడం అదనపు ఆకర్షణ." అని నవ్వాడు.

"నిజం మామయ్యా వియ్ ఆర్ ఎంజాయింగ్ ఎవ్రీ మూమెంట్. థాంక్స్ టు తాతయ్య అండ్ అమ్మమ్మ. పెళ్ళి చూడటంలో ఇంత ఆనందం ఉందంటే మరి పెళ్ళి చేసుకుంటే ఎంత ఆనందమోకదా! మ్యారీడ్ లైఫ్ బాగుంటుందైతే."

"నిజమేరా! చాలా బాగుంటుంది. ముందు మనసులు కలవాలి. ఆ తర్వాతే పెళ్ళి ప్రస్తావన రావాలి. ప్రేమకు రెండు మనసులు చాలు. కాని పెళ్ళికి రెండు కుటుంబాలు కావాలి."

"గొప్పగా చెప్పావు మామయ్యా! కాని నీ మాటల్లో ఏదో తొంగి చూస్తోంది. ట్రెడిషనల్ మ్యారే జెస్‌కి నువ్వు వ్యతిరేకం అనిపిస్తోంది. నువ్వు లవ్ మ్యారేజెస్‌కి ఓటేస్తున్నట్టుంది."

"నీకలా అర్థమైందా, రెండూ ఒకటేరా! పెళ్ళిచూ పుల్లో మాత్రం లవ్‌లో పడడం ఉండదా? అంటూ నా రూమ్‌లోకి వెళ్ళి ఫ్రెష్ అయి బయటపడేసరికి ఆడా మగా అందరూ మంటపం దగ్గరకు చేరారు. పిల్లలు వాళ్ళ చుట్టూ తిరుగుతూ అల్లరి చేస్తు న్నారు. మెట్లు దిగి కిందికి వచ్చాను. గోలగోలగా ఉంది. ఎదురుకోళ్ళట! మంటపం పూలతో అలంక రించారు. వాళ్ళకు వీళ్ళూ, వీళ్ళకు వాళ్ళూ కొత్త కాదు. పెళ్ళికొడుకు వినయ్, సౌమ్యకు మామయ్య వరస అవుతాడు. సత్యంబాబాయ్ కొడుక్కి, శేషు బాబాయ్ మనవరాలిని ఇస్తున్నారు. అంటే... కూతురు కూతుర్నిచ్చి పెళ్ళి చేస్తున్నారు. ఈ కుటుంబాలన్నీ చాలా కలివిడిగా ఉండి, ఎటువంటి పొరపొచ్చాలు లేకుండా ఉంటున్నాయి. ఒకరికొకరు ఆసరాగా ఉండి, జీవితాలు పండించుకుంటున్నారు. కోడళ్ళు కూడా కలిసి ఉంటే కలదు సుఖమనే సూత్రానికి కట్టుబడి ఉన్నారు. అయితే కొత్త తరం పైకి వస్తున్నది. వాళ్ళూ చదువులు పూర్తిచేసి ఉద్యో గాల్లో చేరి పెళ్ళివయసుకి ఎదిగారు. బయటకు కనబ

**చిన్న వేదిక. చక్కగా అలంకరించి ఉంది. పలకరింపులు, నవ్వులతో సందడిగా సందడిగా ఉంది. మగవాళ్ళందరూ పంచెలతో, ఆడవాళ్ళు చక్కగా పట్టుచీరలు కట్టుకుని కనువిందు చేస్తున్నారు. కుటుంబ సభ్యులు, బంధువులు, స్నేహితులంతా అటూ ఇటూ తిరుగుతూ హడావిడి చేస్తున్నారు. వచ్చినవాళ్ళకి అతిథిమర్యాదలు చేస్తున్నారు. మరి ఐదురోజుల పెళ్ళంటే మాటలా! ఆ హడావిడి ఏమిటో, అసలు కథేంటో చదవండి.**

డని తరాలు-అంతరాలు అక్కడక్కడ పలకరిస్తు న్నాయేమో! దీన్నికూడా సహజంగా తీసుకుంటూ పెద్దతరం సర్దుకోవడంలో సంతృప్తి పడుతోంది.

సత్యం బాబాయి వచ్చి "ఒరేయ్ ఏదైనా ఫల హారం చేద్దాగాని రా...ఈ లోపల ఎదురుకోళ్ళు ఏర్పాట్లు జరుగుతాయి. అందరం ప్రశాంతంగా కూచుని ఆనందిద్దాం. ఆడపిల్ల వాళ్ళు కాస్త ఆయాస పడతారు. మనవాళ్ళు ఆడపిల్ల వాళ్ళని ఆటపట్టి స్తారు. అదో ఫన్.. పద..పద" అన్నాడు.

"పదబాబాయ్! నాకు కూడా ఆకలిగా ఉంది." అని-

"అవునూ మనం కల్సుకుని, మనసు విప్పి మాట్లాడుకుని పదేళ్ళైంది కదూ. పిల్లలు ఎదిగొ చ్చారు. అవడానికి అన్నదమ్ముల పిల్లలమైనా సొంత బ్రదర్స్ కన్నా మిన్నగా కలిసి పెరిగాం. పిన్ని ఏది బాబాయ్ కనిపించలేదు".

"లోపల పనిలో ఉన్నట్టుంది...ఎక్కడో"

"ఐదు రోజుల పెళ్ళా...అదీ ఈ రోజుల్లో?"

"అవునురా" అన్నాడు బాబాయ్.

"పెళ్ళికి ముందు కొన్ని సమస్యలు వచ్చాయి. కారణం మా వాడు వినయ్, కాస్త మొండివాడు. అయితే కొంతలోకొంత మంచివాడు. వాడు అనుకున్నదే రైట్! తన పరిధి దాటి బయటికిరాడు. మాట్లాడడు".

"ఈ కాలం పిల్లలు అంతే బాబాయ్! మనమే అలా అలవాటు చేశాం. చదువు చదువు అంటూ వాళ్ళని రుద్ది పాడుచేశాం. తెలుగు తప్ప అన్నీ వచ్చు వాళ్ళకి. బంధువులుతప్ప అందరూ దగ్గరే వాళ్ళకి. కంప్యూటర్, మొబైళ్ళు తప్ప పచ్చిక మైదా నాలు తెలియవు పాపం! ఆటలు రావు, కంప్యూటర్ గేమ్స్‌తప్ప. ఎవడో సెంచరీ కొడితే చప్పట్లు కొట్టడం మాత్రం తెలుసు. ఈ స్థితికి వాళ్ళే బాధ్యులంటే నేను ఒప్పుకోను బాబాయ్."

"నిజమే! వినయ్ మెరిటోరియస్ స్టూడెంట్. గోల్డ్ మెడలిస్ట్. నాకు తెలిసి సిగరెట్ తాగడు. ఇంకే వ్యసనాలూలేవు. చిత్రమైన విషయమేమిటంటే పెళ్ళి గురించి వాడి అభిప్రాయం వింటే దిమ్మ దిరిగి పోతుంది." ఒక్క నిమిషం ఆగాడు

"ఇదిగో బాబూ ఇలారా" అని కేటరింగ్ బాయ్‌ను కేకేసి "ఒక ప్లేట్‌లో కాస్త బూందీ, అలాగే వేడి వేడి బజ్జీ పట్రా..ఒక పది నిమిషాలు ఆగి రెండు వేడి టీ కూడా పట్రా" అని పురమాయించాడు.

"ఏమంటున్నానూ, అదే వినయ్‌గాడు ఏమంటా డంటే... పెళ్ళి బంధనమంటాడు. అదేంటదీ లివింగ్



టుగెదర్ అయితే రెస్పాన్సిబిలిటీ ఉండదట. ఇప్పుడు అదే మనదేశంలో పాకి పోయిందట! అంతా కామన్ అంటున్నాడు." అంటూ ఏదేదో మాట్లాడాడు. నా కళ్ళు తిరిగిపోయినయ్. ఇహ మంగ పిన్ని అయితే దిగులు పెట్టుకుని చిక్కిశల్యమైంది. "ఏమండీ వీడెట్లా దారికొస్తాడండీ" అని ఒకటే దిగులు దానికి. "నన్ను కూర్చోనీయదు, నిలబడి నీళ్ళు తాగనీయదు".

అవునా? ఎట్లా దారికి తెచ్చావ్ మరి? వాళ్ళ తెలివితేటలూ, లాజిక్స్ ముందు మనం ఎందుకూ పనికిరాం" అన్నాను. ఇంతలో మంగపిన్ని వచ్చి "బాగున్నావా రవీ? ఇంకా రాలేదేంటా అనుకుంటున్నాను..కాఫీ తాగావా?" అని అడిగి సమాధానం కోసం చూడకుండా మళ్ళీ తానే "ఇప్పుడే వస్తానేం." అంటూ లోపలికి వెళ్ళింది.

"వినయ్ చెప్పిందాంట్లో ఏమన్నా విషయం ఉందా అని తరచి తరచి ఆలోచించాను. నాకేం తట్టలేదు అనాగరికతతప్ప, పలాయనవాదంతప్ప" అన్నాడు బాబాయ్. అంతలో కాటరింగ్ కుర్రాడు చెప్పినవి తీసుకొచ్చి నిల్చున్నాడు.

"తెచ్చావా? అక్కడివ్వు. ఇదిగో! నువ్వు తింటూ ఉండు, ఒక్క పది నిమిషాల్లో వస్తాను. ఇక్కడి ఎం.ఎల్.ఏ నా క్లాస్‌మేట్. పెళ్ళికి వస్తానన్నాడు. మాట్లాడి వస్తాను. నువ్వు కానీయ్" అని బయటకు వెళ్ళాడు సత్యం బాబాయి. నేను ఆలోచిస్తూ ప్లేట్ తీసుకుని తినడం మొదలెట్టాను.

వినయ్‌ను వెంటబెట్టుకుని శేషు బాబాయి వస్తూ "నువ్విక్కడున్నావా... తిను.. తిను. వీడు పెళ్ళికొడుకు వినయ్. పేరులోనే కాదు నిజంగానే వినయశీలుడు. బ్రిలియంట్ బాయ్. అరెయ్ వినయ్! వీడు నీకు అన్నయ్య వరసరా, పేరు రవీంద్ర. హైదరాబాదులో ఉంటాడు. మన ఊర్లో తాతయ్య వాళ్ళింటి ఎదురుగానే వీళ్ళ ఇల్లు ఉండేది. ఇప్పుడు లేదనుకో"

వినయ్‌ని స్కాన్ చేసినట్లు చూశాను. రెండు చేతులూ జోడించి నమస్కారం చేశాడు. చూడటానికి చాలా ఆకర్షణీయంగా అందంగా ఉన్నాడు. గొంతు వినమ్రంగా స్పష్టంగా ఉంది. బాబాయి చెప్పిన దానికీ వీడికీ పోలికే లేదు. "ఎక్కడ పన్జేస్తున్నారన్నయ్యా మీరు" అడిగాడు. చెప్పాను. నేను పరిశీలనగా చూస్తున్న విషయం గమనించి "ఇదేకదా మీరు నన్ను చూడటం" అడిగాడు. "ఎప్పుడో చిన్నప్పుడు చూసిన గుర్తు...ఒక రకంగా చూడనట్లే" అన్నాను నవ్వుతూ.

"థాంక్సన్నయ్యా! నా పెళ్ళికి వచ్చినందుకు" అన్నాడు వినయ్.

ప్రేమగా వాడి భుజం మీద చెయ్యివేశాను.

"ఇదే కదరా బంధుత్వమంటే. ఎన్నో రోజుల తర్వాత ఎంతోమందిని కలవగలుగుతున్నాను, నీ పెళ్ళి సందర్భంగా. ఇదో రకమైన రిలేషన్‌షిప్ రెన్యువల్" అని నేనంటే గట్టిగా నవ్వి "భలే మాట్లాడతారే అన్నయ్యా మీరు" అన్నాడు వినయ్.

"పదరా! నువ్వు తయారు కావాలిగా, టైమ్ అవుతోంది పద." అంటూ వినయ్‌ను వెంట బెట్టుకెళ్ళాడు శేషు బాబాయ్.

కవిత

## దాల్చినగంధి

*ఆముక్త మాల్యదలో*
*భిల్లయువతి*
*గంధపు కట్టెలతో వంటచేసినట్టు*
*ఈమె ఏదాల్చిన సుగంధ వనాల నుండి*
*పరిమళ కెరటమై*
*తరలి వచ్చిందో!*
*పెద్దన ఈమెను చూసి ఉంటే*
*దాల్చిన పొలుపు తెలుపు*
*మారుతము వీచెన్*
*అని తిరగరాసుకునేవాడే!*
*తలుపు చప్పుడవగానే*
*ఒక్క ఉదుటున లేచి తీస్తానా*
*గాలిలో తేలివచ్చిన*
*హంసతూలిక ఒకటి*
*చెంపను మృదువుగా తాకినట్టు*
*ఆమె కంటే ముందు*
*దాల్చిన గంధపవన వీచికొకటి*
*లోనికి వీస్తుంది.*
*అసలే మేలిమి పసిడి మిసిమిఛాయ*
*ఆపై చెట్టునే పక్వానికొచ్చి*
*పగిలిన దానిమ్మ చెక్కల్లాంటి*
*ఎర్రెర్రని పెదవుల నుండి*
*దాల్చిన సుగంధం!*
*నిత్యం కవిత్వపు మత్తులో*



*తూగులాడే నాకు*
*ఈ కొత్తమత్తు*
*గమ్మత్తయిన అనుభవం–*
*ఆమెకు తెలియకుండా*
*ఆమె గుప్పిట్లో*
*దాల్చిన చెక్కై దాగున్నాను*
*ఆమె పంటికింద నలగాలని.*

**–శిఖామణి**

***సెల్: 98482 02526***

"సార్ టీ తాగండి" అంటూ టీ తెచ్చిచ్చాడు కుర్రాడు. తాగుతుండగానే సత్యం బాబాయి వచ్చి "ఆ ఎం.ఎల్.ఏ. తొమ్మిదిగంటలకు వస్తానన్నాడురా. మనం అందరం పావుగంటలో మంటపం దగ్గర కలవాలి."

"బాబాయి వినయ్ సంగతి పూర్తి చెయ్యలేదు..."

"గుర్తుందిరా! పూర్తి చేస్తాను. ఐఐటీలో ఉండగా హాస్టల్ జీవితం, వీడిలాంటి వాళ్ళంతా ఒక చోటే గుంపుగా ఉంటారు కదా. ఎవరో వీణ్ణి ఇన్‌ఫ్లుయన్స్ చెయ్యగలిగారు. వీడి ఆలోచనలను ప్రభావితం చేశారు. పెళ్ళేమిటి నాన్సెన్స్ అనే స్థాయిలో అన్నమాట. తాళి కడితేనే భార్యాభర్తలా? ఏడడుగులు నడిస్తేనే పెళ్ళా? ఒకరికొకరు ఫెయిత్‌ఫుల్‌గా ఉండాలా? అనే ధోరణిలో నాతో వాదించేవాడు". బాబాయి గొంతు జీరబోయింది.

"దీనిలో కనబడే హింస ఏమీ లేదు కాని కనబడని ఘర్షణ ఉంది. సన్నని రంపంతో గుండెను కోస్తున్న ఫీలింగ్. ఒక మహావటవృక్షం మనమీద కూలిపోతున్న భయం. ఏం చెప్పనూ.. నాకన్ని తెలివితేటలు లేవు. కన్విన్స్ చేసే కెపాసిటీ లేదు. ఇదంతా విన్న మీ పిన్ని ట్రాన్స్‌లో ఉన్నదానిలా ఒక ప్రశ్న అడిగింది వాణ్ణి.

మేమిద్దరం కలసి ఉండకపోతే నీ స్థితి ఏమిటిరా? నీ ఉనికి ఎక్కడరా? ఇలా ఎవరితో వాదించేవాడివిరా" అని. "వయసు పెరిగే కొద్దీ జ్ఞానం పెరగాలి. వెర్రితలలు వేయకూడదు. నువ్వు కోరుకునేది విచ్చలవిడితనం, బాధ్యతలను దులపరించుకుపోయే పోకడ. ఇహ చదివిన చదువు చాలు గాని సర్దుకుని ఇంటికొచ్చేయ్".

"మంగా ఏమిటా దూకుడు... వాడు హర్ట్ అవుతాడు" అని నేనన్నాను. దానికి మంగపిన్ని "హర్ట్ ఏమిటండీ హర్ట్! వాడికేం తెలుసని మీతో వాదిస్తున్నాడు. వాడికో విషయం తెల్సా, పెళ్ళిచూపులతో మొదలై 'ఒక మాట' రెండు కుటుంబాలూ అనుకున్నాక, పిల్లలిద్దరి హృదయాల్లో పలికే మధురిమ, ఎప్పుడు కలుస్తామో అన్న తీయని తలంపు, కలిసి మాటలు పంచుకుంటే అనే ఆలోచన, ఈ తరానికి అర్థమౌతాయా? దానిలో ఉన్న తియ్యదనం వీళ్ళకు ఎప్పుడైనా తెలుస్తుందా? ఏమండీ! రేడియోలో ఒక మంచిపాట వచ్చినా తనకే అన్వయించుకునే వేడుకోలు, ఎదురుచూపుల్లో ఉండే ఆనందం వీళ్లెలా అనుభవిస్తారు? నిశ్చయ తాంబూలాలు పుచ్చుకున్నాక, పెళ్ళి ముహూర్తం తెలిసిన తర్వాత జరిగే హడావుడి గురించి తెలుస్తుందా? 'విడిదిలో మగపెళ్ళివారు వచ్చారని' పెళ్ళి కొడుకు ఎంత బాగున్నాడో' అని మర్యాదలు ఇవ్వడానికి వెళ్ళి వచ్చిన ఆడవాళ్ళు అనుకోవడాలు,

'మర్యాదలు సరిగ్గా చేయండ్రా! లేకపోతే కోపాలు వస్తాయి' అని తాతయ్య మందలింపులు, చిన్నచిన్న పట్టింపులు, అసలు పెళ్ళితతంగం ఎలా ఉంటుందో తెలుసుకోవాలి కదా... అందులో ఉండే కష్టం, సుఖం, తీయదనం అనుభవించాలి గదా! గంపలో పెళ్ళికూతుర్ని తీసుకురావడానికి మేనమామలు ఆపసోపాలు పడుతుంటే... మగపెళ్ళి వారి నవ్వులు, మధుపర్కాలు కట్టుకుని పచ్చదనంతో వెలిగిపోయే వధూవరులు, అప్పగింతలు, తరువాత మొదలయ్యే మేమిద్దరం ఒకటి, మా బిడ్డలు, ఇది మా కుటుంబం, మాది అన్యోన్య జీవితం.." అని అంటుంటే...

"ఈ తతంగానికి తలవంచి పెళ్ళిలో కూరుకుపోతే నువ్వే అంటావుగా, సంసారం సాగరమని. నా వల్ల కాదు ఇన్ని భరించడం అని. నువ్వు అలా అంటుండగా నేను చాలాసార్లు విన్నాను" అని వాడంటే "అంటాం రా! సవాలక్ష అంటాం. కుటుంబం అన్నాక మంచీ ఉంటుంది చెడూ ఉంటుంది. కష్టం ఉంటుంది, వెంటనే సుఖం ఉంటుంది. అన్యోన్యత ఉంటుంది, తగాదాలూ ఉంటాయి. నేనూ నాన్నా మాటామాటా అనుకుంటాం. అంత మాత్రాన కత్తులు




దూసుకునే శత్రువులమా, మా వైపు వాళ్ళు వస్తే నాకున్నంత ఆనందం ఆయనకుండక పోవచ్చు. ఆయనవైపు వాళ్ళు వస్తే నేను పడిపడి సేవలు చేయకపోవచ్చు కాని గౌరవానికి ఏ మాత్రం భంగం రానీయం. నువ్వెప్పుడైనా చూశావా అలా? మీ ఫ్రెండ్స్‌లో మీరూ మీరూ కొట్టుకోరా, తన్నుకోరా? మీకు గొడవలు రావా? పెద్ద చెప్పొచ్చాడు."

మళ్ళీ ఏమనుకుందో ఏమోగాని పిన్ని వాడి దగ్గర కూర్చుని నెమ్మదించిన గొంతుకతో ఎంతో అపురూపంగా "ఒరే నాన్నా... నువ్వు పుట్టినప్పుడు మీ నాన్న ఆనందం చూడాలి. విషయం తెలియగానే తొమ్మిది నెలల ముందే ఎంత ఆరాటం. ఆ తొమ్మిది నెలలూ రొమ్ము విరుచుకు తిరిగేవాడు మీనాన్న. నువ్వు పుట్టినప్పుడు పరమానందం అనుకో! ఆ తర్వాత పాలడబ్బాలు కొనేటప్పుడు మామూలుగా అయ్యేవారు" అని ఫక్కున నవ్వింది. కళ్ళల్లో సన్నటి నీటిపొర. నాకు చెప్పలేనంత ఆశ్చర్యం. అమాయకంగా కనిపించే మీ పిన్ని మనసులో ఎన్ని దాచుకుంది? వినయ్‌వైపు చూశాను. వాడు కూడా సంభ్రమంగా చూస్తూ కళ్ళు తుడుచుకున్నాడు. చెప్పొద్దూ, ఉద్విగ్నంగా ఒక్క ఉదుటన లేచి వాణ్ణి దగ్గరకు తీసుకుని ఒక్క నిమిషం నిశ్శబ్దంగా ఉన్నా వాణ్ణే చూస్తూ, ఆ తర్వాత "నీకోటి చెప్పాలిరా నాన్న! మనకు లక్షలూ కోట్లూ లేకపోవచ్చు కాని, టన్నుల కొద్దీ తృప్తి ఉందిరా. ఇంత మంచి సంప్రదాయం, ప్రేమాభిమానాలు, గౌరవం, కట్టుబాట్లు, కుటుంబవ్యవస్థలో అల్లుకుపోతాయిరా.. అదేరా పెళ్ళి. అదేరా దాని ఔన్నత్యం.

మా పెళ్ళిచూపుల్లో మీ అమ్మను చూడగానే అమ్మాయి మామూలుగా ఉందని అనుకున్నా, అదే నా పక్కన కూర్చున్న మా బావతో అన్నా. "ఎవరైనా మొదట్లో మామూలుగానే ఉంటారోయ్... ఒక పాతికేళ్ళ తర్వాత ఇదే మాట అనగలవేమో చూద్దాం." మొదట్లో దాని అర్థం అంతుబట్టలేదు. ఎక్కడో మొదలై తర్వాత అల్లుకుపోయి మొక్కై, మానై, మహా వటవృక్షమై, శాఖోపశాఖలై విస్తరిల్లేదే కుటుంబం. దానికి మూలం పెళ్ళి. మంత్రాలుండకపోవచ్చు. ఉండచ్చు. పెళ్ళి అనే ఈ వ్యవస్థ పూర్వం ఉంది, ఇపుడూ ఉంది, భవిష్యత్తులోనూ ఉంటుంది.

లివింగ్ టుగెదర్ అంటున్నావుగా, ఆ అమ్మాయి ఎవరోచెప్పు. నేను మాట్లాడుతాను. మనింటికి తీసుకు వద్దాం కోడలిగా. అంగరంగ వైభవంగా పెళ్ళి చేద్దాం. లివింగ్ టుగెదర్‌ను పవిత్రబంధం చేద్దాం. మనింటి అమ్మాయిని చేసుకుని బాధ్యతలు అప్పచెబుదాం. దాంతోపాటు ఎనలేని గౌరవాన్ని ఇచ్చి మనలో కలుపుకుందాం. నీలో నాలో ఒకే జీన్స్ ప్రవహిస్తున్నాయి. ఇది తరతరాల సజీవధార. భావితరాలకు సంప్రాప్తింప చేయడం మనధర్మం. నా మాట విను. ఆ అమ్మాయి నెంబర్ ఇవ్వు, అమ్మా, నేను మాట్లాడతాము" అని నేనంటే వినయ్ అన్నాడు.

"నాక్కొంచెం టైమ్ ఇవ్వు నాన్నా! అమ్మా! మిమ్మల్ని బాధపెట్టేదేదీ నేనేమీ చేయలేదు, చేయను కూడా. నాకు కాస్త టైమ్ ఇవ్వండి. నాలోకి నన్ను తరచి చూసుకోనివ్వండి ప్లీజ్ అన్నాడు.

నా కొడుకు బంగారం. ఓ మూడు నెలల తర్వాత మేఘం లేని వర్షంలా హఠాత్తుగా ఊడిపడ్డాడు. భోజనాలైన తర్వాత మా ఇద్దర్నీ పిలిచి కూర్చోమని చెప్పి "నాన్నా మరి పెళ్ళిచూపులు ఎప్పుడు" అని నన్నే సూటిగా చూస్తూ అడిగాడు. వాడి కళ్ళల్లో మెరుపు చూసి నేనూ పిన్నీ మురిసిపోయాం. "ఏమండీ నాకు మాత్రం 'ప్రద' పట్టుచీరలు" అని గావుకేక పెట్టింది. "నా తరపునుండి నీకో నెక్లెస్ అమ్మా!" అన్నాడు వినయ్.

'మనవాళ్ళ పిల్లయినా నీకు అభ్యంతరం లేదా?" అని అడిగాను సాలోచనగా.

"ఏం లేదు. అమ్మాయి తెలివిగలది, చదువుకున్నది. అన్నిటికంటే ముఖ్యమైనది, అందంగా ఉండాలి" అన్నాడు వాళ్ళమ్మవైపు తిరిగి రహస్యం చెబుతున్నట్లు!

"అయితే ఇంకేం! మన శేషన్నయ్య మనవరాలు సౌమ్య ఉందిగా" అన్నాను. "అవునూ... దాని రీసెంట్ ఫోటో ఆల్బమ్‌లో ఉండాలి చూడు" అని అన్నాను మంగతో.

"ఒక్క క్షణం" అని పిన్ని చిన్నపిల్లలా పరిగెత్తి ఫోటోతో వచ్చేసింది క్షణంలో!

వినయ్ ఆ ఫోటోను తీక్షణంగా చూశాడు. నా వైపు చూస్తూ "అమ్మాయి మామూలుగా ఉంది నాన్నా" అంటూ తల్లివైపు చూశాడు అల్లరిగా నవ్వుతూ.

మా ఇంట్లో నవ్వులు విరబూశాయి. ఆ క్షణం నుండి ఇదిగో ఈక్షణం వరకు... ఇకముందు కూడా ఆనందమే ఆనందం. అమ్మాయి సౌమ్య బి.టెక్ చేసింది. "కట్న కానుకలు లేవు. అంచేత ఐదు రోజుల పెళ్ళి చేద్దాం" అని శేషన్నయ్య అన్నాడు. నేనెందుకు కాదంటాను. శేషన్నయ్య అల్లుడు రుక్మారావు అకాల మరణంతో దాని జీవితంలో చీకటి ముసురుకుంది. ఇదిగో ఈ పెళ్ళితో శేషన్నయ్య కూతురు శారద, దాని కూతురు సౌమ్య జీవితాల్లో మళ్ళీ వెన్నెలలు విరబూశాయి. అదిరా సంగతి. రవీ... అందరి కంటే తృప్తితో ఆనందపడింది ఎవరో తెలుసా?"

"పిన్ని బాబాయ్! తనకు నెక్లెస్, పది పట్టుచీరలు" అని అన్నాను కొంటెగా నవ్వుతూ.

"కాదని అనను కాని, హృదయం నిండా సంతోషాన్ని నింపుకుని తృప్తితో తల పంకిస్తున్నాడే అదిగో... మా శేషన్నయ్య. అలాగే అమ్మాయి శారద. దానికి వెలకట్టే వారేరి?" అని బాబాయి అంటుంటే నేను కళ్ళు తుడుచుకుంటూ సత్యం బాబాయి చెయ్యి పట్టుకున్నాను. ఏమీ మాట్లాడలేకపోయాను. ఇంక మాట్లాడాల్సింది ఏమీ లేదు మరి.

ఏదో గంట గడుపుదామని, తృప్తిగా భోంచేసి వెళదామనుకున్న నేను అందరితో పాటు 'ఎదురుకోళ్ళు' వినోదంలో పాల్గొని, సంగీత విభావరిలో పాలు పంచుకొని, అర్ధరాత్రి పెళ్ళి చూసి ఛలోక్తులు వింటూ, తెల్లారి కాస్త కునుకుపాట్లుపడి, వినయ్‌నూ, సౌమ్యనూ మనసారా ఆశీర్వదించి, వాళ్ళకు నా ఆహ్వానం పలికాను. మా ఇంటికి రమ్మన్నాను. బాబాయిలిద్దరి వద్దా సెలవు తీసుకుని, టీచర్ పిన్నితో మరొక చురక అంటించుకుని, గాయత్రీ సత్రం ఆవరణ దాటి వెనక్కి చూసుకుంటూ అడుగులు వేయడం మొదలెట్టాను. కొన్ని సందర్భాలు అనుకోకుండా భలే సంతృప్తినిస్తాయి.

## సరదాగా....

### కార్పెట్

నవనీష్ కార్పెట్ కొందామని తన మేనల్లుడిని తీసుకుని బజారుకు వెళ్ళాడు. ఓ షాపులోకి వెళ్ళి, “ధర ఎంతయినా పర్లేదు.. నాకో మంచి కార్పెట్ కావాలి” అని అడిగాడు. దుకాణదారుడు నవనీష్‌కి లేటెస్ట్ మోడల్స్ ఎన్నో చూపించాడు. చివరకు ఒక కార్పెట్ ఎంచుకున్నాడు నవనీష్. షాపు యజమానితో “ఈ కార్పెట్ మా హాలుకి సరిపోతుందో లేదో తెలియట్లేదు. ఒకవేళ ఇది సరిపోకపోతే, రేపు తిరిగిచ్చేస్తాను. సరేనా” అన్నాడు. యజమాని సరేనని చెప్పి, “సరిపోకపోతే రేపు సాయంత్రం కల్లా తిరిగిచ్చేయాలి. లేకపోతే నేను తీసుకోను. బిల్లు కూడా తీసుకురండి” అని చెప్పాడు. ఇంతలో నవనీష్ మేనల్లుడు షాపు యజమానితో అన్నాడు. “ఏం పర్లేదు అంకుల్.. మా ఇంట్లో ఈరోజు రాత్రే పార్టీ!”

### ఒక ప్రశ్న?

నందక రాజ్యాన్ని రత్నఖచుడనే రాజు పరిపాలిస్తున్నాడు. అతడికి ఎనమండుగురు కుమారులు, ఒక ముద్దుల కుమార్తె. రాకుమారులు ఎప్పుడూ పోట్లాడుకునేవారు కాదు. ఎంతో సఖ్యంగా ఉండేవారు. సోదరిని ఎంతో ముద్దు చేస్తుండేవారు. అన్ని విద్యలలోనూ ఆరితేరిన వారయ్యారు. వారిని పరీక్షించదలిచాడు మహారాజు. గురువుగారిని పిలిచి, రాకుమారులు యుద్ధతంత్రాలలో, జ్ఞానసముపార్జనలో, శాస్త్రాలలో ఎలాంటి నైపుణ్యం పొందారో తెలుసుకోగోరుతున్నట్లు చెప్పారు. సరేనన్నారు గురువుగారు. వేదిక సిద్ధమైంది. ఎంతోమంది వేదపండితులు, యుద్ధనిపుణులు వారిని పరీక్షించారు. అన్నింటిలోను ఎనమండుగురూ సమాన ప్రతిభ కనబరిచారు. సంతృప్తి చెందాడు మహారాజు. ఆఖరున గురువుగారు ఈ ఒక్క ప్రశ్నకి సమాధానం చెప్పండి అంటూ ఇలా అడిగారు. “మీవలెనే ఎనమండుగురు అన్నదమ్ములున్నారు. వారి గృహం చాలా పెద్దది. చుట్టూ చక్కటి తోట యుండెను. ఒకనాడు వారి తల్లిదండ్రులు బయటకు పోతూ, వారొక్కక్కరికి ఒక్కోపని అప్పచెప్పెను. వారు చెప్పినట్టుగానే మొదటివాడు ఇంటిని శుభ్రపరుచుచుండెను. రెండోవాడు బావినుంచి నీళ్ళు తెచ్చిన పిదప, చదరంగం ఆడుచుండెను. మూడోవాడు మొక్కలకు పాదులు, నాలుగోవాడు పాదులు చేశాక వాటికి నీళ్ళూ పోయుచున్నారు. అయిదోవాడు పశువులకు మేత వేయుచుండెను. ఆరోవాడు చీకటి పడుచున్నందున దీపం సిద్ధం చేయుచుండెను. ఏడోవాడు వంటకు సామానంతా సిద్ధం చేయుచున్నాడు. మరి ఎనిమిదోవాడు ఏంచేస్తున్నాడు?” రాకుమారులు తమకు సమాధానం తెలుసుననుచూ చిరునవ్వు నవ్వుతూ ఎనమండుగురూ కలిసి ముక్తకంఠంతో సమాధానం చెప్పిరి. మరి మీరు కూడా సమాధానమివ్వగలరేమో ప్రయత్నించండి.

# తీన్ మార్











# ప్రయాణం

(రాచెల్ కలోఫ్ ఆత్మకథ)

-బాలి

సెల్: 98499 63082

## ముందుగా చిన్న మాట...

1936లో రాచెల్ కలోఫ్ 5x7 అంగుళాల సైజు గల రాత పుస్తకం కొనుక్కుంది. అది రూళ్ళు ఉన్నది. దాని మీద పెన్సిల్‌తో తన గత అనుభవాలు, అప్పట్లో తాను పడ్డ కష్టాలు, ఎదుర్కొన్న విషయాలు రాయడం మొదలెట్టింది. ఆమె పుట్టింది 'కివెల్' అనే గ్రామంలో. అది ఉక్రెయిన్ దక్షిణ ప్రాంతంలో ఉంది. అప్పటికి ఉక్రెయిన్ రష్యా దేశంలో ఒక భాగం. 1894లో ఆమె అమెరికా వెళ్ళిపోయింది. ఆ తరువాత 23 సంవత్సరాలు నార్త్ డకోటా రాష్ట్రంలో డెవిల్స్‌కేర్ అనే ప్రాంతంలో భర్తతో గడిపింది. ఈ నార్త్ డకోటా అమెరికాలో కెనడా పక్కనే ఉన్న ప్రాంతం. గడ్డి మైదానాలు గలది. ఆ మైదానాలను 'ప్రయరీస్' అంటారు. గొప్ప చలిగాలుల ప్రాంతం.



## (కొత్త సీరియల్ ప్రారంభం)

ఈమె రాసిన ఈ కథనం అంతా 67 పేజీలలో తన మాతృభాష 'యిద్దిష్' లో రాసింది. అది ఆ ప్రాంత యూదులు మాట్లాడే భాష (ఉక్రెయిన్). రాతలో స్పష్టత, శుభ్రత పాటించింది. అందులోనూ తన మనసుకు ముఖ్యమైనవి అని తోచిన విషయాలే సూటిగా రాసింది.

ఈమె చనిపోయిన 30 సంవత్సరాలకు ఈ డైరీ బయటపడింది. ఇది చదువుతోంటే హిందూ సమాజం మొదలు పురాతన ప్రపంచంలోని మతాల వారి ఆలోచనలూ, తీరుతెన్నులూ ఒకేలా ఎలా ఉండేవో తెలుస్తుంది.

***

నేను 1876వ సంవత్సరంలో రష్యా దేశంలోని 'ఉక్రెయిన్'లో 'కివెర్' అనే చిన్న ఊరులో పుట్టాను. నాకు నాలుగు సంవత్సరాలు వయస్సు వచ్చేసరికి మా అమ్మ మమ్మల్ని అనాథల్ని చేసి చనిపోయింది. మమ్మల్ని అని ఎందుకు అన్నానంటే నాకో అన్నయ్య, అక్క, పద్దెనిమిది నెలల వయస్సున్న తమ్ముడూ ఉన్నారు. మా అన్నయ్య, అక్క నా కన్నా మరీ పెద్దవారు కాదు. ఇద్దరూ సన్నగా, బలహీనంగా ఉండేవారు. నా తమ్ముడి గురించి చెప్పనవసరం లేదు.

మమ్మల్ని ఎలా చూసుకోవాలో, ఎలా పెంచాలో మా నాన్నకు అర్థమవలేదనుకుంటాను. మమ్మల్ని చుట్టూ చేరబెట్టుకుని బేలగా చూడ్డం తప్ప ఆయన ఇంట్లో ఉన్నంత సేపూ మా కనీస అవసరాలు తీర్చేవాడు కాదు. మేం రోజురోజుకీ అనారోగ్యం పాలవడం మొదలెట్టాం. మా చిన్న తమ్ముడి పరిస్థితి మరీ దారుణం. నడవలేడు. కూర్చోలేడు.

మా ఇంటికి మా నాన్న మిత్రులు వచ్చేవారు. వారు ఏం చెప్పేవారో మా నాన్నకూ, నాకూ అర్థం కాదు. బహుశా మా నాన్నను మరో పెళ్ళి చేసుకోమనే వారనుకుంటాను. ఈయన వారి వేపూ చుట్టూ కూచున్న మా వేపూ ఎగాదిగా చూసేవాడు. వచ్చే ఆ రెండో భార్య మాకు సవతి తల్లి అవుతుంది కదా? ఈ పిల్లల్ని సరిగ్గా చూసుకుంటుందో లేదో అనే అనుమానంతో కాబోలు. పైగా మాకు చిన్న తమ్ముడు ఉన్నాడాయే!

సరే! మానాన్న ఏ నిర్ణయానికి వచ్చారో తెలియదు. ఒకరోజు పనిమనిషిని కుదిర్చాడు. ఆమె మా యూదు జాతి స్త్రీయే! తల్లి తల్లే కదా! అయితే ఈమె స్త్రీయే గానీ పనమ్మాయి. తను చేస్తున్న పనే దృష్టిలో పెట్టుకుంటుంది. ఇక ఈమె వల్ల మాకు కొత్త ఇబ్బందులు కలగడం మొదలెట్టాయి. ఏదో ఇంత రుచీ పచీ లేని వంట వండి మా ముందు పడేసేది. మా తమ్ముణ్ణి అస్సలు పట్టించుకునేదే కాదు. నేను కానీ, మా అక్కగానీ తమ్ముడికి స్నానం పానం చూసేవాళ్ళం. ఒంటి మీద మురికి బట్టలూ! కొత్త రుచుల కోసం గిన్నెలు వెతుక్కోవడం!! శుచీ శుభ్రతా లేని ఆ ఇంట్లో అనారోగ్యంగా ఉండడం మామూలే!!

ఇలా నాలుగు సంవత్సరాలు గడిచాయి. నాకు ఎనిమిదో సంవత్సరం వచ్చింది. అంత చిన్న వయసులో నాకిదంతా అన్యాయంగా కనపడింది. మా అన్నయ్య, అక్క ఇద్దరూ అమాయకులు. ఆకలేస్తే ఓ మూలకు చేరి పడుకోవడం తప్ప వాళ్ళేం చేయలేకపోయేవారు. అంత చిన్న వయస్సులో ఏదో పెద్ద నిర్ణయానికి వచ్చినదానిలా, మా నాన్న సాయంకాలం ఇంటికిరాగానే ఈ పనిమనిషి మాకు చేస్తున్న అన్యాయాన్నంతా ఆయనతో చెప్పి వాదించడం మొదలెట్టేదాన్ని.

మా నాన్న నా కళ్ళల్లోకి చూస్తూ నా భుజాన్ని చేత్తో రాస్తూ, లేక మా తమ్ముడిని ఒడిలోకి తీసుకొని వాడి బుగ్గల్ని రాస్తూ బేలగా చూసేవాడు. బహుశా ఈ పరిస్థితులు కల్పించిన ఆ భగవంతుణ్ణి నిందించేవాడనుకుంటాను.

ఆయన వ్యవసాయ కూలీ. మా స్వంతానికి సెంటు భూమన్నా లేదు. నేను ఇలా ప్రతి రోజూ ఆయనతో వాదించడం ఆయన చెవికెక్కినట్టుంది. తన మనసు కలవరపడిందో, మాకు మంచి జీవితాన్ని ప్రసాదించాలని కాబోలు ఆయన తిరిగి మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడు. ఇంతవరకూ బాగానే ఉంది. కానీ మా పనే పెనంలోంచి పొయ్యిలోకి పడినట్లయ్యింది. మా నాన్న రెండోభార్య మా ఇంటికి వచ్చింది. ఒక రోజు ఉదయాన మా నాన్న చాలా సంతోషంగా ఉన్నాడు. ఆమెను మాకు పరిచయం చేశాడు. మేం మురికి గుడ్డలతో గోడకు చేరబడి చూస్తున్నాం. మా నాన్న ఏం చెప్పాడో ఆమెకేం అర్థమయ్యిందో తెలియదు. ఆమె ఒంటి మీద చాలా శుభ్రమైనవీ, రంగులతో మిలమిల మెరిసిపోతున్న దుస్తులున్నాయి. చాలా ఫ్యాషనబుల్ స్త్రీలా ఉంది. వస్తూనే బంగారు అల్లికతో కుట్టిన పెద్ద చేతి రుమాలుతో ముక్కు మూసుకొని అనాథల వసతిగృహం చూస్తున్నట్టు పరిసర



ప్రాంతాలు చూస్తూ ఇల్లంతా కలియతిరిగింది. ముఖంలో దయాదాక్షిణ్యాలు లేవు. అప్పటికే ఆమెకు ఇద్దరు పిల్లలు. ఒక అబ్బాయి, ఒక అమ్మాయి. వారిద్దరూ మా కన్నా పెద్దవారే. ఆ ఇద్దరు పిల్లలూ ఒకటి రెండు అడుగులు మా వేపు వేసినట్టు కనిపిస్తే చేత్తో వారిని వీలయినంత దూరంగా తోస్తోంది. అదంతా మమ్మల్ని తాక కుండా కాబోలు!

ఆవిడ మా ఇంట్లోకి వచ్చిన రెండో రోజునే ఇల్లంతా తన అదుపులోకి తీసుకుంది. మా పిల్లలకు ఓ చిన్న గది, దానిలో ఓ మంచం కేటాయించింది. ఆ ఇంటిని మా చేతనే శుభ్రం చేయించి, చేయించిన గదుల్లో వంట ఇంట్లో తానూ, తన పిల్లలూ మసిలేలా ఏర్పాటు చేసుకుంది. తాను పిలిస్తేనే మేం గది దాటి బయటకు రావాలని అరచి చెప్పింది. మేం గట్టిగా మాట్లాడకూడదు. ఏడవకూడదు. ఆకలితో మండిపోతున్నా రొట్టె ముక్క కావాలని అడగ కూడదు. ఇదే కాదు. పదే పదే మంచినీళ్ళకని, బాత్ రూంకని ఆమె ఉంటున్న గది ముందు నుండి తిర గకూడదు. ఒక రోజు మా తమ్ముడిని శుభ్రం చేద్దామని పక్కనే ఉన్న ఆ గది ముందు నుండి రెండుసార్లు నీళ్ళ జగ్‌తో తిరగవలసి వచ్చింది. అంతే!

సాయంకాలం మా నాన్న పనిలో నుండి ఇంటి కొచ్చేసరికి ఎన్నో చాడీలు చెప్పి నన్ను కొట్టేటట్టు చేసింది. నిజం చెప్పినా మా నాన్న వినడం లేదు. ఒక్కోమారు ఏం చెయ్యకపోయినా గోడకు పెద్ద శబ్దం చేస్తూ చేరబడ్డారనీ, తలుపు దబ్బున వేశారనీ, గుడగుడమని మాట్లాడారనీ దానివల్ల తనకు ఆ మధ్యాహ్నం పూట నిద్ర కరువయ్యిందనీ ఇలా ఏవేవో చెప్పేది. ఏమాత్రం దయ, ప్రేమ లేకుండా మమ్మల్ని చావబాదడం, తిట్టడమే కాకుండా, నాన్న ఇంటికి రాగానే మరో నాలుగు మాటలు చేర్చి మమ్మల్ని కొట్టేటట్టు పురికొల్పేది. ఆ భయంతో తండ్రి ప్రేమను పొందాల్సిన క్షణాల్లో అతని రాక ఇంకా భయంగా ఉండేది. ఈమె చెబుతున్న ఆ విపరీతమయిన చాడీలకు ఆయన కనీసం ఆలో చించకుండా మమ్మల్ని చావబాదేవారు. కన్నీరు రాని క్షణాలూ, రోజులూ, ఆ పసితనంలో మమ్మల్ని ఎంత హింసించినా గట్టిగా ఏడవకూడదు. ఒకరికొకరం ఓదార్చుకోకూడదు. మాకు ఇచ్చేది చిన్న రొట్టె ముక్కలు నాలుగు. తిరిగి ఎప్పుడు పెడుతుందో అని ఎదురు చూడ్డమే. ఈ బాధలు చాలవన్నట్టు మా అన్నయ్యతో ఇంటి పనులు చేయిస్తోంది. ఒకరోజు అతడి చేతిలో పెద్ద బరువు ఉంది. దానితో అతడు మెట్లు ఎక్కాలి. మెట్లు ఎక్కలేక సగంలోనే కింద పడ్డాడు. పడిన వాణ్ణి పెద్ద పెద్ద కేకలతో కర్ర తీసుకొని చితక్కొట్టింది. బలహీనంగా ఉన్న మా అన్న దెబ్బలకు తట్టుకోలేక సొమ్మసిల్లి కింద పడిపోయాడు. ఆ తరువాతి రోజుల్లో విపరీతమైన కడుపు నొప్పితో బాధపడేవాడు. కర్ర దెబ్బలు తగలరాని చోట తగలడం వల్ల హెర్నియా వచ్చింది. అప్పుడు అతని వయసు పదకొండు సంవత్సరాలు. ఇక మా తమ్ముడి గురించి చెప్పనవసరం లేదు. సరైన తిండిలేక, ఊపిరి తీసుకునే శక్తి లేక, ఏదో క్షణంలో చనిపోతాడన్నట్టు మంచానికి అంటి పెట్టుకొని ఉండేవాడు.

ఒకప్పుడు మా నాన్న పనిలోంచి వస్తూనే మమ్మల్ని దగ్గరకు తీసుకొని ముద్దులాడిన రోజులున్నాయి. లేకపోతే మా చిట్టిపొట్టి కబుర్లు వినాలన్నట్టు ముచ్చట పడిన రోజులున్నాయి. ఇప్పుడవన్నీ కరువయ్యాయి. ఈయన ఆ హాల్లోనే మా సవతి తల్లితోనే, ఆమె పిల్లలతోనే గడపడం ఎక్కువయ్యింది. ఒకరోజు సాయంకాలం అదే జరిగింది. మా నాన్న పని లోంచి వచ్చి ఆ హాలులో కూచున్నాడు. సవతి తల్లి ఆయనతో ఏవేవో కబుర్లు చెబుతోంది. వారికెదురుగా భోజనాల బల్ల ఉంది. ఆ బల్ల మీద రుచికరమైన పదార్థాలు గాజుగిన్నెల్లో పేర్చబడి ఉన్నాయి. అవి ఆరెంజ్ కేక్, వేడి వేడి రొట్టెలు, వెన్న. వాటి సువాసనలతోనూ, దీపం వెలుగుతోనూ ఆ హాలంతా నిండిపోతోంది. కిటికీలకు అందమైన కొత్త కర్టెన్లతో ఆ హాలు ఇంకా శుభ్రంగా కనిపిస్తోంది.

జైలు లాంటి పక్కగదిలో ఆకలి మంట మీద మేం దహించుకుపోతున్నాం. ఎప్పుడు దయతో పిలుపు వస్తుందో తెలియదు. అయితే ఇంతలో మా తమ్ముడు ఆకలితోనూ, నీరసంతోనూ కొంచెం గట్టిగా ఏడ్చాడు. మా నాన్నకు ఏం చెప్పిందో తెలియదు. మా నాన్న ఏమాత్రం దయ లేకుండా గబగబా మా గదిలోకి వచ్చాడు. మంచం మీద ఉన్న

**ఆమె ఉక్రెయిన్‌లో పుట్టిపెరిగింది. తరువాత అమెరికా చేరింది. ఆమె రాసిన డైరీ ముప్ఫై సంవత్సరాల తరువాత బయట పడింది. తన స్వీయకథను రాసుకున్న డైరీ సారాంశమే ఈ కథనం. తల్లి చనిపోవడంతో మొదలవుతాయి ఆమె కష్టాలు. సవతి తల్లి పెట్టే కష్టాలు భరించలేక, తండ్రి ఆదరణ కరువై, మేనత్త ఇంట్లోనే పనిమనిషిగా చేరుతుంది. ఆ తర్వాత ఏం జరిగింది?**

మా తమ్ముణ్ణి పిడిగుద్దులు గుద్ది, కసితీరక జబ్బ పట్టుకొని మంచం మీద నుండి కిందకు లాగాడు. కాళ్ళతో కుమ్ముతోంటే ఏం జరిగిందో ఏమిటో నోటి వెంట విపరీతంగా రక్తం కారి నేలమీద పడింది. కిందంతా రక్తం!

స్పృహ తప్పి పడిపోయాడు. మా గుండెలు బద్దలయ్యాయి. మమ్మల్ని రక్షించేవారే లేరా? అంత చిన్న వయస్సులోనూ నాలో మొండి పట్టుదల పెరిగిపోయింది. మా తమ్ముడి నోటినీ, కింద నేలనూ శుభ్రంగా కడిగి మంచినీళ్ళు పట్టి మంచం మీదకు చేర్చాను. మా అన్నయ్యా, అక్కయ్యా నోటి నుంచి శబ్దం రాకుండా చేతులు అడ్డంపెట్టుకుని ఏడుస్తున్నారు. నాలుగు బ్రెడ్ ముక్కలు పింగాణి ప్లేటులో సర్ది గుమ్మంలో పెట్టి తినమంది. ఇంతకన్నా తిండి లేక చావడం నయం. అంత దుఃఖంలోనూ మా అన్నయ్య, అక్క పళ్ళెం వైపు ఆశగా చూశారు. ఆ పళ్ళెన్ని గది అవతలే పెట్టి తలుపులు మూశాను.

ఆ రాత్రికి మంచినీళ్ళే గతి!

మా అక్క నేల మీద పడుకుంది. మా అన్న మంచం చివరన పడుకున్నాడు. దెబ్బలు తిని ఊపిరి పీల్చుకునే సత్తువలేని తమ్ముడు కడుపులో కాళ్ళు పెట్టుకున్నాడు. నేను దగ్గరికెళ్ళి వాడి ఒంటి మీద చేయి వేశాను. ఒళ్ళు కాలిపోతోంది. నా చేతిని ఎంతో గట్టిగా పట్టుకున్నాడు. వాడి చేయి భయంతోనూ, జ్వరంతోనూ వణికిపోతోంది. ఆ క్షణంలో నేనేం చెయ్యగలను? ఏదో ఒకటి చేసి వాడి భయం పోగొట్టాలనిపించింది. ఏం చెయ్యగలను?

ఎప్పుడో ఎక్కడో చూసిన విషయం గుర్తుకు వచ్చింది. వెంటనే కప్పుకునే రగ్గు చివర మడిచి నీళ్ళలో ముంచి వాడి నుదుటిని తుడవడం మొదలెట్టాను. తెల్లవార్లూ మంచం పక్కనే కూర్చుని అలా చేస్తూనే ఉన్నాను. ఆ తడితో చిన్నగా మార్పు వచ్చింది. ఒక వారం రోజుల తరువాత మంచం మీద కూర్చునే శక్తి వాడికి వచ్చింది. ఇన్ని రోజులు గడిచి, ఇంత జరిగినా ఆ ఊరులోనే ఉన్న మా బంధువులు ఈ తల్లిలేని పిల్లలు సవతి తల్లి బారిన ఎలా ఉన్నారనైనా తొంగి చూడలేదు. వారి ఆదరణే ఉంటే మాకు కొంత రక్షణ, ఊరట ఉండవా? ఇదంతా తెలిసి మా తండ్రి చెడ్డవాడుగా, బాధ్యత లేని మనిషిగా వారి దృష్టిలో ముద్రపడి ఉంటుంది.

రోజులు గడుస్తూనే ఉన్నాయి. ఇలా ఒక సంవత్సరం గడిచి ఉంటుంది. మా నాన్నకూ, మా సవతి



# జేజమ్మకు కోపం వచ్చింది

*టాలీవుడ్ జేజమ్మ అనుష్క ఎప్పుడూ కూల్‌గా నవ్వుతూ ఉంటుంది. కోపం అనేది చాలా తక్కువగా వస్తూ ఉంటుంది. అలాంటిది సడెన్‌గా అనుష్కకు కోపం వచ్చిందట! అది ఎలా బయటపడిందీ అంటే తన పర్సనల్ స్టాఫ్ ఐదారుగురిని ఒకేసారి పనిలోంచి తీసేసింది. ఆ మధ్య అనుష్క బరువు మీద ఎన్ని రూమర్లు షికారు చేసినా ఏ మాత్రం చలించని అనుష్క ఉన్నట్టుండి అందరినీ ఒకేసారి ఎందుకు తీసేసిందో అర్థం కాక చాలా మంది తలలు పట్టుకుంటున్నారు. తీసేసిన వారి స్థానంలో కొత్తవారిని ఎవరినీ తీసుకోలేదట! అంతే కాకుండా ఇంత వరకూ కొత్త సినిమాకు దేనికీ ఓకే కూడా చెప్పలేదట! ఇవన్నీ చూస్తుంటే అనుష్కను ఎవరో బాగా హర్ట్ చేశారని అంటున్నారు.*



తల్లికీ మధ్య గొడవలు రావడం మొదలెట్టాయి. ఆ చిన్న వయస్సులో నాకర్థమైంది ఏమంటే మా నాన్న తనకు వచ్చే ఆదాయంతో ఇంత మందిని పోషించ లేనం టున్నాడు. అలా అయితే ఈ పిల్లల్ని(మమ్మల్ని) బయటకు తరిమి, ఆ ఇంటిని ఆమె పేర్న రాస్తే నా ఇద్దరు పిల్లలతో మనం నలుగురం హాయిగా బతక గలమంటోంది. మా నాన్నకు అదేం పట్టడం లేదు.

ఈ గొడవలు ఇంకా ముదిరిపోయాయి.

దాని ఫలితంగా ఆమె పెట్టే బేడా సర్దుకొని తన పిల్లలను తీసుకుని వెళ్ళిపోయింది. వెళ్ళిపోతూ మా నాన్న బతిమిలాడతాడని ఆశించింది కాబోలు "ఈ పూటకు ఇంట్లో తినడానికి ఏం లేదు. ఆకలితో మాడిపోతారని" గట్టిగా అరిచింది.

మా నాన్న అటు చూడలేదు. కనీసం మాట్లాడ లేదు.

ఆమె వెళ్ళిపోయిన తరువాత మా నాన్న చుట్టూ ధైర్యంగా మూగాం. ఆయన ప్రేమతో మమ్మల్ని దగ్గరకు తీసుకున్నాడు. ఇంట్లో డబ్బాలో ఉన్న పిండితో రొట్టెలు చేయడం మొదలెట్టాడు. మేం ఆయనకు సాయం చేస్తూ ఆ హాలంతా తెగ తిరిగాం. తమ్ముడికి వెన్న ముంచిన రొట్టెను ముక్క ముక్క లుగా తినిపించాడు. ఆ రాత్రి నాన్నతో కబుర్లే కబుర్లు.

అయితే మా నాన్న ఆలోచనలు మరోలా ఉన్నాయని మాకేం తెలుసు? మా కష్టాలు తీరలే దని మరో విపత్తు మా మీద పడబోతోందని మేం గ్రహించలేదు. ఆరోజుల్లో మా ఊరులోనూ, మొత్తం చుట్టుపక్కలంతా, ఎవర్ని కదిపినా 'అమెరికా, అమెరికా' అని కలవరించేవారు. వ్యవసాయం చేసు కోవడానికి బోలెడుభూమి చవగ్గా దొరుకుతుందనీ, బోలెడు స్వేచ్ఛ ఉంటుందనీ కబుర్లు.

పైగా మా యూదుల్లో చాలా కుటుంబాలు... ఇంకా చెప్పాలంటే మా బంధువులే ఎంతో మంది అమెరికా వెళ్ళిపోయారు. ఎప్పుడైనా వారినుంచి వచ్చే ఉత్తరాల్లో అదొక భూతల స్వర్గంగా వర్ణించే వారు. ఇప్పుడు మా నాన్నకు ఆ పిచ్చి పట్టుకుంది. తానూ అక్కడికి వెళ్ళిపోతాడు. పిల్లల్నీ త్వరలో తీసుకుపోతాడు. తాను ఎలాగూ వ్యవసాయ కూలీ. భూమి చవగ్గా దొరుకుతుంది. పండిస్తాడు. ఇక ఫరవాలేదు. అయితే ప్రస్తుతం అంత వరకూ పిల్లల్ని ఎవరు చూస్తారు?

మా నాన్న ఈ ఊరు చుట్టుపక్కల ఉన్న మా బంధువులతో మాట్లాడారు కాబోలు. దాని ఫలితంగా నేను మా తాత (నాన్న తండ్రి) గారింటికి పంపబడతాను. మా అన్నయ్య, మా మామయ్య ఇంటికి వెళ తాడు. ఆయనకో చిన్నపాటి పచారీ కొట్టు ఉంది. వాడు పొట్లాలు కట్టడానికి పనికొ స్తాడు. మా అక్క మా పిన్ని ఇంటికి పంపబడుతుంది. ఆమెకు ఇద్దరు చిన్న పిల్లలు ఉన్నారు. వారిని చూడా లంటే ఇటువంటి వారు అవసరం. రక్తహీనతతో, నీరసంగా ఉన్న మా తమ్ముడు ఉన్నాడు. వాడితో పని చేయిం చుకోలేరు. పైగా మందులు వాడాలి. అదో ఖర్చు. అందువలన వాడు ఎవరికీ అవసరం లేదు. అయితే అతణ్ణి ఇప్పుడు ఏం చేయాలి?

"టాక్‌మడ్‌టోరాహర్" అనే మా సమాజం యొక్క అనాథ స్కూలు ఉంది. వాణ్ణి చేర్చుకుంటా మని, ఆరోగ్యవంతుణ్ణి చేస్తామని అన్నారు వారు. మా జీవితాలు దిక్కుమాలిన అనాథ జీవితాలు. కన్నీళ్ళే మాకు సాంత్వన కలిగిస్తాయి కాబట్టి కన్నీళ్ళు భుజాలతో తుడుచుకుంటూ ఓరోజు విడి పోయాం. మా అక్కా, అన్నా 'బేల్యాటెసర్‌కోహర్' అనే ఊర్లో ఉంటున్నా, నేను మాత్రం ఆ పక్కనే ఉన్న పల్లెటూరు 'చ్వెడికిఫికా'లో మా తాతగారింటికి చేరాను. తమ్ముడు 'టాక్‌మడ్‌టోరాహర్' అనాథ స్కూల్లో చేరగానే ఆరోగ్యంతో పుంజుకోవడం మొద లెట్టాడు. ఆ అనాథ స్కూలు వారు చెప్పినట్టే మందులు సకాలానికి ఇస్తూ అతడికి ఇష్టమైన చదువుతో పాటు వడ్రంగి పని నేర్పుతున్నారట!

ముందు ఇలా విడిపోయినందుకు భయ పడినా, మా తాతగారి పర్మిషన్ తీసుకొని నేను మా అన్నయ్యా, అక్కా, తమ్ముడిని చూసి వచ్చే వాన్ని. దానివల్ల మాలో మాకు దూరంగా లేము సుమా అనే ధైర్యం కలిగేది. ఒక మారు ఇలాగే తాతగారి దగ్గర పర్మిషన్ తీసుకొని అన్నయ్య దగ్గ రకూ, అక్క దగ్గరకూ. చివరకు తమ్ముని వద్దకూ వెళ్ళాను. కొంతలో కొంత నా బ్రతుకు బాగున్నా, వారి బ్రతుకులు బాగుపడలేదనిపించింది. ఆరో గ్యాలు అంతంత మాత్రమే. రాత్రింబవళ్ళూ విపరీత మైన శ్రమ. ఇక మా తమ్ముడయితే ఎంతో ఫరవా లేదనుకున్నాను గానీ నన్ను చూసి పెద్దగా ఏడుపు మొదలెట్టాడు 'నన్ను తీసుకుపో' అంటూ. ఎక్కడికి తీసుకు వెళ్ళగలను? నాకే దిక్కులేదే!! వాడు ఉంటు న్నది చందాలతో నడిపే పేద సంస్థ. వాడికి కొంత తెలియక, కొంత చేతకాక ఏదో బతుకుతు న్నాడు. వాడి ఒంటి మీద బట్టలు మురికిగా చెమట వాసనతో ఉన్నాయి. అంత చలిలోనూ వాడు కప్పుకోవడానికి సరైన రగ్గు లేదు. ఇచ్చిన మంచం నిండా బొద్దింకలూ, నల్లులూ. ఇస్తున్న తిండి కూడా అలాగే ఉంది. చేత్తో చిన్న బల్లగానీ, సుత్తిగానీ ఎత్తలేడు. క్షణంలో అలిసిపోతాడు.

దిక్కుమాలిన పేద పిల్లలమైపోయిన కార ణంగా గుండెబద్దలయిపోతూ ఉంటే, వాడిని ఎలాగో ఓదార్చి తిరుగుముఖం పట్టాను.

నా చిన్నతనం ఇలా దుఃఖంతోనూ, బాధలతోనూ గడిచింది. నా నాలుగో ఏట నుండీ సుఖం, సంతోషమన్నది తెలియదు. సరదాగా దగ్గరికి తీసుకునే మా నాన్న చూపులే కరువయ్యాయి. తల్లి ఎలాగూ ఈ లోకంలో లేదు. ఇప్పుడు తండ్రీ....ఎక్కడున్నాడో తెలియదు. నేనుంటున్నది తాతగారిల్లని చెప్పాను కదా! మేం చిన్న పిల్లలమయి నానా అవస్థలు పడుతున్నా ఎలా ఉన్నారు వీరని తొంగి చూడని తాతగారీయన. సరే!! నేనేదో ఈయన దగ్గరున్నానని వేళకింత తిండి దొరుకుతోందన్న పేరే గానీ, నా భయాలు నాకున్నాయి. మా తాతగారో చాదస్తుడు. ఎంత చాదస్తుడంటే పాత గ్రంథాలలో ఇలా ఉన్నాయి, అలా ఉన్నాయి అంటూ ఒళ్ళు కాల్చుకు తినే రకం. పోనీ అలా ఉంటే సరిపోతుంది. తల్లినీ, తండ్రినీ పోగొట్టుకుని ఇంత తిండి కోసం ఈ ఇంటికి చేరిన నన్ను 'ఏదో పాపం చేస్తేనే ఇలా అవుతావన్నట్టు...నన్ను "పాపాత్మురాలా! ఇలారా!!" అని పిలిచేవాడు. పిలవడమే కాదు, నేను చేస్తున్న ప్రతిపనిలోనూ పాపాన్ని వెతికేవాడు.

నేను ఆడపిల్లను.

అందువల్ల తల ఎత్తడానికి వీల్లేదు. ఎప్పుడూ నా ముఖం నేల వైపే ఉండాలి. ఎవరికన్నా సమాధానం ఇవ్వాలన్నా నేల వైపే చూస్తూ ఇవ్వాలి. నెమ్మదిగా, మృదువుగా నా నుండి సమాధానం కోరుతున్న వ్యక్తి ఎటు ఉన్నాడో అని పొరబాటున చూశానో, లేక తల ఎత్తానో... అది ఆయన గమనిస్తే పెద్ద కర్రతో వెనక నుండి కిందకు నొక్కేవాడు.

"తల వంచుకు తిరుగు. అలాగైతేనే గొప్పదానవు అవుతావు" ఇది తరచూ నా ముందు ఆయన వాడే మాట. పోనీ, మా నానమ్మ అంటే ఆవిడ మా సవతి అమ్మ కన్నా హీనం. కొన్ని కొన్ని విషయాలలో తాతే నయమనిపించేది. కాలం గడుస్తోంది. నాకు పదిహేడేళ్ళు వచ్చాయి.

ఈ ఊరులోనే ఉండే మా మేనత్త అంటే మా నాన్న చెల్లెలికి నమ్మకమైన పనిమనిషి కావలసి వచ్చింది. ఆమెకు తిండిపెట్టడమే కాదు కొంత జీతమూ ఇస్తారట. మా నానమ్మ తాతయ్య మాట్లాడుకుంటూంటే విన్నాను. నేను అత్త దగ్గరకు పనిమనిషిగా వెళతానన్నాను మా తాతతో. దాని వల్ల కొన్ని లాభాలున్నాయనిపించింది. మా అక్క, మా అన్న ఉన్న ప్రాంతానికి అది దగ్గర. పైగా కొద్దిగా డబ్బులు వస్తాయి. అవి వారికి ఇస్తే చిన్న చిన్న కోర్కెలు తీరవచ్చు. ముఖ్యంగా మంచి తిండి దొరుకుతుంది. ఏ కళనున్నాడో గానీ మా తాత ఒప్పుకున్నాడు. ఈ విషయం ఆమెకు చెప్పినట్లున్నాడు. ఆమె కూడా సరే అంది. ఒకరోజు ఆయనే ఆ ఇంటికి తీసుకెళ్ళాడు. అంతవరకూ వినడమే తప్ప ఆ ఇంటిని మేం చూడలేదు. నిజంగా అదొక పెద్ద ప్యాలెస్. విశాలమైన ఎనిమిది పెద్ద గదులున్నాయి. మధ్యలో రెండు పెద్ద హాల్స్ ఉన్నాయి. ముందు హాలులో పెద్ద కర్రకుర్చీలో కూచుని స్వెట్టర్ అల్లుతున్న మా మేనత్త చాలా గంభీరంగా, బాగా డబ్బున్న వ్యక్తిలాగా దర్పంగా రంగు రంగులవీ, మెత్తని దుస్తుల్లో కనపడింది. నా వేపు ఎగాదిగా చూసి అదే దర్పంతో లేచి నిలబడింది. ఒడిలో ఉన్న ఊలు బంతి తుళ్ళింది. నేను వెంటనే ఆ బంతిని బల్లమీద పెట్టాను.

నన్ను మరో మారు చూసి, 'రా ఇల్లు చూద్దువు గాని' అని వెంటబెట్టుకుని ఇల్లంతా చూపిస్తూ "ఇల్లంతా రోజూ తడిగుడ్డ పెట్టాలి. తిరిగి దాన్ని పొడిగుడ్డతో తుడవాలి. భోజనాల బల్లలూ, కుర్చీలూ అంతే! పొడిగుడ్డతో శుభ్రంగా తుడవాలి. తళతళలాడాలి. నీ చేతిలోనూ, భుజం మీదా అవి ఎప్పుడూ ఉండవలసిందే! చిన్న పిల్లవు కదూ! ఎంతలో చెయ్యాలి అంది తనలో తాను అనుకున్నట్టే బయటకు అంది. ఇంకా ఏవేవో నేను చేయవలసిన పనులు చెప్పింది. ఇదంతా ఎంతో కష్టమైన పని. తప్పదు!!

నేను పనిలో చేరిపోయాను. ఇల్లంతా ఆమె చెప్పినట్టే శుభ్రం చేసేదాన్ని. ఉదయం నుండి సాయంకాలం వరకూ నాకు అదేపని. ఒక చేతిలో మురికి గుడ్డ మరో చేతిలో నీళ్ళ బకెట్. అయితే ఈమె పైకి దర్పంగా కనిపించినా కఠినురాలు మాత్రం కాదు. రెండు నెలలు గడిచేసరికి నేను చేస్తున్న పని ఆమెకు ఎంతో సంతృప్తినిచ్చింది. వీలు చిక్కినప్పుడల్లా ఆమె పర్మిషన్ తీసుకొని దగ్గర్లోనే ఉన్న మా అన్నయ్యనూ, అక్కనూ, తమ్ముణ్ణీ చూడ్డానికి వెళ్ళేదాన్ని. వారి వారి పరిస్థితులు ఏమీ బాగా లేవు. ఎప్పటిలాగే కడుపు తరిగిపోయేటంత దౌర్భాగ్యంగా ఉన్నాయి. పనీ పనీ... ఎప్పుడో పెట్టిన ఆ ఎండిపోయిన రొట్టెముక్కలు. నా తల్లి తోబుట్టువయిన పిన్ని దగ్గరే మా అక్క ఉంటున్నా, మా అక్క మనిషిలా లేదు. దగ్గరలో ఉన్న ఫ్రీ డిస్పెన్సరీ వారు ఇచ్చే మందుబిళ్ళలు వేసుకుంటున్నట్టు చెప్పింది. నా చేతిలో ఉన్న జీతం డబ్బులు వారికి పంచాను. ఏదన్నా కొనుక్కోమని చెప్పాను.

ఇలా ఉండగా....

నాకు మా మేనత్త కొత్త డ్యూటీ అప్పచెప్పింది ఒకరోజు. అదేమంటే ఓ మాదిరి దూరంగా ఉన్న మాంసం కొట్టు నుండి మాంసం తేవడం. ఆ కొట్టు యజమాని మా అత్తకు పరిచయస్థుడే. నమ్మకంగా తాజా సరుకు ఇస్తాడని చెప్పింది. ఆ యజమాని లేకపోతే ఆయన కొడుకైనా షాపులో ఉంటాడంది. నీకు కొత్త కదా! నా పేరు చెప్పు, వారికి తెలుస్తుంది నీవెవరో అంది.

ఆమె చెప్పినట్లే డబ్బు తీసుకొని ఆ షాపుకి వెళ్ళాను. ఆమె చెప్పినట్లే ఆ షాపులో ఆ సమయంలో యజమాని లేడు. ఆయన కొడుకున్నాడు. నేనెవరో వివరంగా చెప్పి మాంసం కోసమని ఓ పక్కన నిలబడ్డాను. ఆ కుర్రవాడు చాలా అందంగా ఉన్నాడు. తనపని తాను చేస్తూనే నన్ను క్రీగంట గమనిస్తున్నాడు. నాలాగే మాంసం కోసం వచ్చిన వారికి మాంసం ప్యాకెట్లు అందిస్తూనే చాలా ఫన్నీగా మాట్లాడుతున్నాడు. అతని మాటలకు నేనూ నవ్వాను. అయితే అందరికీ మాంసం ప్యాకెట్లూ మిగిలిన చిల్లరా ఇస్తున్నాడే గానీ నాకు ఇవ్వడే! నేను ఇలా బయటకు వచ్చి పరాయి వ్యక్తి ముందు నిలబడడం ఇదే మొదటిసారి. నా గురించి ఏమనుకున్నాడో తెలియదు.

**(ఇంకా వుంది)**

---

## చుక్కలు చూపిస్తున్న చందమామ



*'ఖైదీ 150' తరువాత కాజల్‌లో కాన్ఫిడెన్స్ లెవల్స్ చాలా ఎక్కువ అయ్యాయి. అందుకే రెమ్యునరేషన్‌ను ఒకేసారి పెంచేసిందట! చిన్న నిర్మాత, పెద్ద నిర్మాత అని చూడకుండా నోటికొచ్చిన ఫిగర్ చెబుతూ...దర్శకనిర్మాతలకు చుక్కలు చూపిస్తోందట! తాము చిన్న నిర్మాతలమని చెప్పుకొన్నా కూడా ఏ మాత్రం తగ్గడం లేదని కొందరు వాపోతున్నారు. దీంతో చిన్న నిర్మాతలే కాకుండా కొందరు పెద్ద నిర్మాతలు కూడా కాజల్‌తో సినిమా అంటే ఆమడ దూరం పరిగెడుతున్నారట! కాజల్ పద్ధతి ఆమె సన్నిహితులకూ కూడా నచ్చడం లేదట! కాజల్ తన పద్ధతి మార్చుకోకపోతే భవిష్యత్తులో ఆమెతో సినిమాలు చేసేవారే కరవు అవుతారని ఆమె సన్నిహితులు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు.*

20



# హరివంశం

**కంసుని సభాభవనం నుంచి నిష్క్రమించిన నారదుడు, నేరుగా వచ్చి విష్ణుదేవుణ్ణి సందర్శించాడు. కంసునికి కలత కలిగించిన విషయం విష్ణుదేవునికి వివరించాడు. అలాగే కంసుని నీచకార్యాచరణంతా చెప్పాడతనికి. అంతా విని విష్ణుదేవుడు నర్మగర్భంగా నవ్వాడు. వెళ్ళిరా అన్నట్టుగా నారదుణ్ణి చూశాడు. వెళ్ళిపోయాడతను. నారదుడు అటు వెళ్ళగానే ఇటు విష్ణుదేవుడు దీర్ఘాలోచనలో నిమగ్నమయ్యాడు. కంసుని దుష్టోపాయాలన్నీ ఎదుర్కొని భూతలంపై తాను అవతరించాలి. ఉన్న అవకాశాలేమిటి? అక్కరకి వచ్చేదేమిటి? అన్నది విచారించడంలో విష్ణుదేవునికి ఓ ఆలోచన తట్టింది.**

## బలరామకృష్ణుల జననం

పూర్వకాలంలో కాలనేమి కుమారులు షడ్గర్భులన్నవారు బ్రహ్మదేవునికోసం తీవ్రంగా తపస్సు చేశారు. చెట్టుచేమలవల్లగానీ, పక్షులవల్లగానీ, మరి ఏ ఇతర ప్రాణులవల్లగానీ వారు మృతి చెందకూడదు. ఆ వరాన్ని సాధించాలి. బ్రహ్మ ప్రత్యక్షమైతే ఆ వరం కోరుకునేందుకు అనేక ఏళ్ళపాటు తపస్సు చేశారు. ఆ సంగతి చారులవల్ల హిరణ్యకశిపుడు తెలుసుకున్నాడు. తెలుసుకుని షడ్గర్భులపై మండిపడ్డాడిలా.

కులశ్రేష్ఠుణ్ణి నేనుండగా ఎవరికోసమో మీరు తపస్సు చేస్తున్నారు. సహించరానిదిది. ఇందుకు శిక్షగా మీరు మీ కన్నతండ్రి చేతుల్లోనే మరణిస్తారు. ఇది నా శాపం అన్నాడు. అక్కడితో ఊరుకోలేదు. ఆ ఆరుగురినీ కడలిగర్భంలో తొక్కిపెట్టాడు.

ఇప్పుడు ఆ ఆరుగురి ఆత్మలలో ప్రవేశించాల్సిందిగా యోగమాయను ఆదేశించడంలో అర్థం ఉందనుకున్నాడు విష్ణువు. అతనికి ఆ ఆలోచన కలగడం ఆలస్యం యోగమాయ ప్రత్యక్షమైంది. చేతులు రెండూ జోడించి, నమస్కరించి నిల్చుంది.

ఆజ్ఞ అన్నది.

యోగమాయా! నువ్వు ఇప్పుడు ఒక దేవకార్యం నిర్వహించాలి. దీనిని నువ్వు నిర్వహించగలిగితే అమరులేకాదు, మునీశ్వరులందరూ ఆశ్చర్యపోయేలా నీకు ఒక సమున్నతపథం ప్రసాదిస్తాను అన్నాడు విష్ణుదేవుడు.

ఆజ్ఞ అన్నది మళ్ళీ యోగమాయ.

కడలిగర్భంలో ఉన్న రాక్షసులు షడ్గర్భులకి నువ్వు మోహావేశం కలిగించాలి. కలిగించి, వారిని దేవకీదేవి గర్భంలో ప్రవేశపెట్టాలి. జన్మించిన మరుక్షణం ఆ ఆరుగురినీ కంసుడు నిర్దాక్షిణ్యంగా నరికివేస్తాడు. వారి మరణం తర్వాత నా దివ్యాంశ దేవకీదేవి గర్భంలో ప్రవేశిస్తుంది. అప్పుడు ఆ దివ్యాంశను సమాకర్షించి, దానిని నువ్వు రోహిణీదేవి గర్భంలో నిక్షిప్తం చెయ్యాలి. నువ్వు అలా చేసిన పక్షంలో ఆ దివ్యాంశే నాకు అన్నగా అవతరిస్తాడు. కంసుడి భయంతోనే దేవకీదేవికి గర్భస్రావం జరిగిందని అందరూ అనుకుంటారు. కాని, దానిని నువ్వు రోహిణీదేవి గర్భంలో నిక్షిప్తం చేసినట్టుగా ఎవరికీ తెలియదు అని ఆగాడు విష్ణుదేవుడు.

తర్వాత? అడిగింది యోగమాయ.

తర్వాత నేను దేవకీదేవి అష్టమగర్భంలో ప్రవేశిస్తాను. అదే సమయంలో నువ్వు యశోదాదేవి గర్భంలో ప్రవేశించాలి. కొన్నాళ్ళకు అష్టమీతిథి చివరలో నవమి ప్రారంభంలో అర్ధరాత్రివేళ ఇద్దరం జన్మిస్తాం. అప్పుడు వినిమయం జరుగుతుంది. అది అత్యంతగోప్యంగా జరుగుతుంది. దానిని గ్రహించలేని కంసుడు నీ కాళ్ళు పట్టుకుని నిన్ను రాతిమీదికి విసిరికొడతాడు. అతను విసిరి కొట్టీకొట్టగానే నా అనుగ్రహంవల్ల నువ్వు ఆకాశానికి ఎగిసిపోతావు. నా ప్రభావంతో నీకు నల్లనిరంగు వస్తుంది. నిండుజాబిల్లిలాంటి నెమ్మోము వస్తుంది. శార్ఙం, చక్రం, గద, ఖడ్గం, పద్మం, మధుపాత్ర, ముసలం, శూలంతో ఎనిమిది చేతులు వస్తాయి. తర్వాత నువ్వు సిద్ధచారణగణాలకు ఆనందసంధాయినివై మహావైభవంతో స్వర్లోకం ప్రవేశిస్తావు. ఎదురొచ్చి నిన్ను దేవేంద్రుడు ఆహ్వానిస్తాడక్కడ. అర్ఘ్యపాద్యాది పూజలతో గౌరవిస్తాడు. గౌరవించి, నిన్ను భువనాల కన్నిటికీ శక్తిస్వరూపిణిని చేస్తాడు. ఆనాటి నుంచి నువ్వు, నాకూ, ఆ దేవేంద్రునికీ చెల్లెలివై 'కౌశికి' అన్న పేరుతో వింధ్యాద్రిపై నివసిస్తావు. అక్కడ శుంభు, నిశుంభులను సంహరిస్తావు. నిన్ను ధృతి, కాంతి, శ్రీవిద్య, సన్నతి, మతి, సంధ్య, రాత్రి, ప్రభ, శాంతి, కాళరాత్రిగా వ్యవహరిస్తూ మునీశ్వరులు ప్రస్తుతిస్తారు. కంసుని సంహరించేందుకు నేను అతని పశువులకు కాపరినై కొంతకాలం వినోదిస్తాను అన్నాడు విష్ణుదేవుడు.

**బ్రహ్మదేవునికోసం తీవ్ర తపస్సుచేసి హిరణ్యకశిపుని ఆగ్రహానికి గురై కడలిగర్భంలో మగ్గుతున్నారు కాలనేమి కుమారులు. ఆ షడ్గర్భుల ఆత్మలలో ప్రవేశించింది యోగమాయ. ఒక్కొక్కరుగా వారిని దేవకీదేవి గర్భంలో ప్రవేశపెట్టింది. జననానంతరం వారందరినీ వితర్దిపై విసిరికొట్టి సంహరించాడు కంసుడు. యోగమాయ ఎందుకు ఇలా చేసింది? అసలు యోగమాయ ఎవరు? శ్రీకృష్ణ జననంలో ఆమె పాత్ర ఎలాంటిది?**

సరేనన్నట్టుగా సన్నగా నవ్వి అదృశ్యమైంది యోగమాయ. విష్ణుదేవుడు ఆదేశించినట్టుగానే ఆమె షడ్గర్భులు ఆరుగురినీ క్రమక్రమంగా దేవకీదేవి గర్భంలో ప్రవేశపెట్టింది. రాళ్ళకి విసిరికొట్టి వారిని సంహరించాడు కంసుడు.

కొద్దిరోజులు గడిచాయి.

కొంతకాలానికి దేవకీదేవి సప్తమగర్భం దాల్చింది. ఆ గర్భానికి ఏడవనెల నిండకముందే విష్ణుదేవుణ్ణి సమాకర్షించింది యోగమాయ. సమాకర్షించి, వ్రేపల్లెలో ఉన్న రోహిణి ఉదరంలో ప్రవేశపెట్టింది. రోహిణి ఉదరంలో తొమ్మిదినెలలూ నిండి, బలరాముడు జన్మించాడు. అతన్నే 'సంకర్షణుడు' అని వ్యవహరించారంతా.

మరికొద్దిరోజులు గడిచాయి. అప్పుడు విష్ణుదేవుని దివ్యతేజోభాగం దేవకీదేవి అష్టమగర్భంగా నిలిచింది. పద్నాలుగులోకాలనూ కడుపులో దాచుకున్న విష్ణుదేవుణ్ణి తన గర్భంలో దాచడం దేవకీదేవి అదృష్టంగా పరిణమించింది. ఇక్కడ దేవకీదేవి చూలాలు అయిననాడే అక్కడ వ్రేపల్లెలో యశోదాదేవి గర్భం ధరించింది.

పదవనెల ప్రవేశించింది. దేవకీదేవి ప్రసవించింది. కృష్ణుణ్ణి కన్నది. ఆ రోజు బహుళాష్టమి. అయిదు గ్రహాలూ ఉచ్చస్థితిలో ఉన్నాయి. దేవాధిదేవుడు జన్మించినంతనే చరాచరప్రపంచం పులకించి, ఆనందావేశంతో పరవశించింది. కోకొల్లలుగా పువ్వులు వికసించాయి. సువాసనలు వెదజల్లాయి. పుప్పొడులు జడిగా కురిశాయి. పిల్లతెమ్మెరలు వీచాయి. మునీంద్రుల పర్ణశాలల్లో అగ్నిహోత్రాలు ప్రదక్షిణగా ప్రజ్వలించాయి. సప్తసాగరాలు మధురఘోషతో ఉప్పొంగాయి. చుక్కలవెలుగులతో దిక్కుదేవతలు భూనభోంతరాళంలో పుష్పవృష్టి కురిపించారు. వైదికమంత్రాలతో కృష్ణుణ్ణి అభినందించి, ప్రస్తుతించారు. ఆకాశంలో నలువైపులా దేవదుందుభులు మోగాయి. గంధర్వుల గానఝురి వీనుల



విందైంది. అప్సరోభామినుల నృత్యాలు చూడ ముచ్చటనిపించాయి. పాతాళలోకంలో నివసిస్తున్న వాసుకి మొదలైన నాగరాజులుసైతం అమందా నంద పరవశులై పడగలు ఆడించి, ఎంతగానో సంతోషించారు.

పరమేశ్వరుడు అవతరించిన ఆ ఆనందసమ యంలో విష్ణుదేవుని విశ్వమోహనశక్తి కంసుని అంతఃపురాన్ని చుట్టుముట్టింది. దాంతో అక్కడి కావలివారుసహా మిగిలినవారంతా నిద్రమత్తులో ఊగిపోయారు. దేవకీవసుదేవులకూ, చంటిపిల్లాడిగా ఉన్న విష్ణుదేవునికీ నిద్రసోకలేదు. నల్లని ఉంగరా ల్లాంటి ముంగురులతో, తేనెసోనంటి చిరునవ్వుల చిందులతో, శ్రావణమేఘంలా నిగనిగలాడుతున్న పసికందుని చూశాడు వసుదేవుడు. పట్టరాని ఆనం దంతో పొంగిపోయాడు. అంతలోనే క్రుంగి పోయాడు.

అయ్యో! ఏ జన్మలో చేసుకున్న పాపమో నాకు జన్మించావు. నిన్ను చూసి పసికూన అని కూడా జాలిపడడు ఆ కంసుడు. దారుణంగా రాతికి కొట్టి హింసిస్తాడు. నిన్ను అలా హింసిస్తోంటే చూస్తూ నేను తట్టుకోలేనయ్యా! నా గుండె పేలిపోతుంది. నా శరీరం చీలిపోతుంది. ఏం చెయ్యగలను?

ఆలోచనలోపడ్డాడు వసుదేవుడు.

ఎలాగైనా ఈ కూనని రక్షించాలి. రహస్యంగా దాచి సంరక్షించాలి అనుకున్నాడు.

ప్రసవవేదన అంటే ఏమిటో తెలియక అలవోకగా జన్మించిన అందాలబిడ్డని చూసి పరమానందభరిత మైంది దేవకీదేవి. అంతలోనే దుఃఖించింది. కంసుని క్రౌర్యానికి గురికాకుండా ఈ నల్లనయ్యను కాపా డడం ఎలా? ఏ రకంగా ఆలోచించినా కాపాడ లేనంటూ తన అశక్తతకు కుమిలికుమిలి రోదిం చింది. ఏడుస్తున్న దేవకీదేవిని సమీపించాడు వసు దేవుడు. తన ఆలోచనను ఆమెకు తెలియజేశాడు.

"అంతా మంచే జరుగుతుంది. ఊరుకో" అన్నాడు. ఓదార్చాడు. వెంటనే ఆ పిల్లవాణ్ణి అక్కున చేర్చుకుని, అక్కణ్ణుంచి వ్రేపల్లెవైపు పరుగు దీశాడు. గాఢనిద్రలో ఉన్న అంతఃపురకావలివారె వరూ వసుదేవుని ప్రయాణాన్ని గమనించలేదు. వారు గమనించకపోవడమే కాదు, కారాగారం నుంచి వసుదేవుడు బయటపడేందుకు తలుపులు వాటంత టవే తెరుచుకోవడం, మళ్ళీ మూసుకోవడం...అన్నీ అనూహ్యంగా జరిగాయి. యమునానది రెండు పాయలుగా చీలిపోయింది. వసుదేవునికి దారి కల్పించింది.

వ్రేపల్లెలో యశోదాదేవి కుమార్తెను కన్నది. కని, యోగమాయాప్రభావంతో స్పృహలేకుండా నిద్రించ సాగింది. వసుదేవుడు వ్రేపల్లె ప్రవేశించాడు. నంద గోపుని ఇంటిలోనికి చొరుకున్నాడు. యశోదాదేవిని చూశాడు. స్పృహలేకుండా పడి ఉన్నదామె. పొత్తి ళ్ళలో కుమార్తెను చూశాడు. కృష్ణుణ్ణి ఆ పొత్తిళ్ళలో ఉంచి, అక్కడి కుమార్తెను అందుకున్నాడు. వెను తిరిగాడు. కారాగారానికి చేరుకున్నాడు. కుమార్తెను దేవకీదేవి చెంతన ఉంచి, తన ఆలోచన సాఫీగా సాగినందుకు ఆనందించాడు. కాసేపటికి తనంత తానుగానే వెళ్ళి, కంసునితో చెప్పాడిలా.

నీ చెల్లెలు కుమార్తెను ప్రసవించింది.

వసుదేవుడు చెప్పిన మాటకు ఒక్క ఉదుటన లేచి నిల్చున్నాడు కంసుడు. పసిపాపను సంహరిం చేందుకు ముందుకు ఉరికాడు. కారాగారంలో దేవకీ దేవి పొత్తిళ్ళలో పవళించి ఉన్న పాపను అందు కున్నాడు. విసిరికొట్టేందుకు వెనుతిరుగుతోంటే ఏడుస్తూ అతన్ని ప్రార్థించిందిలా దేవకీదేవి.

అన్నా! ఇది నీ మేనకోడలు, మేనల్లుడు కాదు. మేనల్లుళ్ళు నీ ప్రాణాంతకులు కాబట్టి వారిని సంహరించావు, కాదనలేదు. ఇది ఆడపిల్ల. ఆడ పిల్లను సంహరించడం నీలాంటివాడికి రాచమర్యాద కాదు.

మర్యాదలూ, మన్ననలూ నువ్వు నాకు చెప్ప నవసరం లేదన్నాడు కంసుడు. పాపను పిడికిటపట్టి అక్కణ్ణుంచి బయల్దేరాడు. పాప ఏడుపు, కంసుని క్రౌర్యం చూసి అంతఃపురస్త్రీలంతా హాహాకారాలు చేశారు. బలివితర్దిని సమీపించాడు కంసుడు. చేతి లోని పాపను కసిగా, కోపంగా చూశాడు. పైకెత్తి, బలాన్నంతా ఉపయోగించి వితర్ది మీదకు విసి రాడు. వితర్ది మీదపడి నెత్తుటిముద్ద అవుతుందను కున్న పాప, వితర్దిని అంటలేదు సరికదా ఆకా శానికి ఎగసింది. ఎగసి, శంఖం, చక్రం, గద ఆదిగా రకరకాల ఆయుధాలతో, ఎనిమిది బాహువులతో, దివ్యస్వరూపంతో ప్రత్యక్షమైంది. ఆమె చుట్టూ సిద్ధులూ, చారణులూ పరివేష్టించారు. భయభక్తు లతో స్తోత్రపాఠాలారంభించారు. అయినా శాంతించ లేదు ఆ తల్లి. దిక్కులు పిక్కటిల్లేటట్టు వికటాట్ట హాసం చేసింది. తర్వాత కెంపుల్లాంటి కళ్ళతో కంసుణ్ణి చూసి హెచ్చరించిందిలా.

ఓరీ దురాత్మా! దేవకీదేవి కడుపునపుట్టిన చిరుత పాపలందరినీ విసిరికొట్టి వధించావు. ఆడబిడ్డనని చూడక నన్ను కూడా అలాగే వధించాలనుకున్నావు. నీ ఆటలు ఇక సాగవు. నిన్ను కటికనేలమీదికి ఈడ్చి, కాలితో తొక్కిపట్టి నిర్మూలించే మహావీరుడు జన్మిం చాడు. నీకు మరణం తప్పదు.

అసాధ్యం అన్నాడు కంసుడు. ఆకాశంకేసి చూశాడు. సిద్ధచారణబృందాలుసహా దేవి అదృశ్య మైంది.

—అరణి




# మధ్యవర్తిత్వం సాధ్యమేనా?

**కశ్మీర్‌పై భారత్, పాకిస్థాన్‌ల మధ్య మధ్యవర్తిత్వం నెరపడానికి చైనా ముందుకు వచ్చింది. మధ్యవర్తిత్వానికి చైనాకు ఉన్న అర్హతలేమిటి?**

**కశ్మీర్ సమస్య జటిలమవుతున్న కొద్దీ ఈ సమస్యమీద ప్రపంచదేశాలు సలహాలు, సూచనలివ్వడం ఎక్కువైంది. ప్రస్తుతం భారత్‌లోనే కాక, అన్నిదేశాల ప్రజల నాలుకల మీద నానుతున్నమాట కశ్మీరే.**

అమెరికానుంచి టర్కీవరకూ అన్ని దేశాలు భారత్, పాకిస్థాన్ మధ్య కశ్మీర్ సమస్యపై మధ్యవర్తిత్వానికి ముందుకు వస్తున్నాయి. ఇటీవల భారత పర్యటనకు వచ్చిన టర్కీ అధ్యక్షుడు కూడా మధ్యవర్తిత్వం, మూడవ దేశ జోక్యం గురించి బహిరంగంగానే మాట్లాడారు. కశ్మీర్‌లో ఉగ్రవాద దాడులు, సైనిక దాడులు పాకిస్థాన్ పెంచుతూ పోతుండడంతో ప్రపంచ దేశాలు ఆందోళన చెందుతున్నాయి. అసలు కశ్మీర్ సమస్య కారణంగానే ప్రపంచానికి ఉగ్రవాద బెడద పట్టుకుందన్నట్టుగా అవి వ్యాఖ్యానిస్తున్నాయి. గతవారం చైనా కూడా కశ్మీర్ సమస్యపై భారత్, పాక్‌ల మధ్య మధ్యవర్తిత్వం నెరపడానికి సంసిద్ధత వ్యక్తంచేసింది.

ఆ దేశ అధికార పత్రికలు ఈ సమస్య గురించి విపులంగా చర్చిస్తూ, "ఇతర దేశాల ఆంతరంగిక వ్యవహారాల్లో జోక్యం చేసుకోకూడదనే సిద్ధాంతానికి చైనా మొదటినుంచీ కట్టుబడి ఉంది. చైనా పరిశ్రమలు, వాణిజ్య సంస్థలు ఇతర దేశాల్లో పెట్టుబడులు పెట్టినప్పుడు వాటిని కాపాడాల్సిన బాధ్యత చైనా ప్రభుత్వం మీద ఉందనడంలో సందేహం లేదు. చైనా ఈ విషయంలో తనకేమీ పట్టనట్టు వ్యవహరించలేదు. చైనా తన చుట్టుపక్కల దేశాల్లో భారీగా పెట్టుబడులు పెట్టింది. అందువల్ల పొరుగుదేశాల మధ్య ఏవైనా వివాదాలు, విభేదాలు ఉంటే వాటిని పరిష్కరించడానికి కృషి చేయడంలో తప్పేమీ లేదని చైనా భావిస్తోంది. అదే ఉద్దేశంతో అవసరమైతే భారత్, పాకిస్థాన్ దేశాల మధ్య కూడా వివాదాల పరిష్కారానికి చైనా సిద్ధంగా ఉంది" అని తెలిపాయి. "మయన్మార్, బంగ్లాదేశ్ మధ్య వివాదాల పరిష్కారానికి చైనా చేసిన కృషి విజయవంతమైంది. అదే అనుభవంతో, దక్షిణాసియా, ఆగ్నేయాసియా దేశాల మధ్య కూడా వివాదాల పరిష్కారానికి చొరవ చూపించాలనుకుంటోంది" అని కూడా అది తెలియజేసింది.

పొరుగు దేశాల విషయంలో చైనా చూపిస్తున్న ఆసక్తి చూసి బహుశా ప్రపంచ దేశాల దృష్టిలో ఆ దేశం ఉన్నతంగా కనిపిస్తే కనిపించవచ్చు. చైనా బాధ్యతాయుతంగా వ్యవహరిస్తున్నట్లు అన్ని దేశాలూ భావించవచ్చు. ప్రపంచ దేశాల మధ్య చైనాకు రాజకీయంగా, ఆర్థికంగా ఉన్న పలుకుబడి, ముఖ్యంగా కొన్ని చిన్న దేశాలపై దానికి ఉన్న పట్టు చూస్తే చైనా ఆలోచన, వైఖరి ఆకట్టుకునే విధంగానే ఉంటాయి. మయన్మార్, బంగ్లాదేశ్ సమస్యల పరిష్కారం వరకూ బాగానే ఉంది కానీ, దక్షిణాసియా విషయంలో మాత్రం ఈ ఆలోచన అంతగా చెల్లుబాటు కానట్టు కనిపిస్తోంది. దాని మధ్యవర్తిత్వం కచ్చితంగా తనకు అనుకూలమైన దేశం వైపే ఉంటుందనడంలో సందేహంలేదు. ఇక్కడ చైనాకు అనుకూలమైన దేశం పాకిస్థానేనని అందరికీ తెలుసు. భారత్, పాక్‌ల మధ్య చైనా మధ్యవర్తిత్వం నెరపడమనేది ఏ స్థాయిలో, ఏ విధంగా ఉంటుందో ముందుగానే ఊహించవచ్చు.

### చైనాయే అసలు దోషి

ఇందుకు కారణాలు అనేకం ఉన్నాయి. ఇందులో మొదటిది ఏమిటంటే, పాకిస్థాన్‌లాగే చైనా కూడా కశ్మీర్‌లో కొంత భాగం ఆక్రమించుకుంది. లడఖ్‌లోని ఆక్సాయ్‌చిన్‌లో సుమారు 37,240 చదరపు కిలోమీటర్ల విస్తీర్ణం గల భూమిని చైనా ఆక్రమించుకుంది. 1963లో తాము ఓ ద్వైపాక్షిక ఒప్పందం ద్వారా ఈ ప్రాంతాన్ని స్వీకరించినట్టు చైనా తరచు వాదిస్తుంటుంది. చైనా ఈ విధంగా ఆక్సాయ్‌చిన్‌లోని కొంత భాగం ఆక్రమించుకోవడం కూడా కశ్మీర్ సమస్యకు ఒక కారణమని భారత్ భావిస్తోంది. భారత్, పాకిస్థాన్ మధ్య వివాదాలు, విభేదాల పరిష్కారానికి చైనా మధ్యవర్తిత్వం నెరపడమంటే ఏమిటో, దాని ఫలితం ఎలా ఉండబోతోందో ఈ ఒక్క కారణాన్ని బట్టి అర్థం చేసుకోవచ్చు. సాధారణంగా స్వప్రయోజనం లేనిదే చైనా ఎటువంటి ఉదాత్త చర్యకూ పాల్పడదు.

నిజానికి హిందూమహాసముద్రంలోనూ, ఆసియా ఖండంలోనూ ప్రాబల్యం పెంచుకోవడానికి చైనా గత

# రివ్యూ

**- రాజశుక**

**కశ్మీరు సమస్యపై భారత్–పాకిస్థాన్ మధ్య మధ్యవర్తిత్వం చేసేందుకు చైనా ముందుకు వచ్చింది. వృద్ధనారీ పతివ్రత ...సామెత చందంగా భారత్ భూభాగం ఆక్రమించుకున్న చైనా, మధ్యవర్తిత్వం చేయాలనే పెద్దరికపు ఆకాంక్ష దయ్యాలు వేదాలు వల్లించడం లాంటిదే. హిందూ మహాసముద్రంలో ఆధిపత్యం కోసం ఎన్నో దుష్కార్యాలు చేస్తున్న చైనాకు ఆ అర్హత ఉందా? రాజశుక రివ్యూ చదవండి.**



ఆరేళ్ళుగా ఎన్నో దుష్కార్యాలకు పాల్పడుతోంది. భారత్ చుట్టూ ఉన్న దేశాలలో అభివృద్ధి కార్యకలాపాల ముసుగులో సైనిక బలగాలను పెంచుకుంటోంది. భారత్ విషయంలో అనేక పర్యాయాలు కయ్యానికి కాలు దువ్వింది. ప్రస్తుతం మయన్మార్, నేపాల్, మారిషస్, శ్రీలంక, పాకిస్థాన్, బంగ్లాదేశ్, టిబెట్ తదితర దేశాల్లో రోడ్లు, రేవులు, విమానాశ్రయాలు, రైలు మార్గాలు, ఇతర ప్రాజెక్టులు భారీయెత్తున నిర్మిస్తోంది. ప్రతి దాని దగ్గరా అవసరమున్నా లేకపోయినా భారీ సంఖ్యలో సైనిక బలగాలను, స్థావరాలను ఏర్పాటు చేస్తోంది. ఈ భారీ అభివృద్ధి వ్యూహానికి ముత్యాలసరాలని పేరుపెట్టింది.

అదే పద్ధతిలో, భారత్‌లో పాకిస్థాన్‌తో పాటు తాను ఆక్రమించుకున్న ప్రాంతాల దగ్గర కూడా చైనా తన ప్రాబల్యం పెంచుకుంటోంది. పాక్ ఆక్రమిత కశ్మీర్ లోనూ, గిల్గిత్‌బాల్టిస్థాన్‌లోనూ అది అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టి, శరవేగంతో పూర్తి చేస్తోంది. ఇక్కడ మరెన్నో ప్రాథమిక సదుపాయాలు కూడా కల్పిస్తోంది. విద్యుచ్ఛక్తి కేంద్రాలు, రోడ్ల నిర్మాణం, ఆస్పత్రుల నిర్మాణం, నీటి సరఫరా వసతులు వంటి అభివృద్ధి కార్యక్రమాలను చేపట్టింది. దీనికి చైనా 'చైనా పాకిస్థాన్ ఆర్థిక నడవా' అని పేరు పెట్టింది. భారత్ చుట్టూరా, భారత సరిహద్దుల్లో, పొరుగు దేశాల్లో భారీగా రోడ్ల నిర్మాణం చేపట్టడం భారత్‌కు ఆందోళన కలిగించే పరిణామం. పాక్ ఆక్రమిత కశ్మీర్‌లో భారత్ సరిహద్దులకు దగ్గరగా రోడ్ల నిర్మాణం, ఇతర అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టడం, వాటి రక్షణకు సైనిక బలగాలను కూడా భారీగా మోహరించడంపై అనేక పర్యాయాలు ఆందోళన వ్యక్తం చేసింది. ఉపఖండంలో ఇతర దేశాలు సైనిక బలగాలను మోహరించడంపై అమెరికా, ఐక్యరాజ్య సమితి, ఇతర అగ్రరాజ్యాలకు ఫిర్యాదు చేసింది. చైనాకు కూడా నిరసన తెలియజేసింది. అయినా, తన కార్యకలాపాలు కొనసాగిస్తూనే ఉంది.

## ఇదొక కొత్త పన్నాగం

భారత్ – పాకిస్థాన్ మధ్య మధ్యవర్తిత్వం నెరపడానికి చైనాకు ఎటువంటి అర్హతా లేదనడంలో సందేహం లేదు. పాకిస్థాన్‌లో భారీగా పెట్టుబడులు పెట్టడమే తన అర్హత అని చైనా అనుకుంటే పొరపాటు పడ్డట్టే. మధ్యవర్తిత్వం నెరపుతామని గతంలో అమెరికా సూచించినప్పుడే ఈ ఆలోచన భారత్‌కు దురుద్దేశ చర్యగా, అనవసర జోక్యంగా కనిపించింది. నిజానికి భారత్, అమెరికా మధ్య చాలా ఏళ్ళుగా సత్సంబంధాలే కొనసాగుతున్నాయి. అయినప్పటికీ భారత్ ఈ సూచనను తోసిపుచ్చింది. అటువంటిది, చైనా సూచనకు భారత్ సానుకూలంగా స్పందిస్తుందా అన్నది అనుమానమే. చైనా సూచనను మరింత నిర్మొహమాటంగా తిరస్కరించడంతప్ప భారత్ చేసేదేమీలేదు.

మీ ఇంట్లో కొంత భాగాన్ని ఎవరో ఆక్రమించుకుని, మీ పక్కింటి ఆయనతో మీకున్న వివాదాన్ని పరిష్కరిస్తానని ముందుకు రావడం ఎంత విడ్డూరంగా ఉంటుందో ఆలోచించండి! ఇప్పుడు చైనా చేస్తున్న పని కూడా అదే. పాక్‌లో భారీగా పెట్టుబడులు పెడుతున్నంత మాత్రాన మధ్యవర్తిత్వం నెరపవచ్చనుకుంటున్న చైనా, నిజానికి మరో మార్గంలో కశ్మీర్ సమస్యకు పరిష్కారం కనిపెట్టడం మంచిది. భారత్ కూడా ఈ మేరకు సూచించడం మంచిది. పాకిస్థాన్‌లో చైనా సుమారు 6,200 కోట్ల డాలర్ల పెట్టుబడులు పెడుతోంది. ఇంత భారీగా పెట్టుబడులు పెడుతున్నందువల్ల, పాకిస్థాన్‌తో చైనాకు మైత్రీ సంబంధాలు బాగా గట్టిపడ్డాయి. చైనా చెప్పినదానికల్లా పాకిస్థాన్, పాకిస్థాన్ చెప్పినదానికల్లా చైనా తల ఊపడం జరుగుతోంది. దీన్ని అడ్డం పెట్టుకుని చైనా ఇప్పటికైనా పాకిస్థాన్‌మీద ఒత్తిడితెచ్చి, తమవైఖరి మార్చుకునేలా చేయవచ్చు. అవసరమైతే, పాకిస్థాన్ రక్షణ, సైనికాధికారులను కూడా ఒప్పించవచ్చు. సీమాంతర ఉగ్రవాదాన్ని నిరోధించడానికి పాకిస్థాన్ ప్రభుత్వాన్ని, సైనిక వ్యవస్థను అంగీకరింపజేయవచ్చు. పాకిస్థాన్‌కు చెప్పేముందు చైనా కూడా తనను తాను సరిదిద్దుకోవాల్సి ఉంటుంది. సరిహద్దులవెంట సైనిక బలగాలు మోహరించి కయ్యానికి కాలు దువ్వడం, పేచీకోరు వైఖరి ప్రదర్శించడం వంటివాటికి స్వస్తి చెప్పాలి. ముఖ్యంగా లడఖ్ సమీపంలో ఆక్సాయ్‌చిన్ వద్ద తాను ఆక్రమించుకున్న ప్రాంతాన్ని విడిచిపెట్టాలి. చైనా తాను చేపట్టిన అభివృద్ధి కార్యక్రమాలన్నీ భారత్‌కు భద్రత విషయంలో తీవ్ర ఆందోళన కలిగిస్తున్న వాస్తవాన్ని గ్రహించుకోవాలి. చైనా తన మధ్యవర్తిత్వం బాధ్యతను చిన్న దేశాలకు పరిమితం చేసుకుని, భారత్ ప్రాంతీయ భద్రత విషయంలో అనుభవిస్తున్న సమస్యలను పరిష్కరించాలి. జైషే మొహమ్మద్‌కు చెందిన మౌలానా మసూద్ అజర్‌ను ఐక్యరాజ్య సమితి అంతర్జాతీయ స్థాయి ఉగ్రవాదిగా గుర్తించకుండా చేస్తున్న ప్రయత్నాలను చైనా విరమించుకోవాలి.

చైనా తన అక్రమాలను సమర్థించుకోవడానికి ఎప్పుడు చూసినా తన ప్రాచీన, మధ్యయుగాలనాటి చరిత్రను ఉటంకిస్తుంటుంది. ఇటీవలి చరిత్రను కూడా చైనా ఒక్కసారి నెమరేసుకోవడం మంచిది. ఇస్లామాబాద్‌లోని లాల్ మస్జిద్ పరిసరాల్లో జైషే మొహమ్మద్‌కు చెందిన కార్యకర్తలు, నాయకులు తిరుగుతూ ఉంటారు. చైనా అక్కడ వ్యభిచారగృహాలు నిర్వహిస్తోందనే ఆరోపణలు రావడంతో పాకిస్థాన్ సైన్యం ఆ ప్రాంతం మీద దాడులు చేసి పలువురు ఉగ్రవాదులను హతమార్చింది. ఈ విషయం కూడా చైనా గుర్తు చేసుకోవాల్సి ఉంటుంది. ఉపఖండంలో పాకిస్థాన్ దుశ్చర్యలు ఏ విధంగా ఉన్నాయో చైనాకు తెలియనిది కాదు. ఎక్కడ ఎటువంటి మధ్యవర్తిత్వం నెరపాలో, ఏ దేశం మీద ఒత్తిడి తీసుకువచ్చి శాంతిస్థాపనకు కృషి చేయాలో చైనా ఇప్పటికైనా తెలుసుకోవడం మంచిది.

నవ్య

# రెండో బాల్యం

**-పినిశెట్టి శ్రీనివాసరావు**

**"రాముా, శిరీషకు ఒకసారి ఫోన్ చెయ్యి. నాతో మాట్లాడమను. ఎంతకాల మయిందిరా అది నాతో మాట్లాడి? తల్లితో పది నిమిషాలు మాట్లాడటానికి కూడా తీరిక లేకుండా ఉందా దానికి? రాకపోకలు ఎలానూ లేవు. దాని మొగుడు దీన్ని రాని వ్వడు కాబోలు. రాకపోతే పోయిందిలే... ఫోనులో మాట్లాడటానికి ఏం ఇబ్బందట? నాకు దానిమీద చాలా కోపంగా ఉందని చెప్పు. నేను ఇంకా బతికే ఉన్నానుగా. 'అమ్మా ఎలా ఉన్నావు? అని అడగటానికి కూడా దానికి మనసు రావటం లేదంటే అది నా కూతురేనా అసలు!" అమ్మ కోపంగా అంది.**

"అలాగేలే అమ్మా! ఇంత రాత్రిపూట ఏం మాట్లాడతావు చెప్పు. రేప్పొద్దున్న చూద్దాంలే" అన్నాను అమ్మతో.

అప్పుడు సమయం రాత్రి పన్నెండు. అమ్మకు రాత్రివేళ నిద్ర పట్టదు. ఎప్పుడేం అవసరం వచ్చి పిలుస్తుందో అని మెలకువగానే ఉంటాను. అమ్మ నిద్రలోకి జారుకున్నాకే నేనూ నిద్రపోయేది.

శిరీష నాకు చెల్లెలు. అమ్మకు మేం ముగ్గురం సంతానం. పద్మక్క అందర్లోకీ పెద్దది. ఆ తర్వాత నేను. మా తాత పేరు రామం. ఆ పేరే పెట్టారు నాకు. నా తర్వాత శిరీష. అందర్లోకీ చిన్నది. అదంటే అమ్మకి చాలా ఇష్టం. పద్మక్కను సొంత మేన బావకే ఇచ్చి చేశారు. దానికి ఇద్దరు పిల్లలు. కొడుకు, కూతురు. వాళ్ళ పెళ్ళిళ్ళు అయిపోయాయి. వాళ్ళకు తలా ఇద్దరేసి పిల్లలు.

నాదీ, శిరీషదీ బయట సంబంధాలే. శిరీషకు ఇద్దరూ ఆడపిల్లలే. నాకేమో కొడుకు, కూతురు. నా పిల్లలిద్దరూ ఉద్యోగస్థులే. ఇద్దరికీ పెళ్ళిళ్ళు చేసే శాను. అమ్మాయికి ఒక కూతురు. అబ్బాయికి ఒక కొడుకు. అమ్మాయి మొగుడితోపాటు బెంగళూ రులో ఉంటోంది. ఉద్యోగం చేస్తోంది. అబ్బాయి ప్రస్తుతం అమెరికాలో ఉంటున్నాడు, వాళ్ళ కంపెనీ ప్రాజెక్టు పనిమీద.

అందరూ బిజీబిజీనే. ఎవరి వ్యాపకాల్లో వాళ్ళు మునిగి తేలుతుంటారు. నేను, మా బావగార్లిద్దరూ ఉద్యోగాలకు పదవీ విరమణ చేశాక ఇంటి పట్టునే ఉంటున్నాం. పెద్దబావ కాకినాడలో, చిన్నబావ వైజాగ్‌లో, నేనేమో భాగ్యనగరంలో స్థిరపడ్డాం. మా అందరికీ వయసుతోపాటు వచ్చే ఏదో ఒక అనా రోగ్యం.

నాన్న ఉన్నప్పుడు వ్యాపారం అంటూ, సినిమా లంటూ, నాటకాలంటూ కాలక్షేపం చేస్తుండేవాడు. స్థిరమైన వ్యాపకం, ఆదాయం లేదు. ఇంట్లోంచి ఎప్పుడు వెళ్ళేవాడో, ఎప్పుడు తిరిగొచ్చేవాడో చిన్న తనంలో మాకు అంతగా తెలిసేది కాదు. అందుకనే అమ్మయినా, నాన్నయినా అన్నీ అమ్మే మాకు. అమ్మే కష్టపడి మా అవసరాలన్నీ తీర్చేది. నాన్న ఇంట్లో ఏం డబ్బులు ఇచ్చేవాడో ఏమో, అమ్మ మాత్రం ప్రతినెలా పాలకీ, వెచ్చాలకీ, ఇంటద్దెకీ, కరెంటు బిల్లుకీ....ఇలా ఒకటనేమిటి ప్రతి నిత్యావస రానికీ ఎంతో కటకటలాడిపోయేది. అలాగని మా ముగ్గుర్నీ ఏనాడూ పస్తుపెట్టింది లేదు. ఆడపిల్లల చదువు స్కూలుతో సరిపెట్టినా, నన్ను మాత్రం డిగ్రీదాకా చదివించింది. ఆ చదువే నాకు ఉద్యోగం సంపాదించి పెట్టింది.

***

అమ్మకు ఒక్కడే తమ్ముడు. మా ఇంటికి మావయ్య రాకపోకలు మొదటి నుంచీ తక్కువే. వ్యవసాయదారుడవటంతో, ఎప్పుడూ ఉన్న ఊరినే అంటిపెట్టుకుని ఉండేవాడు. అమ్మమ్మ, తాతయ్య, మావయ్య, అత్త అంతా కలిసే ఉండేవాళ్ళు. కానీ కలిసిన మనసులు కావు. మనస్పర్థలు, కీచులాటలు నిత్యకృత్యాలు. తాతయ్య మొండితనం, అమ్మమ్మ వేధింపులు, అత్త ఎదిరింపులు, మావయ్య బేలతనం... ఇలా ఒకే చూరు కింద ఉన్నారన్న పేరుకే గానీ, ఒకే తీరుగా మాత్రం లేరన్నది వాళ్ళకీ తెలుసు. ఈ పరిస్థితుల్లో అమ్మ పుట్టింటికి తరచూ వెళ్ళటం శ్రేయ స్కరం కాదనుకుందేమో, ఏదైనా విశేషం ఉంటే తప్ప తాతయ్య ఇంటికి వెళ్ళేవాళ్ళం కాదు. శారీ రక అనారోగ్యం కంటే, మానసిక మైన రుగ్మతలే మనిషిని త్వరగా కుంగదీస్తాయి. అందుకేనేమో, అమ్మమ్మ ముందుగా ఈ లోకం నుంచి నిష్క్రమిం చింది. రెండేళ్ళ అనంతరం తాతయ్య అమ్మ మ్మనే అనుసరించాడు. ఆ వెంటనే వాళ్ళి ద్దర్నీ వెతుక్కుంటూ మావయ్య వెళ్ళిపో యాడు. అంతే, ఆ తర్వాత అత్తయ్య క్షేమ సమాచారాలు తెలుసుకుందామన్నా ఆమె ఎక్కడవుందో కూడా తెలియని పరిస్థితి. అమ్మకు ఇక పుట్టింటి వాళ్ళంటూ ఎవ్వరూ లేకుండా పోయారు. తను, తన పిల్లలే సర్వస్వంగా బతికింది. ఇద్దరు ఆడపిల్లల పెళ్ళిళ్ళు చేశాక వాళ్ళ ఇళ్ళకు వాళ్ళు వెళ్ళిపోయారు. ఎంతయినా ఆడపిల్లలు పెళ్ళయ్యేంతవరకే పుట్టింట్లో తల్లిదండ్రుల సంరక్ష ణలో ఉంటారు గానీ, పెళ్ళంటూ అయ్యాక మెట్టి నింటికే చాలావరకూ పరిమితం కావటం సహజం. పుట్టింటికి అప్పుడప్పుడు చుట్టం చూపుగా వచ్చిపో వటం తప్పిస్తే, మునుపటిలా బంధాలు, బాధ్య తలు కుదిరేపని కాదు.

ఇక నాన్న సంచారజీవి. సంసారం, సంతానం పట్టించుకునేవాడే కాదు. తన అవసరాలన్నీ బయటే తీర్చుకునేవాడు. నారు పోశాడు గానీ, నీరు పొయ్యాలనుకోలేదు. నిజానికి నాన్న ఉండీ లేనట్టే. ఆఖరుకు లేకుండానే పోయాడు. నాన్న పోయి ఇరవైయేళ్ళయ్యింది. అమ్మ నాతోనే ఉండిపో యింది. కొడుకుగా ఆమెను చూడటం నా బాధ్యత. దానికి నాకేం ఇబ్బంది లేదు. నాకే మరో బిడ్డ ఉంటే చూసుకోనా? అత్తాకోడళ్ళిద్దరూ మంచి మిత్రుల్లా కలసిమెలసి ఉండటం నా అదృష్టం. వారిద్దరి మధ్య సఖ్యత నాకు ఎంతో బలాన్నిచ్చింది. లేక పోతే అమ్మను నా దగ్గర ఉంచుకోవటం సాధ్యప డేది కాదేమో! అత్తాకోడళ్ళు, తల్లీ కూతుళ్ళలా కలసి పనిచేసుకుంటే అది 'హ్యాపీహోమ్' కదా! మనవ లను కూడా ఎంతో ఆప్యాయంగా చూసేది అమ్మ. నిజానికి మా దగ్గర కంటే, అమ్మ దగ్గరే పిల్లలు



ఇద్దరూ ఎంతో చనువుగా ఉండేవారు. వాళ్ళకు నానమ్మ అంటే ఇష్టం, గౌరవం.

నాన్న పోయేనాటికి అమ్మ వయసు అరవై. ఆ తర్వాత పదిహేనేళ్ళ కాలం అమ్మకు ఏ అనారోగ్యం లేదు. నా భార్య జానకితో సమానంగా కష్టపడి పనిచేసేది. వద్దన్నా వినేది కాదు. 'తిని కూర్చుంటే తిన్నది అరగొద్దూ' అంటూ ఏదో ఒక పని చేస్తూనే ఉండేది. ఆ తర్వాత అమ్మ ఆరోగ్యం క్రమంగా క్షీణించడం మొదలైంది. కీళ్ళనొప్పులు, చక్కెర వ్యాధి, నరాల బలహీనత, విసర్జకావయవాలపై నియంత్రణ కోల్పోవటం... ఒకదాని తర్వాత ఒకటి. అమ్మ ఆరోగ్యం పూర్తిగా పాడయింది. అమ్మ అనారోగ్యం కారణంగా గత ఐదు సంవత్సరాలుగా జానకికి పనిభారం పెరిగింది. ఇదే సమయంలో మా అమ్మాయి పెళ్ళి చేసుకుని భర్తతోపాటు బెంగళూరు వెళ్ళిపోవటం, పోయిన యేడాదే మా అబ్బాయి పెళ్ళి చేసుకున్న వెంటనే అమెరికా ప్రయాణం కావడంతో ఇక ఇంట్లో మిగిలింది నేను, జానకి, అమ్మ.

అమ్మ వయస్సు ఎనభై దాటింది. సంవత్సర కాలంగా అన్నీ మంచంమీదే! అమ్మ నా చిన్నప్పుడు నాకేం చేసిందో, నేనే ఇప్పుడు అమ్మకు ఆ పనులన్నీ చేస్తున్నాను. ఇక జానకి సంగతి చెప్పనే అక్కర్లేదు. వంటపనితో, అమ్మ పనితో అలసిపోతోంది. డయాబెటిక్ పేషంటేమో... త్వరగా అలసటకు లోనవుతోంది. నాకు హైపర్‌టెన్షన్. రోజూ ఓ మాత్ర పడేసి దాన్ని అదుపులో ఉంచుతున్నాను. ఇక చుట్టం చూపుగా అప్పుడప్పుడు వచ్చిపోయే జలుబు, జ్వరం, అజీర్తి వంటి వాటికి చిట్కా వైద్యం చేసి, మా పని మేం చేసుకుపోవడమే తప్ప, ఈ శరీరం అనే యంత్రం ఆగితే కుదరదు. విశ్రాంతి అంటే దానికి తెలియదు.

అమ్మను చూసుకోవడానికి ప్రత్యేకంగా ఒక పనిమనిషిని పెట్టాలన్న ఆలోచన వచ్చింది. పెట్టి చూశాం. అది చేసేది చాలా తక్కువ. అధికభాగం మేమే చేస్తున్నాం. దానిపనిలో శుభ్రత లేదు. మాతోపాటే దానికి వండిపెట్టడం, దానికి జీతమిస్తూ మేమే సగం పైగా పని చేసుకోవడం చూశాక ఆ పని మనిషి అనవసరం అనిపించింది. వెంటనే తీసేశాం.

"రామూ, నువ్వెళ్ళి పడుకోరా. నాకు నిద్ర వస్తోంది" అంది అమ్మ.

అప్పుడు రాత్రి రెండు గంటలయింది. ఇది నాకు రోజూ అలవాటే. అమ్మ పడుకుంటేగానీ, నేను పడుకోను. పగలూ, రాత్రీ అమ్మ మంచం మీదే. అన్నీ మంచంలోనే. ఎప్పటికప్పుడు పక్కబట్టలు మార్చి, డెట్టాల్‌తో శుభ్రం చేసి, ఉతికినవి వేయకపోతే అమ్మ పడుకోలేదు. అమ్మ మంచం పక్కనే కాలింగ్‌బెల్ స్విచ్. స్విచ్ నొక్కితే అమ్మకు ఏ అవసరం ఉన్నా వెళ్ళి, చేసి వస్తూ ఉంటాను. జానకి నాతోపాటే అర్ధరాత్రి పన్నెండింటిదాకా మేల్కొనే ఉంటుంది. ఆ తర్వాత కునికిపాట్లు మొదలవుతాయి. నా బలవంతంమీద వెళ్ళి పడుకుంటుంది. పొద్దున్నే ఆరింటికే లేస్తుంది. అమ్మ కూడా అంతే. నేను నిద్ర లేచేలోపే అమ్మ చేత ముఖం కడిగించి, తాగడానికి పాలో, హార్లిక్సో ఇస్తుంది. నానబెట్టిన ఓట్స్ తినిపిస్తుంది.

***

ఈ ఏడాది కాలంలో అమ్మ బాగా చిక్కి శల్యమై పోయింది. ఏమీ తినలేకపోతోంది. మందులు వేసుకోవటానికైనా ఎంతో కొంత తినక తప్పదంటే, బలవంతంమీద సరే అంటుంది. చాలా వరకు ద్రవాహా




రమే. పండ్లరసాలు, పాలు, తింటే గోధుమ అన్నం. శరీరం బక్కచిక్కి పోతున్నా, జ్ఞాపకశక్తి అమోఘం. చిన్ననాటి సంగతులు సైతం చెబుతుంది. ఎవరు వచ్చినా గుర్తుపడుతుంది. వాళ్ళపేరు ఇంటి పేరుతోసహా చెప్పి ఆశ్చర్యచకితుల్ని చేస్తుంది. వాళ్ళెలా ఉన్నారు? అంటూ ఆరా తీస్తుంది. ఆప్యా యంగా చెయ్యి పట్టుకుంటుంది. దగ్గర కూర్చో మంటుంది. 'ఎలా ఉన్నారు మామ్మగారూ?' అని ఎవరైనా అడిగితే, 'ఇంకా నేను బతికి ఉండటం దేనికి? కొడుకుని, కోడల్ని ఇబ్బంది పెట్టటానికి తప్పిస్తే. ఆ దేవుడు నన్ను ఎప్పుడు కరుణిస్తాడో?' అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకుంటుంది. వచ్చినవాళ్ళు వెళ్ళిపోతుంటే దీనంగా చూస్తుంది. వచ్చిన వాళ్ళు వెళ్ళిపోతూ, నన్నూ, జానకినీ చూసి జాలిపడు తుంటే మాకు ఇబ్బందిగా అనిపిస్తుంది.

ఎవరైనా వచ్చినప్పుడు తప్పిస్తే, ఆ తర్వాత మాకు మేమే. మేము ముగ్గురమే. పనిమనిషి వచ్చినా, దాని పనేదో అది చేసుకుపోతుంది తప్ప, పొరపాటున కూడా ఒప్పుకున్నదానికన్నా ఒక్క పని అదనంగా చెయ్యదు. నాలుగు ఇళ్ళల్లో పనిచేస్తుంది. చకచకా మా ఇంటి పనులు చేసుకుపోతుంది తప్పిస్తే నిదానంగా చెయ్యదు. జీతం నెలకు రెండు వేలు. అమ్మ బట్టలు, పక్కబట్టలు కూడా ఉతకాలి గనక ఆమె అడిగినంత జీతం ఇవ్వక తప్పదు. నెలలో కనీసం నాలుగు నాగాలు పెడుతుంది. జానకికి ఆ నాలుగు రోజులూ పనిభారం పెరిగిపో తుంది. నా వంతు సాయం నేను చేస్తూ ఉంటాను.

మగపిల్లల కంటే ఆడపిల్లలకే తల్లిదండ్రులపట్ల ప్రేమ, ఆప్యాయతలు ఎక్కువ అంటారు. కానీ పద్మక్క అస్సలు అమ్మ ఊసే ఎత్తదు. శిరీష... కూడా అంతే. వాళ్ళ సంసారాలు, సమస్యలు తప్పిస్తే మరే విషయం పట్టించుకోరు. చుట్టం చూపుగా వచ్చిపోతుంటారు తప్పిస్తే అమ్మను దగ్గ రుండి చూసుకునే నైజం వాళ్ళకి లేదు. కోడలైనప్ప టికీ జానకి కూతుళ్ళకంటే ఎక్కువ. నా దృష్టిలో జానకి దేవత. నేను ఏ జన్మలో చేసుకున్న పుణ్యమో నాకు అర్థాంగిగా దొరికింది. ఏమిచ్చి తన ఋణం తీర్చుకోగలను? మళ్ళీ జన్మంటూ ఉంటే జానకే నాకు భార్యగా కావాలనిపిస్తుంది. ఒకవేళ తను మగాడిగా పుట్టి నేను ఆడజన్మ ఎత్తితే, నేను తనకు భార్యనై సేవలు చేసి, తరించాలనిపిస్తుంది. నా జానకి అంత గొప్పది. నా పాలిట దైవం. తనే లేక పోతే అమ్మ ఏమైపోయేదో? ఇలాంటి పనులు చేయడానికి ఏ పనిమనుషులూ ముందుకు రావటంలేదు. వచ్చినా ఎక్కువ రోజులు ఉండరు. బయటివాళ్ళు అనేసరికి అమ్మకీ సౌకర్యంగా ఉండదు. అలాగని అమ్మని ఏ ఆశ్రమానికీ పంపిం చలేను. అదే జరిగిన రోజున, అమ్మ అంతిమయాత్ర ప్రారంభమైనట్టే. ఆ ఆలోచనే నేను భరించలేను. నా బిడ్డను చూస్తూ చూస్తూ అనాథగా వదిలేయలేను.

***

అర్ధరాత్రి అమ్మకు ఏమిటో ఫిట్స్ లాగా వచ్చాయి. గాభరా పెట్టేసింది. అంత రాత్రిపూట ఏ డాక్టరు దగ్గరకైనా ఎలా తీసుకెళ్ళడం? అప్పు డప్పుడు ఇంటికి వచ్చే ఆర్ఎంపి డాక్టరుకు ఫోన్ చేశాను. రెస్పాన్స్ లేదు. పోనీ స్కూటరుమీద డాక్టర్ ఇంటికి వెళదామంటే ముందురోజే స్కూటర్ పార్క్ చేసేటప్పుడు బేలన్స్‌తప్పి స్కూటర్ హ్యాండిల్ చేతికి తగిలి, మణికట్టు దగ్గర నొప్పి చేసింది. ఇప్పుడు స్కూటర్ డ్రైవింగ్ చేసే పరిస్థితుల్లో లేను. పక్క పోర్షన్‌లో ఆయన్ని నిద్రలేపి పరిస్థితి ఇలా ఉందని వివరించాను. పాపం ఆయనే వెళ్ళి డాక్టర్ని తన బండిమీద ఎక్కించుకుని తీసుకువచ్చాడు. డాక్టరు వెంటనే ఏదో ఇంజక్షన్ ఇచ్చాడు. కొన్ని మాత్రలు కూడా ఇచ్చి రెండు గంటలకు ఒకసారి ఆ మాత్రలు వెయ్యమన్నాడు. ఉదయం లోపు గుణం కనిపించకపోతే ఏదైనా ఎమర్జెన్సీ హాస్పిటల్‌కి తీసుకు వెళ్ళమన్నాడు. ఆ రాత్రంతా అమ్మ పక్కనే కూర్చుని మందులు ఇస్తూ జాగారం చేశాం నేనూ, జానకీ. ఏ దేవుడు కరుణించాడో ఉదయానికి గుణం కని పించింది. డాక్టరుకు ఫోన్‌చేసి చెప్పాను. అవే మందులు వాడమన్నాడు. దేవుడులాంటి డాక్టరుకు ఫోన్‌లోనే కృతజ్ఞతలు తెలియజేశాను.

'అమ్మ ఆరోగ్యం క్షీణిస్తోంది. ఏ రోజు ఎలా ఉంటుందో ఊహించడం కష్టం. ఒకసారి వచ్చి చూసి వెళ్ళమని పద్మక్కకు ఫోన్‌చేసి చెప్పాను. 'నాకెక్కడ వీలవుతుంది' అని ముందు అన్నప్పటికీ నా బలవంతం మీద 'సరే వస్తా'నంది. ట్రైన్ టికెట్ తీసి పంపాను. వచ్చింది గానీ, ఏదో అతిథిలా కూర్చుంది. అమ్మ విషయంలో జానకికి ఏ మాత్రం పనిలో సహాయం అందించలేదు. 'ఒక్క నెల

**పిల్లలు వృద్ధిలోకి వచ్చి, బాధ్యతలన్నీ తీరాక వారికి రెండోబాల్యం మొదలవుతుంది. మన వలు, మునిమనవలతో ఆడుకుంటూ, ఎటు వంటి అనారోగ్యం లేకుండా హాయిగా ఉంటే ఆ స్థితి వారికి వరంలాంటిదే. ఒకవేళ మంచాన పడితే మాత్రం శాపం కిందే లెక్క. సేవలు చేసేవాళ్ళకూ, చేయించుకునే వాళ్ళకు కూడా ఇబ్బందే. అలాంటి స్థితిలోనే ఉంది ఆవిడ. మరి ఆవిడ పిల్లలు ఏం చేశారు?**

రోజులు ఇక్కడే ఉండి అమ్మను కాస్త చూసుకోవే. జానకికి కాస్తంత విశ్రాంతి ఇచ్చినట్టు ఉంటుంది' అన్నాను.

'నాకేం చేతవును ఈ పన్లన్నీ? మీకంటే అల వాటు. అమ్మని చూడటానికి రమ్మంటే నాలుగు రోజులు ఉండటానికి వచ్చానుగానీ, నెలరోజులు ఉంటానా ఏమిటి? నాకు ఇంటి దగ్గర బోల్డన్ని పనులు ఉంటాయి. నేను లేకపోతే ఇల్లే గడవదు' అంటూ ఒకటే నస. నేను, జానకి అమ్మ కోసం పడు తున్న యాతన చూసైనాగానీ, కొద్ది రోజులు ఉండి తన వంతు సాయం చేయాలన్న ఆలోచన పద్మ క్కకు రాకపోవటం నాకు బాధ కలిగింది. కన్నతల్లి గురించేగా, ఇంకెవరి కోసమో ఉండమనట్లేదుగా? ఆడపిల్లై ఉండీ తల్లివిషయంలో అంటీముట్టనట్టు ప్రవర్తించడం శోచనీయం. జానకి బాధపడి ఉండొచ్చు. కానీ బయటకు చెప్పలేదు. ఏదైనా మనసు లోనే దాచుకుంటుంది. నాలుగు రోజులు కాగానే వెళ్ళిపోతానంటూ గొడవ పెడుతుంటే, ఎంతకని ఆపగలం? రిటన్ టికెట్ తీసిచ్చాను. అంతే ఆనం దంగా వెళ్ళిపోయింది.

"పద్దు ఒక్కత్తే వచ్చింది చూశావా? నారాయణ కూడా వచ్చి ఉంటే బాగుండేది. వాణ్ణి చూసి ఎన్నేళ్ళ య్యిందో? అల్లుడుకాకముందు వాడు నా తమ్ము డేగా? చిన్నప్పుడు అందరం కలిసి ఆడుకున్నాం. అక్కని చూడటానికి వస్తే వాడి అల్లుడి హోదాకి భంగం కలుగుతుందనుకున్నాడేమో" అంటూ పెద్దబావ తనని చూడటానికి రానందుకు అమ్మ బాధపడింది.

ఏం మాట్లాడాలో తెలీక మౌనంగా ఉండి పోయాం నేనూ, జానకీ.

***

అమ్మకి ఇప్పుడు కొంచెం బాగానే ఉంటోంది. మళ్ళీ చిన్నకూతురు శిరీష గుర్తొచ్చింది. "దానికి ఫోన్ చెయ్యమన్నాను, చేశావా? ఇప్పుడు ఫోన్‌చేసి నాతో మాట్లాడించు" అంది అమ్మ. నాకు తప్పించు కునే మార్గం కనపడలేదు. గది బయటకు వచ్చి చిన్నబావకి ఫోన్ చేశాను. "శిరీషతో అమ్మ మాట్లాడతా నంటోంది" అన్నాను. బావకి అర్థమైంది. ఏం మాట్లాడలేదు. ఫోన్ పెట్టేశాడు. అమ్మ దగ్గరకు వచ్చి, "శిరీష ఇంట్లో లేదట. వచ్చాక మాట్లాడిస్తాను అన్నాడు బావ" అని చెప్పాను అమ్మతో. "ఇంట్లో లేకుండా ఊరిమీద బలాదూర్ తిరుగుతోందన్న మాట. చిన్నప్పుడు దాన్ని ఎంత అపురూపంగా పెంచాను. మీ ముగ్గురిలోకీ అదంటేనే నాకు చాలా



# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
## హార్మోన్ సమస్యలకు సమర్థవంతమైన చికిత్సలు


డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్




ఈ మధ్యకాలంలో చాలామంది థైరాయిడ్, పీ.సి.ఓ.డి., సంతానలేమి మరియు డయాబెటిస్ వంటి దీర్ఘకాలిక ఆరోగ్య సమస్యలతో ఎక్కువగా బాధపడటం జరుగుతోంది. ఈ విధమైన ఆరోగ్య సమస్యలు హార్మోన్‌ల అసమతుల్యత వలన ఏర్పడతాయని చాలామందికి తెలియదు. ఇలాంటి అసమతుల్యతలు ఏర్పడటానికి కేవలం చిన్న కారణమైనా చాలు – అవి తీవ్రమైన దీర్ఘకాలిక ఆరోగ్య సమస్యలకు దారితీస్తాయి. కాబట్టి వీటి పట్ల అవగాహన పెంచుకోవడం వలన ఇలాంటి వ్యాధుల బారిన పడకుండా మనల్ని మనం కాపాడుకోవచ్చు.

హార్మోన్‌లు అనేవి శరీరంలోని ఎండోక్రైన్ గ్రంథుల నుండి ఉత్పత్తి అయ్యే రసాయన వాహకాలు. ఇవి శరీరంలో ఒక ప్రాంతపు కణజాలం, అవయవాల నుండి ఉత్పత్తి అయి – వివిధ శరీర భాగాలకు రక్తప్రసరణ ద్వారా చేరుకుని, నిర్దిష్ట అవయవాలను ప్రభావితం చేయటం ద్వారా జీవక్రియల సమతుల్యతకు తోడ్పడతాయి. ఇవి శరీరంలో సూక్ష్మమోతాదులో ఉత్పత్తి అయినప్పటికీ, శరీరంలోని సాధారణ జీవక్రియలైన జీర్ణక్రియ మొదలుకొని శారీరక–మానసిక ఎదుగుదల, ప్రత్యుత్పత్తి, మానసిక సమతుల్యత వంటి అన్ని జీవక్రియలపై వీటి ప్రభావం ఉంటుంది. ఏ కారణం చేతనైనా ఇవి అసమతుల్యతకు గురి అయితే, అవి తీవ్రమైన ఆరోగ్య సమస్యలుగా పరిణమిస్తాయి.




**వివిధ హార్మోన్‌లు - వాటి అసమతుల్యత వలన కలిగే వ్యాధులు:** థైరాయిడ్ హార్మోన్‌లు(T3, T4): ఇవి థైరాయిడ్ గ్రంథి నుండి ఉత్పత్తి అవుతాయి. ఈ హార్మోన్‌ల ప్రభావం 90% వరకు మానవుని జీవక్రియలపై ఉంటుంది. వీటి అసమతుల్యత వలన హైపోథైరాయిడ్, హైపర్‌థైరాయిడ్, గాయిటర్ వంటి దీర్ఘకాలిక జబ్బులు కలుగుతాయి. హైపోథైరాయిడిజం: థైరాయిడ్ హార్మోన్‌లు తక్కువ మోతాదులో ఉత్పత్తి కావడం వలన ఇది ఏర్పడుతుంది. **లక్షణాలు:** బరువు పెరగటం, జుట్టు రాలటం, నీరసం, మతిమరుపు, ఋతుచక్ర సమస్యలు మొదలైన లక్షణాలు కనిపిస్తాయి. హైపర్‌థైరాయిడిజం: శరీరంలో థైరాయిడ్ హార్మోన్‌లు ఎక్కువ మోతాదులో ఉత్పత్తి అవడం వలన ఈ సమస్య ఏర్పడుతుంది. లక్షణాలు: బరువు తగ్గడం, నీరసం, గుండెదడ, కాళ్ళు–చేతులు వణకడం మొదలగు లక్షణాలు కనిపిస్తాయి. **గాయిటర్:** గొంతు ముందు భాగంలో ఉండే థైరాయిడ్ గ్రంథి వాపునకు గురి కావడాన్ని గాయిటర్ అంటారు. ఇది ముఖ్యంగా అయోడిన్ అనే మూలకం యొక్క లోపం వలన కలుగుతుంది. ఇది హైపోథైరాయిడ్ లేదా హైపర్‌థైరాయిడ్ సమస్యలతో కూడుకుని ఉండవచ్చు. **హోమియోకేర్ చికిత్స:** ప్రస్తుత పరిస్థితులలో మానవుని ప్రకృతి విరుద్ధమైన జీవన విధానం, అధిక మానసిక ఒత్తిడికి గురికావటం, వ్యాయామ లోపం వలన ఎక్కువ శాతం థైరాయిడ్ వ్యాధుల బారిన పడటం జరుగుతోంది. థైరాయిడ్ సమస్యలకు జీవితకాలం మందులు వాడే అవసరం లేకుండా, ఈ సమస్య రావటానికి గల మూలకారణాన్ని గుర్తించి, వ్యక్తి శారీరక–మానసిక తత్వానికి అనుగుణంగా సరైన హోమియో వైద్యచికిత్స ద్వారా ఎలాంటి థైరాయిడ్ హార్మోన్ సమస్యనైనా సంపూర్ణంగా నయం చేయవచ్చు.

**స్త్రీలలో ఉండే హార్మోన్‌లు:** ఈస్ట్రోజెన్, ప్రొజెస్టిరాన్, ప్రొలాక్టిన్, ఆక్సిటోసిన్ హార్మోన్‌లు స్త్రీలలో రజస్వల, ఋతుచక్రం, ద్వితీయ లైంగిక లక్షణాలు, సంతానోత్పత్తి మరియు ప్రసవంలో ఉపకరిస్తాయి. ఈ హార్మోన్‌ల అసమతుల్యత వలన స్త్రీలలో ఋతుచక్ర సమస్యలు (పీ.సి.ఓ.డి.), హిర్సుటిజం (అవాంఛిత రోమాలు) మరియు సంతానలేమి సమస్యలు ఏర్పడతాయి. స్త్రీలలో మెనోపాజ్ మరియు రజస్వల అయ్యే సమయంలో హార్మోన్‌ల ప్రభావం ఎక్కువగా ఉంటుంది. మెనోపాజ్‌లో హార్మోన్‌ల హెచ్చుతగ్గుల వలన Hot Flushes, మానసిక అశాంతి, నీరసం, కీళ్ళ నొప్పులు మరియు కండరాల నొప్పులు ఉత్పన్నమవుతాయి. **పురుషులలో ఉండే హార్మోన్‌లు:** TSH, LH మరియు టెస్టోస్టిరాన్ హార్మోన్‌లు పురుషులలో శుక్రకణాల ఉత్పత్తికి తోడ్పడతాయి. ఈ టెస్టోస్టిరాన్ హార్మోన్‌ల అసమతుల్యత వలన శీఘ్రస్కలనం, అంగస్తంభన సమస్యలు, శుక్రకణాల సమస్యలు ఏర్పడటం వలన సంతానలేమి సమస్యలు కలుగుతాయి. **ప్రొలాక్టిన్ హార్మోన్:** ఈ హార్మోన్ ముఖ్యంగా స్త్రీలలో ప్రసవానంతరం పాల ఉత్పత్తికి ఉపకరిస్తుంది. సాధారణంగా ఈ హార్మోన్ గర్భధారణ సమయంలో మరియు ప్రసవానంతరం కూడా ఎక్కువగా ఉత్పత్తి అవుతుంది. ఈ పరిస్థితులు మినహా స్త్రీలలో ఈ హార్మోన్‌లు ఎక్కువ స్థాయిలో ఉత్పత్తి అయితే ఈస్ట్రోజన్ హార్మోన్ స్థాయిలు తగ్గిపోయి, అండం విడుదల లోపాలు ఏర్పడతాయి. కొంతమందిలో అండం విడుదల సక్రమంగా జరిగినా కూడా, ప్రొజెస్టిరాన్ హార్మోన్ ఉత్పత్తి జరగకపోవచ్చు. దీనివలన గర్భాశయం పిండ ప్రతిస్థాపనకు సిద్ధంగా లేకపోవడం వలన గర్భధారణ జరగక సంతానలేమి కలుగుతుంది. **పురుషులలో:** ఈ హార్మోన్‌లు ఎక్కువ స్థాయిలో ఉత్పత్తి అయితే టెస్టోస్టిరాన్ హార్మోన్‌ల స్థాయిలు తగ్గి – తద్వారా శుక్రకణాల ఉత్పత్తి తగ్గిపోవడం మరియు లైంగిక సమస్యలు కలుగుతాయి. **హోమియోకేర్ చికిత్స:** హార్మోన్ సమస్యలు ఒకదానితో మరొకటి అనుసంధానమై ఉంటాయి. వీటికి హోమియోకేర్ వైద్యంతో ఎలాంటి హార్మోన్‌లు బయట నుండి ఇవ్వకుండానే హార్మోన్ అసమతుల్యతలను సరిచేయుటం వలన ఎలాంటి దుష్ప్రభావాలు లేకుండా ఋతుచక్ర సమస్యలు, పీ.సి.ఓ.డి. సమస్యలు, సంతానలేమి మరియు శుక్రకణ సమస్యలను సంపూర్ణంగా నయం చేయవచ్చు.

డయాబెటిస్ ఇన్‌సెపిడిస్: ADH (యాంటీ డయూరెటిక్ హార్మోన్) లోపం వలన వస్తుంది. దీనిని అతి మూత్ర వ్యాధి అంటారు.
డయాబెటిస్ మెల్లిటస్: ఇది క్లోమ గ్రంథి ఉత్పత్తి చేసే ఇన్సులిన్ లోపం వలన లేదా తక్కువ మోతాదులో ఇన్సులిన్ ఉత్పత్తి కావడం వలన కలుగుతుంది. ఇది రెండు రకాలు. టైప్-I డయాబెటిస్: ఇది ఇన్సులిన్ ఉత్పత్తి కాకపోవడం వలన వస్తుంది. దీనిని జువెనైల్ డయాబెటిస్ అని అంటారు. ఈ వ్యాధి ఉన్నవారు పూర్తిగా ఇన్సులిన్ ఇంజెక్షన్లపై ఆధారపడవలసి వస్తుంది. టైప్-II డయాబెటిస్: ఇది ఇన్సులిన్ ఉత్పత్తి తగ్గటం వలన వస్తుంది మరియు ఎక్కువగా 30 సం॥లు పైబడిన వారిలో వచ్చే అవకాశం ఉంటుంది. కానీ ఈ మధ్యకాలంలో యుక్తవయస్సులో ఉన్నవారికి కూడా ఇది రావటం జరుగుతోంది. డయాబెటిస్‌తో బాధపడే వారి రక్తంలోని చక్కెర శాతాన్ని సరిగ్గా నియంత్రణ చేయకపోవడం వలన దీర్ఘకాలంలో డయాబెటిక్ నెఫ్రోపతి, డయాబెటిక్ న్యూరోపతి, రెటినోపతి, గుండె సమస్యలు, అంగస్తంభన సమస్యల వంటి కాంప్లికేషన్‌లు వస్తాయి. **హోమియోకేర్ చికిత్స:** డయాబెటిస్‌ను తొందరగా గుర్తించి, తొలిదశలోనే హోమియోకేర్ ప్రత్యేక హార్మోన్ సెల్ మరియు కాన్స్టిట్యూషనల్ విధానం ద్వారా దీర్ఘకాలికంగా డయాబెటిస్‌తో బాధపడేవారిలో – ఎలాంటి దుష్ఫలితాలు లేకుండా వ్యాధిని అదుపులో ఉంచటమే కాకుండా కాంప్లికేషన్‌లను నివారించవచ్చు.

**హార్మోన్ సమస్యలకు హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ వైద్యం:** హోమియోకేర్ సొంతమైన ప్రత్యేక 'హార్మోన్ సెల్' మరియు జెనెటిక్ కాన్స్టిట్యూషనల్ సిమిలిమం పద్ధతుల ద్వారా అన్ని హార్మోన్ సమస్యలకు ఖచ్చితమైన మరియు ఎటువంటి దుష్ఫలితాలు లేని వైద్యం అందించటం ద్వారా ఇక జీవితంలో మరోసారి తిరగబెట్టకుండా హార్మోన్ సమస్యలను సంపూర్ణంగా నయం చేసే అవకాశం ఉంటుంది.

ఇష్టం. ఇప్పుడు దానికి కనీసం నాకు ఫోన్ చెయ్యడానికి కూడా మనస్కరించడం లేదన్నమాట. నేను బ్రతికుండగా అది నాతో మాట్లాడదులే. ఇక దానికి నువ్వు ఫోన్ చేయకు. అది ఫోన్ చేసినా నాతో మాట్లాడించకు" అంది అమ్మ కోపంగా.

"పోన్లే అమ్మా... అదేమైనా ఇబ్బందుల్లో ఉందేమో! ఆడపిల్లలు వాళ్ళ మొగుళ్ళు ఎలా చెబితే అలా నడుచుకోవాలి. మగపిల్లల్లా ఆడపిల్లలకు స్వతంత్రించి ప్రవర్తించడం, నిర్ణయాలు తీసుకోవడం, అన్నివేళలా కుదరకపోవచ్చు. అన్నీ తెలిసిన నువ్వు కూడా కోపం తెచ్చుకుంటే ఎలా చెప్పు?" అని అమ్మని శాంతపర్చాలని చూశాను.

"నువ్వు దాన్ని వెనకేసుకు రాకు. అది అసలు నా కూతురే కాదనుకుంటాను. నా చిన్న కూతురు ఎప్పుడో చచ్చిందనుకుంటాను" అంది అమ్మ ఆవేశంతో.

అమ్మకు కోపం వస్తే అంతే... శాంతపరచడం కష్టం. ఈ విషయం అక్కడితో వదిలేయకపోతే అమ్మకు బి.పి. పెరిగిపోవచ్చు. అది ఏ స్ట్రోక్కైనా దారితీయవచ్చు. ఇప్పటికే రెండుసార్లు స్ట్రోక్ వచ్చింది. గండం తప్పించుకుని బైటపడింది.

"సర్లే, నువ్వు కళ్ళు మూసుకుని పడుకో" అని అమ్మ గదిలోంచి బయటకు వచ్చేశాను తప్పితే చేయగలిగిందింకేం లేదు. మాలో ఎవరికీ ఎవరి మీదా కోపం, విసుగు, జాలి, ప్రేమ...ఏది కలిగినా అది వ్యక్తం చేయడానికి ఇద్దరం ఎంచుకున్న మార్గం మౌనం. మౌనంలోనే అన్ని భావాలూ, భాషలూ, బాసలూ తెలుస్తాయి. లిపిలేని కళ్ళభాషతోనే మేమిద్దరం కబుర్లు చెప్పుకుంటాం.

***

చెన్నైలో ఉన్న జానకి పెద్దన్నయ్యకు చాలా సీరియస్‌గా ఉందట. ఒక్కసారి వచ్చిపొమ్మని ఫోన్ వచ్చింది. జానకి నా వంక దీనంగా చూసింది. తప్పదు. ఏదో ఒకటి చెయ్యాలి. తోబుట్టువు అనారోగ్యంతో బాధపడుతుంటే వెళ్ళక తప్పదు. బెంగళూరులో ఉన్న మా అమ్మాయికి ఫోన్‌చేశాను, నాలుగు రోజులు ఉండేలా బయలుదేరిరమ్మని. సాయంత్రానికల్లా ఫ్లైట్‌లో అమ్మాయి వచ్చేసింది. రాత్రి బయల్దేరి వెళ్ళిన జానకి మర్నాడు ఉదయమే చెన్నై చేరుకుంది. ఆ మధ్యాహ్నమే ఆయన చనిపోయాడు. చిన్నదినం అయ్యేంతవరకూ ఉండి రమ్మని జానకికి చెప్పాను. అమ్మను చూసుకోవడం ఇబ్బందవుతుందేమో అని వచ్చేస్తానంది జానకి. "ఫర్వాలేదు, మేం చూసుకుంటాం. శుభకార్యాలకు ఎలాగూ వెళ్ళలేకపోతున్నాం. ఇలాంటప్పుడైనా ఉండకపోతే ఎలా? బాగుండదు" అన్నాను జానకితో. ఈ వంకనైనా జానకికి నాలుగు రోజులు విశ్రాంతి దొరుకుతుందని నా ఆశ.

మా అమ్మాయి బెంగళూరు నుంచి నేను రమ్మనగానే వచ్చేయడం, నానమ్మకు సేవలు చేయడం, నా భార్యలాగానే నా పిల్లలు కూడా రత్నాల్లాంటి వాళ్ళవటం నా అదృష్టం. నా కొడుకూ అంతే. పోయిన ఏడాది అమెరికా వెళ్ళేంతవరకూ నానమ్మకు ఎంతగా సేవలు చేసేవాడని? వాడున్నప్పుడు మా ఇద్దరికీ శ్రమ తగ్గేది. నా కంటే వాడే, ఇంట్లో ఉన్నంత సేపూ నానమ్మని కనిపెట్టుకుని ఉండేవాడు. మనవణ్ణి చూసి అమ్మ ఎంతగా మురిసి పోయేదో? నా కొడుకని చెప్పడం కాదుగానీ, వాడొక జాతి రత్నం. అమెరికాలో ఉంటూ కూడా, స్కైప్‌లో నానమ్మతో తరచూ మాట్లాడుతూ ఉంటాడు. "నువ్వొస్తానంటే చెప్పు, నిన్ను అమెరికా తీసుకుపోతా" అని వాడు అన్నప్పుడు అమ్మ కళ్ళల్లో మెరుపు చూసి మా కళ్ళల్లో ఆనందబాష్పాలు సుళ్ళు తిరిగేవి. వేలమైళ్ళ దూరంలో ఉన్న మనవణ్ణి స్కైప్‌లో చూసినప్పుడల్లా అమ్మ ఎంతగా సంతోషపడిపోయేదో! ఈ ఆనందమే అమ్మను ఇంకా బతికిస్తోందేమో!

వృద్ధాప్యంలో ఉన్న అమ్మకు ఇది రెండో బాల్యం. పిల్లలు, మనుమల తరం దాటి ముని మనుమలను ముద్దాడి, వారితో ఆటలాడుకునే దశకు చేరుకున్న అమ్మకు మంచి ఆరోగ్యం కూడా ఉండివుంటే ఇంకెంత బాగుండేదో! అందుకనే ఆరోగ్యవంతమైన రెండోబాల్యం నిజంగా ఒక వరం. అనారోగ్యం బారినపడి మంచం పట్టే దుస్థితికి చేరితే మాత్రం అది ఒక శాపం. వారికి సేవలు చేసేవాళ్ళకు, చేయించుకునేవాళ్ళకూ కూడా అది ఒక అవాంఛనీయ స్థితి.

***

ఆ రాత్రి "నాకేంటో లాగుంది. గుండెల్లో దడగా ఉంది" అంది అమ్మ. నాకు కాళ్ళూ చేతులూ ఆడలేదు. వెంటనే డాక్టరుకు ఫోన్ చేశాను. డాక్టరు వచ్చేలోగా అమ్మకు ఒళ్ళంతా చెమటలు పట్టాయి. నేను, జానకి ఏం జరుగుతోందో అర్థం కాక అమ్మ మంచం పక్కనే నుంచుని చూస్తున్నాం. అమ్మ శ్వాస భారంగా తీసుకుంటోంది. నాకయితే ఏడుపు వచ్చేస్తోంది. డాక్టరు వచ్చి పల్స్ చూశాడు. బి.పి. చెక్ చేశాడు. అర్జంటుగా హాస్పిటల్‌కి తీసుకు వెళ్ళమన్నాడు.

తెల్లవారేసరికి అంతా అయిపోయింది.

అందరికీ ఫోన్లు చేశాం. తను వెంటనే బయలుదేరి వస్తున్నాననీ, అంతవరకు నానమ్మ భౌతిక కాయం అలాగే ఉంచమనీ అమెరికా నుండి మా అబ్బాయి ఫోన్ చేశాడు. వాడు వచ్చేసరికి అంత్యక్రియలు పూర్తి చేసేశాం. నా కంటే జానకే ఎక్కువగా డీలా పడిపోయింది.

"మన ఋణం తీరిపోయింది. బాధపడకు" అంటూ జానకిని ఓదార్చాను.

మా అబ్బాయిని ఓదార్చడం కష్టమైపోయింది. కర్మకాండలన్నీ పూర్తయ్యాయి. అయిన వాళ్ళందరూ వచ్చారు. మా పెద్దబావ, చెల్లి శిరీష తప్ప. ఎందుకంటే మా శిరీష పోయి మూడేళ్ళయింది! పెద్దబావ పోయి సంవత్సరం దాటింది! అమ్మకు చెప్పకూడదనుకున్నాం. అసలే రెండుసార్లు హార్టెటాక్ వచ్చింది. ఇలాంటి వార్తలు చెబితే ఆమె తట్టుకోలేకపోవచ్చు. ఆ చేదు నిజాలు చివరకు తెలుసుకోకుండానే, అమ్మ 'రెండోబాల్యం' ముగిసింది.

సెల్: 89785 39038



## అన్నీ చేస్తోందట కానీ....

*సినీ హీరోయిన్ అంటేనే అందానికి మారుపేరుగా ఉండాలి. తినే తిండి నుంచి పీల్చే గాలి వరకూ అన్నీ అందంతోనే ముడిపడి ఉంటాయి కనుక హీరోయిన్లు ప్రతి విషయంలోనూ అలర్ట్‌గా ఉంటారు. తను కూడా మిగతావారికి ఎందులోనూ తీసిపోను అంటోంది కేథరిన్ థ్రెసా. అందం విషయంలో ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా తెలుగు ప్రేక్షకుల మనసు దోచుకోలేకపోతోంది. ఇక్కడ హీరోయిన్‌గా మంచి సక్సెస్‌లు వచ్చినా, గుర్తింపు రాలేదని బాధపడుతోంది. అందంగా కనిపించడానికీ, ఉండడానికీ ఎన్నో జాగ్రత్తలు తీసుకున్నా, అదృష్టం ఎందుకు లేదో అని వాపోతోంది.*

# సురభి

## నరక లోయ



అందమైన పూలమొక్కలతో, చిన్నపిల్లలు ఆడుకోవడానికి అనువుగా, పెద్దలు వాక్ చేయడానికి వీలుగా ఉంటాయి పార్కులు. కానీ జపాన్‌లో ఓ పార్కుకు వెళితే, అక్కడన్నీ భయంకరమైన ఆకారాలే కనిపిస్తాయి.

జపాన్‌లోని నొబొరిబెత్సు పట్టణంలో 'జిగోకుడని' అనే ఒక పార్కు ఉంది. అంటే అర్థం నరక లోయ అని. 24 ఎకరాల విస్తీర్ణంలో, కొండ ప్రాంతంలో ఉండే ఈ పార్కున్న ప్రాంతంలో 20 వేల సంవత్సరాల క్రితం అగ్నిపర్వతం విస్ఫోటనం జరిగిందట. అప్పట్నుంచీ భూగర్భ ఉష్ణోగ్రతలు పెరగడంతో నేలపైన పొగలు రావడం మొదలైంది. ఈ ఉష్ణోగ్రత కారణంగానే ఈ పార్కు సరస్సుల్లో ఉండే నీరు కూడా వేడిగా ఉంటుంది. ఈ సరస్సు నీటిలో స్నానం చేస్తే జబ్బులు నయమవుతాయని అక్కడివారి నమ్మకం. అక్కడున్న రిసార్టులు, స్పాల్లో ఈ నీటితో ప్రత్యేక స్నానాలు చేసే ఏర్పాటు చేశారు. చాలామంది పర్యాటకులు ఇక్కడ జలకాలాడటానికే వస్తుంటారు. అంతేకాదు ఇక్కడ నరకానికి అధిపతిగా భావించే ఎన్మా అనే రాక్షసదేవుడి బొమ్మలతో పాటు యుకిజిన్ అనే రాక్షసుల బొమ్మలు చాలా ఉన్నాయి. వీరు పర్యాటకులకు నరకలోయకు స్వాగతం పలుకుతుంటారని, ప్రజలకు రక్షణగా ఉంటారని అక్కడివారి విశ్వాసం. ప్రతి ఆగస్టులో పెద్ద ఎత్తున ఈ నరకలోయ పండుగ నిర్వహిస్తారిక్కడ.

## నేపర్‌సైజ్

ఎక్సర్‌సైజ్ తెలుసు... ఈ నేపర్‌సైజ్ ఏంటీ అనుకుంటున్నారా? ఇది కూడా ఒకరకమైన ఎక్సర్‌సైజే అంటున్నారు లండన్‌వాసులు.

లండన్‌లో డేవిడ్ లాయిడ్ జిమ్ బ్రాంచ్‌లలో ఈ నేపర్‌సైజ్ చేయవచ్చు. వీటిల్లోకి అడుగుపెడితే మామూలుగా ట్రెడ్‌మిల్, డంబెల్స్ వంటి పరికరాలేవీ కనిపించవు అక్కడ. వాటికి బదులు ఎటుచూసినా చక్కగా మంచాలు కనిపిస్తాయి. ఎందుకంటే నేపర్‌సైజ్ అంటే కునుకు తీయడమే మరి. మా జిమ్‌కొచ్చి ఓ 45 నిమిషాలు కునుకు తీయండి, కేలరీలు తగ్గించుకోండి అంటున్నారు జిమ్ నిర్వాహకులు. నిద్రపోవడమే నేపర్‌సైజ్. చక్కగా పడుకుని మ్యూజిక్ వింటూ రిలాక్స్ అయితే, కేలరీలు తగ్గించుకోవడంతోపాటు, ఒత్తిడి కూడా మటుమాయం అవుతుందంటున్నారు. ఇదేదో బాగుంది కదూ!





## వేర్ల మ్యూజియం

పాడైపోయిన వస్తువులు, కాగితాలతో కళాకృతులు, అలంకరణ వస్తువులు చేయటం మనకు తెలిసిందే. కానీ చెట్ల వేర్లతో వస్తువులు, జంతువుల ఆకారాలు చేయడం ఎక్కడైనా చూశారా! లేదంటే ఫ్రాన్స్‌లోని 'మిలియన్ అండ్ వన్ రూట్స్' మ్యూజియానికి వెళ్తే సరి!

ఫ్రాన్స్, కార్నిమౌంట్‌లోని మిలియన్ అండ్ వన్‌రూట్స్ మ్యూజియానికి వెళితే ఎటు చూసినా విచిత్రమైన ఆకారాల్లో ఉన్న చెట్లవేర్లు దర్శనం ఇస్తాయి. గోడలు, ఫ్లోర్, పైకప్పు ఇలా ఎక్కడ చూసినా వేర్లతో చేసిన రకరకాల ఆకారాలు, బల్లలు, అలంకరణ వస్తువులు కనిపిస్తాయి. దీనికంతటికీ కారణం మిచెల్ మారిస్. అతడోసారి ఆక్టోపస్‌లా కనిపించిన ఓ వేరును చూసి కొన్ని మార్పులుచేసి పూర్తి రూపం తెచ్చాడట. అప్పట్నించి అడవుల్లో పడిపోయున్న వేర్లను సేకరించడం మొదలుపెట్టాడు. వాటినితెచ్చి చిన్ని చిన్ని మార్పులు చేస్తూ ఎన్నో కళాఖండాలు సృష్టించాడు. ఇప్పటివరకు మొత్తం 800 వేర్ల రూపాల్ని తీర్చిదిద్దాడు. వీటిని చూడ్డానికి ఎక్కడెక్కడినుంచో పర్యాటకులు వస్తుంటారు.

## సముద్రాన్ని మింగే బావి

అనగనగా ఓ బావి. ఓ సముద్రం ఒడ్డున ఉందది. అక్కడికి వెళ్ళాలంటేనే భయపడతారు జనం. మరి దాని కథేంటో తెలుసుకుందామా!

అమెరికా పసిఫిక్ సముద్రతీర ప్రాంతంలో ఉంటుంది యచట్స్ నగరం. ఈ సముద్రం ఒడ్డున సహజసిద్ధంగా ఏర్పడిన బావి ఉంది. దీనికి థోర్ బావి, సముద్రాన్ని పీల్చేసే గొట్టం, మనుషులను ముంచేసే గొయ్యి, నరకానికి ద్వారం... ఇలా రకరకాల పేర్లున్నాయి.

సముద్రంలో పోటు వచ్చి బావి సమీపానికి అలలు వచ్చినప్పుడు అడుగు భాగం నుంచి ఆ నీటిని పీల్చుకుంటుంది. బావి నిండాక ఒక్క ఉదుటున ఆ నీటిని ఫౌంటెన్‌లా బయటకు చిమ్మేస్తుంది. అలలు తన దరికి వచ్చినప్పుడు మళ్ళీ ఆ నీటిని పై భాగం నుంచి పీల్చేస్తుంది. అందుకే దీన్ని 'సముద్రాన్ని మింగేసే బావి' అంటున్నారు. ఇంకో ఆశ్చర్యకరమైన విషయం ఏంటంటే ఈ బావికి అసలు అడుగుభాగమనేదే లేదట! ఫొటోలు తీయడానికి మాత్రం చాలామంది ఉత్సాహ పడుతుంటారు.

–నర్మద వాసిరెడ్డి



# వెట్టి

## (ది వారియర్)

**-మధుబాబు**




**'ఎవరు పిలిపించారో, ఎందుకు పిలిపించారోగాని, రాకూడని చోటులోకి వచ్చారు వాళ్ళు. మంచిగా చెపితే వినిపించుకునేటట్టు కనిపించటం లేదు. మేము ఇంకా కాస్త గట్టిగా చెప్పాల్సి వస్తే ఎలా ఉంటుందో మీకు తెలుసు. తీసుకుపోయి కాస్తంత వివరంగా చెప్పి అవతలకి పంపించు' అన్నాడు ఆయన.**

**హోటల్ లాబీలో ఆయన్ను, ఆయన తమ్ముడిని చూడగానే తడబడటం మొదలుపెట్టిన బాజిరెడ్డికి మరింత టెన్షను స్టార్ట్ అయింది.**

'రండి.. అందరూ రోడ్డు మీదికి రండి.. వచ్చేయండి' అంటూ గిరుక్కున వెనక్కి తిరిగి తన వెహికల్ దగ్గరికి వెళ్ళిపోయాడు.

గుర్రుగా చూస్తూ అనుసరించారు గ్రానైట్‌మైన్స్ జనం. కిందపడి కాస్తంత తేరుకుంటున్న తమ లీడర్ భుజాలు పట్టుకుని బయటికి నడిపించారు వారిలో కొందరు.

'ఇంతమందిమి ఉన్నాం. ఎగిరెగిరి తన్నటానికి కూడా సరిపోరు లోపల ఉన్న జనం. భయం దేనికి సారూ?' అడిగాడు బాజిరెడ్డి అనుచరుడు ఒకతను.

### జరిగిన కథ

వెట్టి అసలు పేరు విఠల్‌రెడ్డి. చౌడేశ్వరి గుడి దగ్గర తనను అంతమొందించాలనుకున్న బాజిరెడ్డి మనుషుల నుంచి తప్పించుకుని రాయుడిపల్లి వెళతాడు. అక్కడ చౌడేశ్వరికి జరిగిన అపచారమేమిటో తెలుసుకుంటాడు. తిరిగి కదిరికి బయలుదేరిన వెట్టికి చౌడేశ్వరి ఆత్మశిల కనిపిస్తుంది. కడపనుంచి హైమారెడ్డి ఫోన్ చేసి, తనదగ్గర తీసుకున్న సొమ్ము చెల్లించకుంటే ఎస్టేట్ మొత్తాన్ని స్వాధీనపరుచుకుంటానని హెచ్చరిస్తాడు. సమస్యలన్నీ తాను సాల్వ్ చేస్తానని మాటిస్తాడు వెట్టి. పఠాన్ వల్ల వెట్టి ఎవరో తెలిసిపోతుంది బాజిరెడ్డికి. దాంతో అక్కడినుంచి బయటపడిన వెట్టికి హైమారెడ్డి కనిపిస్తాడు. హైమారెడ్డి కొడుకు రాకేష్ ప్రణవిని ప్రేమిస్తున్నట్టు, పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నట్టు చెబుతాడు. ఎస్టేటుకు వచ్చి, రాకేష్ ఫోటో అందరికీ చూపిస్తాడు. అన్న ఒప్పుకుంటే తనకేమీ అభ్యంతరం లేదంటుంది ప్రణవి. వెట్టి దొరకకపోవడంతో, వెంటనే పఠాన్, ప్రణవిల పెళ్ళి జరగడమే మంచిదని భావించి పెళ్ళి ఏర్పాట్లు చేస్తాడు బాజిరెడ్డి. వెట్టి ఎక్కడున్నాడో తెలియడంతో గ్రానైట్‌మైన్స్ జనంతోపాటు, తన జనాన్ని కూడా వెంటబెట్టుకుని వెళతాడు బాజిరెడ్డి. అక్కడ హైమారెడ్డి కనిపించడంతో కంగుతింటాడు.

ఆ తర్వాత...

పిడికిలి బిగించి అతని మొఖం మీద కొట్టబోయి, ఆఖరి క్షణంలో ఆగిపోయాడు బాజిరెడ్డి. 'ఎంతమంది ఉన్నారనేది కాదు ప్రశ్న. ఎవరువాళ్ళు అన్నది సమస్య. అతను కడప హైమారెడ్డి. నీ మొద్దు బుర్రకు బాగా ఎక్కించుకో. ఇప్పుడు గనుక ఏదైనా తేడా మొదలైతే పఠాన్‌బాబు పెళ్ళికి అడ్డంకి వచ్చేస్తుంది' అన్నాడు.

'ఏం చేయగలడు సారూ. ఇది మన ఊరు. పిలిచినా పిలవకపోయినా వచ్చి నాలుగు అక్షింతలు వేయటం తప్ప ఇంకేమి చేయగలడు?' ఆ మాటలు అర్థం కాక మళ్ళీ మాట్లాడాడు ఆ అనుచరుడు.

గ్రానైట్‌మైన్స్ జనం మొఖాల్లో కూడా అటువంటి ప్రశ్నలే మెదులుతూ ఉండటం కనిపించేసరికి మరింత గింజాట పడిపోయాడు బాజిరెడ్డి.

'మీకు అన్ని విషయాలు వివరంగా చెప్పేందుకు ఇది సమయం కాదు. ఒక పనిచేద్దాం. అందరూ వెనక్కి నడవండి. పెళ్ళిళ్ళ రిజిస్ట్రారు పది గంటలకల్లా బయలుదేరతానన్నాడు. ముందు పెళ్ళి పూర్తిచేయాలి. తర్వాత మిగిలిన విషయాలు' అప్పటికప్పుడు తన నిర్ణయం మార్చుకుని కొత్త మాట చెప్పాడు.

'మీరు వెళ్ళండి సారూ. మేము తర్వాత వస్తాము' ఉన్నట్లుండి తన అభిప్రాయాన్ని చెప్పాడు గ్రానైట్ మైన్స్ లీడర్.

అతని ఉద్దేశం ఏమిటో అర్థమైపోయింది బాజిరెడ్డికి. 'మీరెవరూ తొందరపడవద్దు. లేనిపోని రగడ చేసుకోవద్దు. మా అబ్బాడి పెళ్ళి అయిపోయిన మరుక్షణం మీకు మా వాళ్ళని కూడా తోడు ఇచ్చి పంపిస్తా' అన్నాడు.

అదే పనిగా అతను తమను వెనక్కి పిలవటానికి ఏదో బలమైన కారణం ఉండే ఉంటుందని గ్రహించి, అయిష్టంగానే తల ఊపాడు గ్రానైట్‌మైన్స్ వాళ్ళ లీడరు.

'మీ ఇష్టం. అలాగే చేద్దాం' అంటూ తన



వారందరికీ చేయి ఊపాడు.

హోటల్ లాబీలోనే నిలబడి చూసీచూడనట్టు ఆ తతంగాన్నంతా చూస్తూనే ఉన్నాడు హైమారెడ్డి.

'అన్నా.. పెళ్ళి పదింటికట..' అన్నాడు అతని తమ్ముడు.

'రెడీగా ఉండండి. వాడు మనల్ని పిలవడు. అయినాసరే... పోయి గేటుకు అడ్డంగా కూర్చుందాం' అన్నాడు హైమారెడ్డి.

'ఇక్కడ బెదిరించినట్టు బెదిరించటం కుదరదేమో. వాళ్ళు చాలామంది ఉన్నారు. తెగించి ఎదురు తిరిగితే తట్టుకోగలమా?' అడిగాడు తమ్ముడు.

'మనకి ఇవ్వవలసిన డబ్బు ఇచ్చేసిన తర్వాత ఒకటి కాదు, వంద పెళ్ళిళ్ళు చేసుకోమని చెపుదాం. అప్పుడు కూడా అడ్డం తిరిగితే పరిస్థితిని బట్టి ఏదో ఒకటిచేసి చూపిద్దాం' అన్నాడు హైమారెడ్డి.

ఒకదాని తర్వాత ఒకటిగా వెనుతిరిగిపోతున్న బాజిరెడ్డి వెహికల్స్‌ని, గ్రానైట్‌మైన్స్ వాళ్ళ వాహనాల్ని గమనించుకుంటూ తల ఊపాడు తమ్ముడు.

***

సూర్యోదయం అవుతూ ఉన్న సమయంలో శివారెడ్డి బిల్డింగ్ ముందుకు వచ్చారు సిటీలో పేరెన్నికగన్న బాండ్‌మేళం గ్రూప్ సభ్యులు. వారి వెనుకే ప్రత్యక్షం అయ్యారు సన్నాయి మేళగాళ్ళు.

వెట్టి బిల్డింగ్‌లో నుంచి బయటికిపోయిన వెంటనే గుండెలు దిటవు చేసుకుని నిద్రలకు ఉపక్రమించారు డైనింగ్ హాల్లో ఉన్నవారందరూ.

శంకరయ్య, రమణయ్యపంతులుగారు ఇద్దరూ అవుట్‌హౌస్‌లో పడుకున్నారు. వరసపెట్టి అందరినీ బలవంతంగా నిద్రలు లేపేసింది సంపంగి.

'బాజిరెడ్డి సారు ఫోను చేసి చెప్పారు, అందరినీ సిద్ధంగా ఉండమని. పెళ్ళిళ్ళ రిజిస్ట్రారు పది గంటల కల్లా వచ్చేస్తారట'.

పెదవులు బిగించి కోపంగా చూసింది శివారెడ్డి భార్య. 'సారు నిద్రలేచి గంటకు పైన అయింది. మిమ్మల్ని లేపి తీసుకురమ్మన్నారు' నదురుబెదురు లేకుండా చెప్పింది సంపంగి.

పెద్దపెద్ద అడుగులు వేస్తూ శివారెడ్డి గదిలోకి పోయింది ఆమె.

'లేచావా... అందరినీ రెడీ అవమని చెప్పు' తన పడకమీద దిండును ఆనుకుని కూర్చున్న శివారెడ్డి ఆమెను చూడగానే చెప్పాడు.

'ఉన్నట్టుండి ఏమిటీ తతంగం? ఎందుకు ఇంత తొందర?' సూటిగా అడిగింది ఆమె.

'మనం ఈ విషయాలు చాలాసార్లు మాట్లాడుకున్నాం. ఇంకోసారి మాట్లాడే ఓపిక నాకు లేదు. నేను ప్రశాంతంగా ఉండాలంటే పోయి అమ్మకి చెప్పి, చెల్లాయిని సిద్ధం చేయి' తల పక్కకు తిప్పుకుంటూ చిన్న కంఠంతో చెప్పాడు శివారెడ్డి.

గంభీరంగా ఉండే ఆ మొఖం కళ తప్పి ఉండటం, కనులు స్వల్పంగా తడి అవుతూ ఉండటాన్ని గమనించి, రెండో మాట మాట్లాడకుండా వెనక్కి వచ్చేసింది ఆమె. పిచ్చమ్మి గదిలోకి పోయింది.

లేటుగా పడుకుంది పిచ్చమ్మి. ఆమె వేసుకున్న మాత్ర కూడా చాలా ఆలస్యంగా పనిచేయటం మొదలు పెట్టింది. ఆమెను బలవంతంగా నిద్ర లేపి, మొఖం మీద చల్లటి నీళ్ళు జల్లితే తప్ప పూర్తి మెలకువ రాదేమో అనుకున్న శివారెడ్డి భార్య ఆశ్చర్యానికి అంతులేకుండా పోయింది.

అంతకుముందు చాలాసేపటి క్రితమే లేచి ఫ్రెషప్ అయినట్టు చాలా ఎలర్ట్‌గా కనిపిస్తోంది పిచ్చమ్మి.

'సంపంగి అరుపులు విన్నాను. అబ్బాయి చెప్పింది కూడా వినబడింది. మరేం పరవాలేదు. నువ్వు రెడీ అవ్వు' గదిలోకి రాగానే ఆమెకు చెప్పింది.

ఆపైన తమాయించుకోలేకపోయింది శివారెడ్డి భార్య. 'నా మాటకు విలువలేకుండా పోయింది అత్తమ్మ. నా కంఠంలో ప్రాణం ఉండగా ఈ పెళ్ళి జరగనీయనని బిడ్డకు వాగ్దానం చేశాను. ఎందుకూ పనికిరాని దానిని అయిపోయాను' పమిటె చెంగు నోటికి అడ్డంగా పెట్టుకుంటూ బావురుమన్నది.

'పెళ్ళి జరిగి పోయిందా?'అడిగింది పిచ్చమ్మి.

ఝల్లుమన్నది శివారెడ్డి భార్య శరీరం. చటుక్కున రోదించటాన్ని ఆపి నిశితంగా చూసింది పిచ్చమ్మి మొఖంలోకి.

'ఓసి పిచ్చిమొఖమా... నేను బాగానే ఉన్నానే. నేను అడిగిందేమిటంటే – నీ ఆడబడుచుకు ఆ పఠాన్ గాడితో వివాహం జరిగిపోయిందా?' నవ్వుతూ అడిగింది పిచ్చమ్మి.

తల అడ్డం తిప్పింది శివారెడ్డి భార్య.

'జరగలేదు కదా. కంగారు పడకు.. జరగదు' చెప్పింది పిచ్చమ్మి.

'అంతగట్టిగా ఎలా చెపుతున్నావు అత్తమ్మా?' అడిగింది శివారెడ్డి భార్య.

'ఈ గొడవలన్నిటికీ మూలకారణం ఏమిటో నా మనిషికి తెలిసిపోయింది. ఆ మూలాన్ని సరిచేస్తే అన్నీ సానుకూలపడతాయి. నా మాట నమ్ము. వెళ్ళి ప్రణవిని సిద్ధం చెయ్యి. ఎలా చేస్తావో తెలుసా?' అడిగింది పిచ్చమ్మి.

ఎలా చేయాలన్నట్టు తల ఎగురవేసింది శివారెడ్డి భార్య.

'చూసేవాళ్ళ కళ్ళు చెదిరిపోవాలి. నీ ఆడబడుచుకు దిష్టి తగులుతుందేమోనని పెళ్ళికి వచ్చిన వాళ్ళందరూ భయ



పడాలి' అన్నది పిచ్చుమ్మి.

గుమ్మం దగ్గరికిపోయి ఇంకోసారి భుజం మీది నించి ఆమె మొఖంలోకి చూసింది శివారెడ్డి భార్య.

డాక్టరు గారు ఇచ్చిన మాత్ర పనిచేయటం మాను కున్నదేమోనన్న అనుమానం ఆమె మనసులోకి ప్రవే శించిన మాట మాత్రం యదార్థం.

***

'అన్నయ్యా... అడవి రోడ్లు ఇవి. తెల్లవారుజామున ఏ ఏగోలమో, ముళ్ళపందో ఏదో ఒకటి వచ్చి బండికి అడ్డం పడితే గల్లంతయి పోతాం ఇద్దరం... స్పీడు తగ్గించు' చిన్నకంఠంతో వెట్టిని బతిమాలుకున్నాడు రాకేష్.

నవ్వాడు వెట్టి. ఏక్సిలేటర్‌ని మరింత బలంగా అదిమాడు. గాలిలో ఎగురుతున్నట్టు ప్రయాణం మొదలు పెట్టిందా వెహికల్. తొలి వెలుగులు ప్రత్యక్షం కావ టానికి ఇంకా బోలెడు సమయం ఉండగానే చింతల పల్లి చేరుకుంది.

మెయిన్‌రోడ్డు మీద ఉన్న ఒక చిల్లరకొట్టు యజ మానిని బతిమాలుకుని, తనకు, తన గార్డులకు టీలు పెట్టించుకునే పని మీద ఉన్నాడు సబ్బిరెడ్డి.

'ఫారెస్టు మధ్యలో ఉన్నారు మీరు. ఎప్పుడో ఒక ప్పుడు ఏదో ఒక సమయంలో అడవిలోకి పోయి ఏదో ఒక పాడుపని చేయకుండా ఉండలేరు. అప్పుడు తెలుస్తుంది మాకున్న పవర్ ఏమిటో' తన దుకాణం ముందున్న అరుగుమీద పడుకుని, కళ్ళు తెరిచి చూడ టానికి సతాయిస్తున్న అతన్ని బెదిరిస్తున్నాడు.

విమానం మాదిరి దూసుకు వస్తున్న వెహికల్‌ని అల్లంత దూరంలో ఉండగానే గమనించాడు. 'చూడండి వాడు ఎవడో... మనిషో రాక్షసుడో తెలుసుకోండి' అని తన గార్డుల్ని హెచ్చరించాడు.

రోడ్డుకి అడ్డంగా నిలబడటానికి సిద్ధం అయ్యారు గార్డులు. అంతలోనే వచ్చేసిందా వాహనం. కీచు ధ్వనులు చేస్తూ సరిగ్గా సబ్బిరెడ్డికి రెండు మూరల దూరంలో ఆగింది.

'ఏంటి? ఏంటి ఈ బండి నడపటం? ఎవరిమీద ఎక్కించటానికి?' ఆశ్చర్యం, కోపం రెండు కలగలిపిన కంఠంతో వెట్టిని అడిగాడు సబ్బిరెడ్డి.

ఇంజన్ ఆఫ్ చేసి కిందికి దూకాడు వెట్టి. అతని చేయి పట్టుకుని మిగిలిన వారికి దూరంగా తీసుకు పోయి నాలుగే నాలుగు నిమిషాలు మాట్లాడాడు.

'అంత గొడవ జరుగుతోందా? ఏమని అనుకుం టున్నాడు వాడు? శివారెడ్డికి వెనకాముందూ ఎవరూ లేరని అనుకుంటున్నాడా? మా అత్తమ్మకి అండగా మేము ఉంటామని మరిచిపోయాడా?' పళ్ళు బిగ పడుతూ కోరగా అన్నాడు సబ్బిరెడ్డి.

'ప్రతిజ్ఞలు, ప్రతివాదనలు వద్దు. ముందు జరగా ల్సింది ఏమిటో చూడాలి' అన్నాడు వెట్టి, సిగరెట్ వెలి గించుకుంటూ.

'చూడటం గీడటం ఏమీలేదు. ఇప్పుడేపోయి ఆ పఠాన్‌గాడిని తీసుకువచ్చి మళ్ళీ కాళ్ళు చేతులు కట్టి పడేస్తాను' అన్నాడు సబ్బిరెడ్డి.

'ఒకసారి బయటికి వదిలిన తర్వాత వెంటనే లోపలికి నెట్టటం మీరు చెపుతున్నంత తేలిక కాదు. ఈ లోపల జరగాల్సిన డామేజి జరిగిపోతుంది' సిగరెట్ పొగ గుండెల నిండా పీల్చుకుంటూ అన్నాడు వెట్టి.

'ఏం చేయమంటావో చెప్పు. క్విజ్ ప్రోగ్రాములు పెట్టబోకు' విసుగు నిండిన కంఠంతో అన్నాడు సబ్బిరెడ్డి.

అంటూ ఉన్న సమయంలోనే అతని చూపు వెహి కల్‌లోనే ఉన్న రాకేష్‌మీద పడింది. 'ఎవరీ అబ్బయ్య?' అడిగాడు ఆశ్చర్యంగా.

'కడప హైమారెడ్డి కొడుకు. హైమారెడ్డి మీకు తెలిసే ఉంటాడు' నవ్వుతూ చెప్పాడు వెట్టి.

విపరీతమైన ఆశ్చర్యంతో నోరు వెళ్ళబెట్టాడు సబ్బిరెడ్డి. 'ఇతను... ఇతనితో నీకు ఏ విధంగా పరిచయం? ఇప్పుడు ఇతను నీతో ఎందుకు వచ్చినట్టు?' అడిగాడు.

'వివరంగా చెప్పటానికి తగిన టైములేదు. ముందు మీరు అర్జంటుగా సిటీకి వెళ్ళండి. మిమ్మల్ని చూసి మీ అత్తమ్మ సంతోషిస్తుంది. ప్రణవమ్మ ధైర్యం చిక్కబట్టుకుంటుంది' అన్నాడు వెట్టి.

రెండే రెండు క్షణాలు ఆలోచించాడు సబ్బిరెడ్డి. 'టీ రెడీ అయిందా?' అని తన గార్డుల్ని అడిగాడు.

అప్పుడే నిద్ర నుంచి మెలకువ వచ్చినట్టు ఆవు లిస్తూ లేచి కూర్చుంటున్నాడు దుకాణం యజమాని.

'ఈయన చాలా ఫాస్టు సారు. ఇంకో గంట... రెండు గంటలు పడుతుంది రెడీ అవటానికి' చిరా కుగా చెప్పాడు ఒక గార్డు.

'రెండు రోజుల నించీ అదే పనిగా మనల్ని చూస్తూ ఉండడం వల్ల చులకనైపోయి ఉంటాము. ఇతని సంగతి తర్వాత చూద్దాం. గదిలో పడేసిన జనానికి కాపలాగా ఇద్దరు ఉండండి. మిగిలిన వాళ్ళందరూ సిటీకి పదండి. పెద్ద పని ఉంది అక్కడ' అంటూ తమ వెహికల్స్ తీసుకురమ్మని చేయి ఊపాడు సబ్బిరెడ్డి.

చివరికంటూ కాలిన సిగరెట్‌ని అవతలికి విసిరి, స్టీరింగ్ ముందుకు చేరుకున్నాడు వెట్టి.




**రాయుడిపల్లి రవీంద్ర భార్యకు పశువుల పాకలో నాగమ్మ తల్లి కనిపించటంతో ఆమె తన తమ్ముణ్ణి నిద్రలేపింది. ఆ తల్లి ఏదో చెప్పాలనుకుంటున్నది. అందుకే పదేపదే కనిపిస్తోంది. వివరమేమిటో కనుక్కొని రమ్మని బండోడి నాయన దగ్గరికి పంపిం చింది. వెంటనే బయలుదేరిన అతనికి కూడా ఆ తల్లి కనిపించటంతో కంగారు పడ్డాడతను. అసలు ఆ తల్లి వాళ్లకెందుకు కనిపించింది? ఏం చెప్పదలుచుకున్నది?**

'నువ్వు ఎక్కడికి? మాతో రావడం లేదా?' ఆశ్చర్యంగా అడిగాడు సబ్బిరెడ్డి.

'వస్తాను... ఇప్పుడు కాదు. ముందుగా మీరు వెళ్ళండి' అంటూ అతను మరో ప్రశ్నవేసే లోపు వెహి కల్ ముందుకు దూకించాడు వెట్టి.

***

'ఏరా? ఏం చేస్తున్నావ్?' వంటింటి గుమ్మం దగ్గ రికి వస్తూ బిగ్గరగా పిలిచింది రాయుడిపల్లి రవీం ద్రన్న భార్య తమ పనివాడిని.

'తల్లీ తొందరగా... తొందరగా రావాలి' తడి ఆరి పోయిన కంఠంతో తడబడుతూ సమాధానం ఇచ్చాడు అతను.

'అందరూ నిద్రలు లేచే వేళ అయింది. టీ పెట్ట టానికి పాలు పితుక్కురారా అని చెపితే చెప్పిన పని చేయకుండా నన్నే రమ్మంటావేమిటిరా? నీకసలు బుద్ధి ఉందా?' అని అడుగుతూ వంట ఇంటి వెలుపల ఉన్న మెట్లు దిగి, వంద అడుగుల దూరంలో ఉన్న పశువుల పాక దగ్గరికి బయలుదేరింది ఆ ఇల్లాలు.

పాల చెంబు పట్టుకుని, దారిమధ్యలోనే శిలా విగ్రహంలా నిలబడి ఉన్నాడు పనివాడు.

'ఏమిటి? ఏమయింది నీకు?' అని అడగబోతున్న ఆమెకు, వణుకుతున్న ఎడమ చేతిని ఎత్తి ముందుకు చూపించాడు.

పశువుల పాకకు ఖచ్చితంగా పది అంగల దూరంలో వత్తుగా ఎదిగి ఉన్న ఒక కృష్ణతులసి పొదకు దగ్గరగా చుట్టలు చుట్టుకుని, పడగను కొంచెం పైకెత్తి చూస్తోంది ఒక మహానాగు.

పనివాడి మీది కోపం మరిచిపోయిందా ఇల్లాలు. 'తల్లీ... ఇంత పొద్దున్నే దర్శనం ఇచ్చావేమిటి? ఏంకా వాలి నీకు?' చేతులు జోడించి తమకంగా అడు గుతూ, ఒక అడుగు ముందుకు వేసింది.

పడగను మరికొంచెం పైకి ఎత్తి బుస్సుమని చిన్న శబ్దం చేసిందా నాగుపాము. ఉన్నట్లుండి కదిలి పాదరసం జారినట్టు సుతిమెత్తగా, సున్నితంగా చీక ట్లోకి వెళ్ళిపోయింది.

'లైట్లు వేయండిరోయ్... లైట్లు ... కర్రలు తీసుకు రండి' బిగ్గరగా అరవటం మొదలుపెట్టిన పనివాడి నెత్తిమీద ఒక దెబ్బ వేసింది ఆమె.

'బుద్ధిలేదు నీకు. తల్లిరా... మన నాగమ్మ తల్లి. ఏదో చెప్పటానికి వచ్చింది' అన్నది.

'ఏమీ చెప్పకుండానే వెళ్ళిపోయింది కదమ్మా' అమాయకంగా అడిగాడు అతను.

'మొద్దుమొఖానివి నువ్వు ఇక్కడే ఉన్నావని తలొంచుకుని తన దారిన తను వెళ్ళిపోయింది..' అంటూ అతని దగ్గర ఉన్న పాలచెంబు తను తీసుకున్నది ఆమె. 'పాలు నేను తీసుకు వస్తాను. నువ్వు పోయి మా తమ్ముడిని నిద్రలేపు' అంటూ ముందుకు కదిలింది.

ఆ ఇంటి ముందుభాగంలో పెద్ద చెక్కబల్లమీద మందపాటి దుప్పటిని ముసుగుపెట్టి పడుకుని ఉన్నాడు రవీంద్ర బావమరిది. పనివాడు పదిసార్లు భుజం తట్టిన తర్వాత లేచి కూర్చున్నాడు. పశువుల పాక దగ్గర పాము కనిపించిన వెంటనే వెళ్ళిపోయిం దని వినేసరికి, పూర్తిగా వదిలిపోయింది అతని బద్ధకం. బల్లమీది నుంచి దిగి, పరుగులాంటి నడకతో ఇంటి వెనక్కి పోయాడు.

'అమ్మ ఏదో చెప్పటానికి వచ్చింది తమ్ముడూ. ఏదీ చెప్పకుండానే వెళ్ళిపోయింది. ఏమై ఉంటుంది?' నెమరువేస్తూ నిదానంగా నిలబడి ఉన్న ఒక మేలు జాతి పశువు దగ్గర పాలు పితుకుతూ అతన్ని అడి గింది ఆ ఇంటి ఇల్లాలు.

'చూసింది నువ్వు. నేను కాదు. నన్ను ఏం చేయ మంటావో అది ముందు చెప్పు' అన్నాడు అతను.

'బండోడి నాయన దగ్గరికి పోయిరా.. తను వివ రంగా చెప్పగలడు..' చెప్పింది ఆమె.

'బండి తీసుకుపోతా' అన్నాడు అతను.

'మన ఇంటి దగ్గర వదిలి వెళ్ళాడని చెప్పి అదే పనిగా ఆ అబ్బయ్య బండిని వాడుకోవటం మంచిది కాదేమోరా' తటపటాయించింది ఆమె.

'ఈ ఒక్కసారికి వాడుకుంటే తప్పేమీ ఉండదు. అసలు ఇవాళ రేపట్లో తను వచ్చేస్తాడు. లేదా బండిని తీసుకురమ్మని ఫోనైనా చేస్తాడు..' అంటూ మళ్ళీ ఇంటి ముందుకు వచ్చాడు అతను.

ఆవరణలో ఉన్న సపోటా చెట్టు దగ్గరే స్టాండ్ వేసి ఉంది వెట్టి ఆ ఇంటి దగ్గర వదిలిన బుల్లెట్ బండి.

దగ్గర్లో ఉన్న నీళ్ళతొట్టిలోని నీళ్ళు మొఖం మీద చల్లుకొని, తడిని చేతులతోనే తుడుచుకుంటూ బండి దగ్గరికి బయలుదేరి, అదిరిపడ్డాడు అతను.

ఒక పక్కకు వాలి ఉన్న హ్యాండిల్‌ని చుట్టుకుని ఉంది ఒక నాగుపాము.

ఎగిరి వెనక్కి దూకి పెద్ద కంఠంతో తన అక్క మ్మను పిలువబోయాడు ఆ యువకుడు.

జర్రున జారింది పాము. సపోటా చెట్టు వెనక్కి పోయి అదృశ్యం అయింది.

తన అక్కను పిలిచే ఆలోచనను వదిలేసి, నెమ్మ దిగా బుల్లెట్ దగ్గరికిపోయి, ఆ బండి ముందు భాగాన్ని, వెనుకభాగాన్ని నిశితంగా పరిశీలించాడు అతను. కిందికి జారి అవతలకు పోయినట్టు కనిపిం చిన పాము, తిరిగి వెనక్కి వచ్చి బండి కిందిభాగంలో చుట్టలు చుట్టుకోలేదని నిశ్చయం అయిన వెంటనే, స్టాండు తీసి స్టార్ట్ చేశాడు.

ఆవరణ గేటును క్రాస్ చేస్తుండగా మళ్ళీ కనిపిం చింది అది. గేటు పక్కనే ప్రహరీగోడ దగ్గర, పడగను ఎత్తి విలాసంగా వెనక్కి ముందుకు కదిలిస్తూ.

స్పీడ్‌ని పెంచేశాడు అతను తనకు తెలియ కుండానే... నాలుగే నాలుగు నిమిషాల్లో బండోడి ఇంటి ముందు ఆపి, బిగ్గరగా ఒక అరుపు అరిచాడు.

***

'తొందరపెడుతోంది తల్లి. సందేహపడవలసిన అవసరం ఎంతమాత్రము లేదు. అందుకే అన్నిసార్లు దర్శనం ఇచ్చింది' అన్నాడు బండోడి నాయన.

'బండి హ్యాండిల్ మీద కనిపించిందంటే అర్థం ఏమిటే నాయనా?' అడిగాడు బండోడు.

'బండితో ఆ అబ్బయ్యకి అవసరం వచ్చి ఉంటుందిరా. బండిని వెంటనే పంపించమని చెప్పటానికి అయి ఉంటుంది' అన్నాడు నాయన.

నడుము మీద చేతులు వేసుకుని నిలబడిన రవీంద్ర బావమరిదికి అధికం అయిపోయింది ఆత్రుత.

'అన్నయ్య ఎక్కడ ఉన్నాడో మనకి తెలియదు కదా.. ఎలా తీసుకుపోవడం?' అడిగాడు.

'అనుమానాలు నీకెందుకు? ఎక్కడున్నాడో ఆ తల్లే చూపిస్తుంది' అన్నాడు బండోడి నాయన.

తల ఊపి బండి స్టార్ట్ చేశాడు రవీంద్ర బావమ రిది. 'అరేయ్.. నువ్వు మా ఇంటికిపోయి అక్కకి చెప్పు. నేను సిటీకి పోయి వస్తా' అంటూ అదిరిపడ్డాడు.

అతను రిక్వెస్ట్ చేసినట్లు ఊళ్ళోకి బయలుదేర లేదా బండోడు. కామ్‌గా వచ్చి అతని వెనుక కూర్చు న్నాడు. 'నువ్వు ఒక్కడివే వెళ్ళటం బాగోదు. నేను కూడా వస్తున్నా' అంటూ.

***

చెవులు చిల్లులు పడిపోయేటట్లు వెలుగుతున్న మంగళవాయిద్యాలను చూసి ఎంతగానో సంబరపడి పోతున్నట్టు తల ఊపుతున్న పిచ్చమ్మి వైపు చూడ టానికి కూడా భయపడింది శివారెడ్డి భార్య.

'డాక్టరు ఇచ్చిన మందువల్ల ఉపయోగం ఉన్నట్టు కనిపించటం లేదు' చిన్న కంఠంతో రమణయ్య పంతులు గారికి చెప్పింది.

అవుట్‌హౌస్‌లోనే స్నానం చేసి, అంతకు ముందు రోజు ధరించిన దుస్తుల్నే తిరిగి ఉపయోగించు కున్నాడు ఆయన. తన ఇంటికి పోలేదు.

'తొందరపడి ఒక నిర్ణయానికి రాకండి తల్లీ.



## వద్దు పొమ్మన్నారట!

అనుష్క శర్మ బాలీవుడ్‌లో సక్సెస్‌ఫుల్ హీరోయిన్ మాత్రమే కాదు. సక్సెస్‌ఫుల్ నిర్మాత కూడా! ఇప్పుడంటే అందరూ తనను ఇష్టపడుతున్నారు కానీ, ఒకప్పుడు తనను ఆడిషన్‌లో ఎవరూ తీసుకోలేదని ఇటీవల ఒక ఇంటర్వ్యూలో చెప్పుకొచ్చింది. చాలా సార్లు ఆడిషన్ టెస్ట్‌లో తను ఫెయిల్ అయ్యానని చెప్పింది. ఎన్నోసార్లు ఆడిషన్‌లో రిజెక్ట్ అయిన తరువాత తనకు అవకాశం వచ్చిందనీ, ఆ తరువాత వెనుదిరిగి చూసుకోవలసిన అవసరం లేకుండాపోయిందనీ అంది. తనలా మరొకరు బాధపడకుండా కొత్తవారిని సాధ్యమైనంత వరకూ ఓకే చేస్తానని అంటోంది.

ఇప్పటి పరిస్థితి మనకు ఇష్టం లేకపోబట్టి.. ఈ మోతలు చిరాకు తెప్పిస్తున్నాయి గాని, శృతిలయలు శాస్త్రబద్ధంగా ఉన్నాయి. చక్కగా వాయిస్తున్నారు' అన్నాడు అతను.

ఆ సంభాషణను పొడిగించటం తనకు ఇష్టం లేనట్టు తల విదిలించి తన భర్త దగ్గరికి పోయింది ఆమె.

'వెట్టి వచ్చాడా?' అడిగాడు శివారెడ్డి.

తల అడ్డం తిప్పింది ఆమె.

కళ తప్పింది శివారెడ్డి వదనం. 'కడప నుంచి ఫోను వచ్చింది. కాస్సేపు ఆగి మాట్లాడతానని చెప్పాను. మళ్ళీ వస్తుంది. ఏమని సమాధానం చెప్పాలో తెలియటం లేదు' అన్నాడు బరువుగా నిట్టూరుస్తూ.

'మీరెందుకు బాధపడటం? అప్పు చేసిన పెద్దమనిషి, ఇంకాసేపట్లో మీకు బంధువు కాబోతున్నాడు గదా. తనే చెపుతాడు సమాధానం' వద్దు వద్దని అనుకుంటూనే మాట తూలింది ఆమె.

మాట పెదవుల్ని దాటిన వెంటనే తన తప్పు తెలిసి వచ్చి, చటుక్కున బెడ్‌మీద కూలబడింది. 'నాకు తొందరపాటు ఎక్కువ అయిపోతోంది. అన్నివిషయాలు తెలిసి కూడా మూర్ఖంగా మాట్లాడాను..' భర్త చేయిమీద చెయ్యి వేస్తూ ఆర్ద్రంగా అన్నది.

పెదవులు బిగించి తల పక్కకు తిప్పుకున్నాడు శివారెడ్డి, తన కన్నుల్లో ప్రత్యక్షం అయిన నీటితెర ఆమెకు కనిపించకుండా ఉండేందుకు.

'ఈసారి ఫోను వస్తే నేను మాట్లాడతాను. మీరు ఆందోళన పడద్దు' అంటూ అతని పక్కనే ఉన్న ఫోన్‌ని తను తీసుకుని గదిలో నుంచి బయటికి వచ్చేసింది ఆమె.

ఖరీదయిన కొత్త చీర కట్టుకున్నది సంపంగి. తన ఇంట్లో ఏదో శుభకార్యం జరగబోతున్నట్టు సందడి సందడిగా తిరుగుతోంది.

'తల పగిలి పోతోంది. టీ తీసుకురా' చెప్పింది శివారెడ్డి భార్య.

'నన్ను గేటు దగ్గర సిద్ధంగా ఉండమని బాజిరెడ్డి సారు ఫోనుచేసి చెప్పారు. బయటికి పోతున్నాను' అంటూ వెళ్ళిపోయింది సంపంగి.

నివ్వెరబోయి, డైనింగ్ టేబుల్ దగ్గర కూర్చుండి పోయింది శివారెడ్డి భార్య.

రెండు నిమిషాల తరువాత ఉన్నట్లుండి మోగింది ఆమె తీసుకువచ్చిన ఫోను. వణుకుతున్న కంఠాన్ని అదుపులో పెట్టుకోవటానికి ప్రయత్నం చేస్తూ 'హల్లో...' అన్నది ఆమె.




'ఎవరూ? ఇది శివారెడ్డి సారు నెంబరే కదూ?' వినవచ్చింది గంభీరమైన కంఠం.

'అవును' సమాధానం ఇచ్చింది ఆమె. 'నేను శివారెడ్డి భార్యను' అని కూడా చెప్పింది.

'అమ్మా.. చిన్నదానివి. ఆడబిడ్డవి కాబట్టి ఆశీస్సులు. ఫోను నీ దగ్గరికి ఎందుకు వచ్చింది తల్లీ?' మృదువుగా అడిగింది ఆ కంఠం.

అది శివారెడ్డిని బాధిస్తున్న కడప ఫోనే అని నిశ్చయించుకుని, అవతలినుంచి వినవచ్చే హెచ్చరికల్ని, బెదిరింపుల్ని భరించేందుకు మానసికంగా సిద్ధపడుతున్న ఆమెకు చిన్నపాటి షాక్ తగిలినట్టు అయింది. ఆమెకు తెలియకుండానే గద్గదమయింది కంఠం. మాటలు తడబడ్డాయి.

'టెన్షను వద్దు తల్లీ. మాకు అన్ని విషయాలు కొద్దికొద్దిగా తెలిసిపోయినయ్. బాజిరెడ్డిని మేము సాధ్యమైనంత వరకూ ఆపేందుకే ప్రయత్నం చేస్తాము.

అయితే మేము ఇలా చేయబోతున్నామని శివారెడ్డి సారుకు చెప్పకండి. పెళ్ళి ఆలస్యం అయితే ఏదో జరిగిపోతుందని ఇప్పటినుంచే భయపడతాడు' అనునయంగా చెప్పింది అవతలి కంఠం.

అమితమైన సంతోషం... అంతలోనే పెద్ద అనుమానం... 'ఎందుకు? ఎలా? మాకు సహాయం దేనికి చేస్తున్నట్టు?' అడిగింది ఆమె.

'మీ దగ్గర్నించి వచ్చిన అబ్బయ్య మాకు చాలా కావాల్సినవాడైపోయాడు. తను తిరిగి వచ్చేవరకూ మీ అమ్మి పెళ్ళి జరగనీయొద్దని చెప్పి మరీ ఎక్కడికో పోయినాడు. అదీ సంగతి' అన్నది అవతలికంఠం.

ఆపైన ఎంత బిగపట్టుకున్నా ఆగలేదు శివారెడ్డి భార్య కన్నీళ్ళు. గద్గదస్వరంతోనే కృతజ్ఞతలు తెలియచేసుకుని, అవతలగా కూర్చొని ఉన్న పిచ్చమ్మి దగ్గరికి పోయి, ఆమె భుజం మీద తల వాల్చుకున్నది.

'పిచ్చిపిల్లా.. నా మనిషి మీద నాకు నమ్మకం ఉంది. తిమ్మిని బెమ్మిని చేసైనా తను మనకి మంచే చేస్తాడు. మీరు అనవసరంగా కంగారుపడి కాళ్ళు తొక్కుకోవద్దు' ఫోనులోని సంభాషణ తనకు వినబడింది కాబోలు – నవ్వుతూ చెప్పి తల నిమిరింది పిచ్చమ్మి.

***

ఎగిరెగిరి పడుతున్న బుల్లెట్‌ని అతి ప్రయత్నం మీద కంట్రోల్ చేస్తూ, దృష్టినంతా రోడ్డు మీదే కేంద్రీకరించి ఉంచాడు రవీంద్ర బావమరిది.

'ఎందుకైనా మంచిది కొంచెం నెమ్మదిగా పోనీయరా నాయనా.. అసలే మన రోజులు బాగోలేవు' అన్నాడు బండోడు.

'నువ్వు నోరుమూసుకో. నన్ను భయపెట్టబోకు' విసురుగా చెపుతూ ఉన్నట్లుండి బండి వేగం తగ్గించేశాడు అతను.

'ఏమైందిరా? నిజంగానే భయమేసిందా?' అని అతన్ని అడగబోతూ, ఆ మాటల్ని మధ్యలోనే మింగేశాడు బండోడు. 'పక్కకితీయ్. చాలా స్పీడుమీద ఉంది. మనల్ని తొక్కుకుంటూ పోయినా ఆశ్చర్యపడవలసిన అవసరం లేదు' అన్నాడు.

బుల్లెట్‌ని వెంటనే ఆ అడవి రోడ్డు పక్క భాగంలోకి పోనిచ్చాడు రవీంద్ర బావమరిది. ఆ రోడ్డు మీద తాము ప్రయాణిస్తున్నట్టు అవతలి వారికి తెలియచెప్పటం కోసం హెడ్ లైటును ఆఫ్ చేసి, వెంటనే మళ్ళీ ఆన్ చేశాడు.

వేగంగా వచ్చింది ఆ వెహికల్. కీచుధ్వనులు చేస్తూ సరిగ్గా వారి పక్కన ఆగింది.

మీ అంతట మీరే నాకు ఎదురు రావటం నిజంగా నా అదృష్టం. మిమ్మల్ని వెతకటానికి నానా బాధలు పడాల్సివస్తుందని అనుకుంటున్నాను?' అంటూ స్టీరింగ్‌ని వదిలి కిందికి దిగాడు వెట్టి.

'అయ్యబాబోయ్.. అన్నయ్యా... నీ కోసమే మేము బయలుదేరాం' అంటూ తమ ఇంటి దగ్గర జరిగిన సంఘటనల్ని, బండోడి నాయన చెప్పిన మాటల్ని వివరించాడు రవీంద్ర బావమరిది.

'చౌడేశ్వరి, తన ఇంటికి తను చేరుకోవాల్సిన టైము వచ్చేసింది. వెంటనే జరిగిపోవాలి ఆ పని' అన్నాడు వెట్టి.

'ఒక్క ఫోను కొట్టి ఉంటే మా బావయ్యకి చెప్పి అన్నీ సిద్ధం చేయించే పని. ఇపుడు మనం వెళ్ళి అందరికీ చెప్పి, ఏర్పాట్లు చేసుకోవటం అంటే చాలా ఆలస్యం అవుతుంది కదా' సాలోచనగా అన్నాడు రవీంద్ర బావమరిది.

'హంగులు ఆర్భాటాలు ఏమీ వద్దు. మనమే తీసుకుపోయి ఆ పిచ్చి పూజారయ్యకి అప్పచెబుదాం' అన్నాడు వెట్టి.

పిచ్చి తగ్గిపోయింది అన్నయ్య... కోపం మాత్రం చాలా ఎక్కువ అయింది. తమ ఇంటి దగ్గర పెళ్ళి ముహూర్తం పెట్టమంటే ఆయన మాట్లాడిన మాటల్ని గుర్తు చేసుకుంటూ అన్నాడు ఆ యువకుడు.

తెల్లబడుతున్నది తూర్పుదిక్కు. తెల్లవారిన తర్వాత శివారెడ్డి బిల్డింగ్ దగ్గర జరుగబోయే గందరగోళాన్ని తలచుకునేసరికి, చేదుగా తయారయింది వెట్టి నోరు.

'ఆలస్యం చేయటానికి వీలులేదు. పదండి' అంటూ బుల్లెట్‌ని తను తీసుకున్నాడు. అతని వెనుక రవీంద్ర బావమరిది, ఆ తర్వాత బండోడు కూర్చున్నారు.

'బాబీ.. నువ్వు ఒక పనిచెయ్యి.... చౌడేశ్వరి గుడి దగ్గర వెయిట్ చెయ్యి' పక్కకు తీసి ఆపిన కారువైపు చూస్తూ చెప్పాడు వెట్టి.

ఛెంగున కిందికి దిగాడు రాకేష్. వెట్టివెనుక కూర్చున్న వారిద్దరినీ 'జరగండి.. ముందుకు జరగండి' అని గద్దిస్తూ తను కూడా బుల్లెట్ ఎక్కాడు.

**(ఇంకా వుంది)**

# పైల్స్ - హోమియో చికిత్స

పైల్స్ వున్న వారి బాధవర్ణనాతీతం, మలవిసర్జన తర్వాత ఈ బాధ కొన్ని గంటల వరకు ఉంటుంది. నొప్పి, మంట, దురద ఉండి, సూదులతో గుచ్చు కున్నట్లువుండి వీరు ఒకచోట కూర్చోలేరు, నిల్చో లేరు. ఈ మొలలు చిట్లడంవలన రక్తస్రావం జరుగు తుంది. చాలారోజుల వరకు రక్తస్రావం అయితే శరీరంలో హిమోగ్లోబిన్ శాతం తగ్గి ఎనీమియా రావడానికి ఆస్కారంఉంది. జీవనవిధానం, మారుతున్న ఆహారపు అలవాట్లు, నిద్రలేమి, వాహనాలు అధికంగా నడపటం, వేసవికాలం, నీరు అధికంగా తీసుకోకపోవడం వలన ఇవి వస్తాయి. మలద్వారంతో కలుపబడిన పెద్దపేగు చివరి భాగాన్ని మలనాళం లేదా రెక్టమ్ అంటారు. ఇక్కడ ఉన్నకణజాలంలో అధికంగాఉండే రక్తనాళాల వాపు వలన ఈ స్థితి వస్తుంది. పురీషనాళం వెలుపలి భాగంలో వస్తే బాహ్య హెమరాయిడ్స్ అని, లోపలి భాగంలో వస్తే లోపలిహెమరాయిడ్స్ అనిఅంటారు. ఇవి బఠాణీగింజ లేదా ద్రాక్షపండు పరిమాణంలో గులాబీ రంగులో, మూడు లేదా నాలుగు గుత్తులు గా లేదా విడిగాకూడా ఉండే ఈ స్థితిని మూలశంక (పైల్స్) వ్యాధిగా పేర్కొంటారు.

**ఎవరికి వస్తుంది ?:** గర్భిణులలో, ప్రొస్టేట్ గ్రంథి వాపు ఉన్నవారిలో సాధారణంగా చూస్తాం. పిల్లలలో ఈ వ్యాధిని అరుదుగా చూస్తాం.

**కారణాలు :** 1. మలబద్ధకం మూలంగా అధికంగా ముక్కుటం 2. దీర్ఘకాలిక విరేచనాలు 3.గర్భస్థ పిండం ఒత్తిడి వలన, అధికంగా ఉత్పత్తి అయ్యే హార్మోన్ల వలన 4. పొత్తికడుపు లేదా పేగులలోని క్యాన్సర్ సంబంధ కణుతుల వలన 5. వంశపారం పర్యంగా 6. అధిక బరువు 7. పీచు పదార్థాలు తక్కువగా ఉన్న ఆహారాన్ని రోజూ తీసుకోవడం.. వంటివి.

**హెమరాయిడ్‌లు - రకములు:** మొదటి తరగతి ( ఫస్ట్ డిగ్రీ పైల్స్). రక్టమ్ లేదా మలనాళం లోపలే ఉంటాయి. రెండవ తరగతి (సెకండ్ డిగ్రీ పైల్స్). పురీషనాళం తెరుచుకొని ఉన్నప్పుడు వెలుపలికి వచ్చి, మలద్వారం మూసుకున్న వెంటనే లోపలికి వెళ్ళిపోతాయి. మూడవ తరగతి (థర్డ్ డిగ్రీ పైల్స్) వెలుపలికి వచ్చి, హెమరాయిడ్‌లను లోపలికి చొప్పించిన వెంటనే లోనికి వెళ్ళిపోతాయి. నాల్గవ తరగతి (ఫోర్త్ డిగ్రీ పైల్స్) మలద్వారం వెలుపల శాశ్వతంగా వేలాడుతూ ఉంటాయి.

**లక్షణాలు:** చాలా మంది ఎక్కువగా లోపలి హెమరాయిడ్‌ల(ఇంటర్నల్ పైల్స్)తో ఏ లక్షణాలు లేకుండానే ఉంటారు. మలద్వారం తెరుచుకున్న వెంటనే తాజా రక్తం మలద్వారం ద్వారా వెలుపలికి వస్తుంది. మలద్వారం చుట్టూ దురద ఉండవచ్చు. మూడు - నాలుగు దశలలోని హెమరాయిడ్‌లు, అధికంగా నొప్పి ఉండి చీమువంటి పలుచని ద్రవం విసర్జింప బడుతుంది.

**నివారించవచ్చా:** మొలలు వచ్చిన తరువాత కంటె మొలల లక్షణాలు కనబడిన వెంటనే కొన్ని జాగ్రత్తలు తీసుకుంటే వీటిని నివారించవచ్చు. మొలలతో




**డా. మురళి అంకిరెడ్డి**
M. D (Homeo)
**స్టార్ హోమియోపతి**


బాధపడేవారు ఆహారపు అలవాట్లలో, జీవన విధానంలో మార్పుతీసుకొస్తే నివారించవచ్చు. ముఖ్యంగా తాజా పండ్లు, ఆకుకూరలు, ఫైబర్‌తో కూడిన పదార్థాలు, దప్పికఉన్న లేకున్నా పది నుండి పన్నెండు గ్లాసులనీరుతీసుకోవడం, మాంసాహారం, మసాలాలు, పచ్చళ్ళుతీసుకోకుండా ఉంటే మంచిది. ఎక్కువసేపు కూర్చోకుండా, యోగా, వ్యాయామం చేయడం వలన నివారించవచ్చు.

**హోమియో చికిత్స వలన ప్రయోజనం ఉంటుందా?:** మొదటి మూడు దశలలోని హెమరాయిడ్‌లను పూర్తిగా నయం చేయుటమేకాక, శస్త్రచికిత్స, అవసరం లేకుండా చేస్తుంది. అంతే కాకుండా హెమరాయిడ్ వలన వచ్చే బలహీనతను తగ్గించి, శాశ్వతంగా రాకుండా చేస్తుంది. హోమియోలో ఆస్కులస్ హిప్, ఆలోస్, హెయామెలిస్, కొలింగ్ సోనియా, ఆర్గనిక్ ఆల్, నక్సామికా మందులు బాగా పనిచేస్తాయి.



# సయాటికా (గృధ్రసీ వాతము)

ప్రస్తుత పరిస్థితిలో మానవుని జీవితం చాల యాంత్రికం గా మారిపోయింది. ముఖ్యంగా ఆహారపుఅలవాట్లు, దిన చర్య, స్వప్నవిపర్యయం (పగటినిద్ర, రాత్రి సమయానికి నిద్రపోకపోవటం) లాంటి విషయాలలో అనేక మార్పులు రావటం వలన, ఆందోళన, మానసికఒత్తిడి లాంటి సమస్యల వలన మానవులనేక వ్యాధులబారిన పడుతు న్నారు. అందులో అతి ముఖ్యమైనది (నడుమునొప్పి) కటిశూల. నూటికి 90మంది తమ జీవితకాలంలో ఎప్పుడో ఒకసారి ఈనడుమునొప్పిసమస్యతో బాధ పడుతున్నారు. ఆయుర్వేద శాస్త్రంలో చరక, సుశ్రుత, వాగ్భటులు ఈ సమస్యను గుధ్రసీవాతం(సయాటికా)గా పేర్కొంటూ ఎంతో విపులంగా వివరించారు.

దీనికి సాధారణ కారణాలు పరిశీలించినట్లయితే... ఎక్కువగా ఒకే పొజిషన్‌లో కూర్చోవటం, స్థూల కాయం, అధికశ్రమతో కూడిన పనులు ఎక్కువ సేపు చేయుటం, అధిక బరువులను మోయుటం, ఎక్కువ దూరం ద్విచక్ర వాహనాలు, కార్లలోప్రయాణించటం, కొన్ని దీర్ఘకాలిక వ్యాధులువలన, కొన్ని వంశపారం పర్య వ్యాధులవలన, మరికొన్ని రోడ్డుప్రమాదాల వలన ఈ నడుము నొప్పి సమస్య వస్తుంటుంది. ముఖ్యంగా పైన వివరించిన కారణాలవలన శరీరంలో వాతప్రకోపంజరిగి, ముందుగా పిరుదులకు పైభాగాన స్తబ్ధతను, నొప్పినికలిగించి తరువాత కటి ప్రదేశం (నడుము), తొడలు, మోకాళ్ళు, పిక్కలు, పాదాలలో క్రమంగా నొప్పి కలుగుతుంది. దీనినే గుధ్రసీవాతము (సయాటికా) అని అంటారు. ఈ సమస్య శీతాకాలంలో ఎక్కువ అవుతుంది. ముఖ్యంగా నడుముకు సంబంధించిన ఎల్4-ఎల్5, ఎస్1-ఎస్2 వెన్నుపూసల మధ్యగల సయాటికా అనే నరంపై ఒత్తిడి పడటం వల్ల ఈ నొప్పి వస్తుంది.

**డిస్క్‌లో వచ్చేమార్పులు:** ఈ వ్యాధిలో వెన్నుపూసలమధ్య ఉండే డిస్క్‌లో కొన్ని మార్పుల జరుగుతాయి. అవి డిస్క్ మీద ఒత్తిడి పెరగటం, వాపురావటం లేదా డిస్క్‌కి రక్త ప్రసరణ సరిగా లేకపోవటం, అరిగిపోవటం అనే సమస్యల వల్ల ఈ నొప్పి వస్తుంది. డిస్క్‌లో వాపు వస్తే దానిలోఉండే చిక్కనిద్రవం బయటకు వచ్చి మేరుదండం లేదా దాన్నుంచి వచ్చే నరాలపై ఒత్తిడి కలిగంచటం వల్ల నొప్పి వస్తుంది.

**లక్షణాలు:** నడుములో నొప్పి కలగటం, వాపు, కొంచెం శారీరక శ్రమ వేయగానే నొప్పి తీవ్రత పెరగటం, ఈ నొప్పి సూదులతో గుచ్చినట్లుగా, ఒక్కోసారి తిమ్మిర్లు, మంటలతో కూడి ఉంటుంది. సమస్య తీవ్రమైనది అయితే స్పర్శహాని కూడా కలుగవచ్చు, ఒక్కోసారి మల మూత్రాలమీద నియంత్రణకూడా పోయేప్రమాదంఉంది. వెన్ను నొప్పి బాధ అనగానే సాధారణంగా పెయిన్‌కిల్లర్స్ తో కాలయాపన చేస్తుంటారు. దీనివల్ల తాత్కాలిక ఉప శమనం కల్గుతుంది. కాని మలబద్ధకం, జీర్ణా శయ సమస్యలు మొదలవుతాయి. కావున ఇలాంటి సమస్యల ను ప్రారంభదశలోనే గుర్తించి, జాగ్రత్త పడటం వల్ల ఈ వ్యాధిని సమూలంగా నయం చేయవచ్చు.

**ఆయుర్వేదచికిత్స:** ఆయుర్వేదంలో ఇలాంటి సమస్యల కు సమగ్రమైన చికిత్సాపద్ధతులుఉన్నాయి. అందులో **శమన చికిత్స:** ఇది దోషాలను బట్టి అభ్యంతరంగా వాడే ఔషధ చికిత్స ఇందులో వేదన, కాయకంగా ఔషదాలు ఉంటాయి. అలాగే వాతహర చికిత్సా పద్ధతులుంటాయి.

**శోధనచికిత్స:** శమన చికిత్స వలన ఒక్కోసారి మళ్ళీ వ్యాధి తిరగబెట్టవచ్చు. అందుకే ఆయుర్వేదంలో పంచకర్మ అనే ఒక ప్రత్యేక చికిత్సా పద్ధతి ఉంది. ఈ చికిత్సా పద్ధతి ద్వారా ప్రకోపించిన వాతాది దోషాలను సమూలంగా తగ్గించవచ్చు.

**1.స్నేహకర్మ:** ఈ ప్రక్రియ ద్వారా వెన్నెముకలోని వెన్ను పూసల మధ్య స్నిగ్ధత్వాన్ని పెంపొందించి, తద్వారా జాయింట్స్‌లో కదలికలను తేలికగా చేయువచ్చును.

**2.స్వేదకర్మ:** ఈ పద్ధతిలో గట్టిగా అతుక్కొనిఉండే జాయింట్స్ ను మృదువుగా అయ్యేటట్లు చేయువచ్చును. కటివస్తి. ఈ ప్రక్రియ ద్వారా అరిగిపోయిన మృదులాస్థికి రక్త ప్రసరణను పెంచి తద్వారా నొప్పి తీవ్రతను తగ్గించ వచ్చును. అలాగే సర్వాంగధార, వస్తికర్మ అనే విశిష్ట చికిత్సా పద్ధతుల ద్వారా నాడీ కణాలలో కలిగిన లోపాల ను సరిచేయువచ్చు. అదేవిదంగా ప్రకోపించిన వాతాన్ని సమస్థితికి తీసుకురావచ్చు.

జాగ్రత్తలు:సరిఅయిన పోషకఆహారాలు తీసుకోవడం. నిదాన పరివర్జనం అనగా పైన చెప్పిన ప్రత్యేక వ్యాధి కారణాలను మళ్లీ చేయకుండా జాగ్రత్త పాటించినట్ల యితే ఈ సమస్యనుంచి శాశ్వతవిముక్తి పొందవచ్చును.


**డా. లక్ష్మి.** M. D (Ayurveda)
**స్టార్ ఆయుర్వేద**



# జీవితమే ఒక ప్రతిఘటన

## (కోట శ్రీనివాసరావు కథాకథనం) 32

**సినిమా పరిశ్రమ ఎలాంటిదంటే గుమ్మడికాయంత టాలెంట్ ఉన్నప్పటికీ, ఆవగింజంత అదృష్టం తప్పకుండా ఉండాలి. నాలాగే మా తమ్ముడు కూడా నాటకాలు వేశాడు, సినిమాల్లోకి వచ్చాడు. ప్రతిభ ఉన్నా ఎదగాల్సినంత స్థాయికి ఎదగలేకపోయాడన్నది నాకెప్పుడూ బాధగా ఉంటుంది. వెండితెరమీద కూడా ఇంకా వాడు ఎదిగితే చూడాలని నా తాపత్రయం.**

## మా పార్టీలోనే పై పందాలు కాసుకున్నారు

నేను రాజకీయాల్లోకి రావడం చిన్నపాటి ప్రహసనం. ఎందుకంటే రెగ్యులర్‌గా రాజకీయాలు తెలుసుకునేవాణ్ణిగానీ, రాజకీయాల్లోకి రావాలని మాత్రం అనుకోలేదు. పేపర్లు చదువుతూనో, మరో రకంగానో నేను మొదటి నుంచీ బీజేపీని అభిమానించేవాణ్ణి. ఎందువల్ల ఆ పార్టీమీద అంత అభిమానం అని ఎవరైనా అడిగితే కారణం చెప్పలేను. అలా నాలో ఉన్న ఇష్టం కాస్తా పెరిగి పెరిగి వాజ్‌పేయి గారి హయాంలో రెట్టింపు అయింది. ఎవరు ఏ పార్టీ గురించి చెప్పినా నాకు ఎక్కేది కాదు. అయితే బీజేపీ అధికారంలోకి వస్తుందని మేమెప్పుడూ అనుకోలేదు. కాకపోతే ఆ ఘనత వాజ్‌పేయిగారిదే. ఆయన గ్రేట్ మ్యాన్. ఆయన వల్లే అంతా జరిగిందని నా నమ్మకం. ఇవాళ్టి పరిస్థితుల్లో ఆయన మానసికంగా ఆరోగ్యంగా ఉంటే దేశం ఇంకా చాలా చాలా గొప్పగా ఉండేదండీ.

### రాజకీయ రంగప్రవేశం

ఒకసారి మోహన్‌బాబుగారి సినిమా ఒకటి చేస్తున్నా. ఆయనదే, సొంత పిక్చర్. హైదరాబాద్‌లో ఓల్డ్ ఎయిర్‌పోర్టుకు ఎదురుగా ఉండే చిరాన ఫోర్ట్‌లో షూటింగ్ జరుగుతోంది. ఆవేళ షూటింగ్ స్పాట్‌లో నేను ఒకతన్ని చూశా. అంతకుముందు అతని గురించి చాలానే విన్నాను కానీ, అదే తొలిసారి కలవడం. నాతో పాటు ఆ సినిమాలో ఆయన నటించారు. ఆయన ఇంకెవరో కాదు.. ఇప్పుడు మహారాష్ట్ర గవర్నర్ విద్యాసాగర్‌రావుగారు. నాకు తెలిసి చాలా స్నేహశీలి. మంచివారు. అప్పటికే బీజేపీలో ఉన్నారు. షాట్‌గ్యాప్‌లో ఆయనతో కూర్చుని అవీ ఇవీ మాట్లాడసాగాను. మా మాటల్లో బీజేపీ గురించి చాలా అంశాలు వచ్చాయి. అప్పుడు పార్టీ పట్ల నా వ్యూస్ చాలా చెప్పా. అంటే వాటిని వ్యూస్‌గా చెప్పలేదు కానీ, 'నేను ఇలా అనుకుంటున్నానండీ' అన్న చందానే చెప్పా. ఆయనకు నచ్చిందో ఏమో తెలియదు. ఆయనా ఆ స్పాట్‌లో నాకు ఏమీ చెప్పలేదు. కానీ మనసులో ఉంచుకున్నారు. ఆ తర్వాత ఎన్నికలప్పుడు నన్ను సంప్రదించారు. 'ఇతను మన పార్టీకి చాలా కావాల్సినవాడు. కాకపోతే బయటికి రావడం లేదు. సినిమాలకే ఫిక్సయ్యాడు. చాలా ఐడియాలున్న వ్యక్తి. జనాలకు మంచి చేస్తాడు. ప్రచారం చేయడానికి వాడుకోవాలి' అని సన్నిహితులతోనూ అన్నారట. నాతోనూ ఆ విషయాలేచెప్పి ప్రచారానికి రమ్మన్నారు. నేనూ వెళ్ళా. వెళ్ళిన చోటల్లా జనాలు బాగా వచ్చేవారు. నేనూ నా వ్యూస్‌తో బాగా మాట్లాడేవాణ్ణి. అవన్నీ చూసిన విద్యాసాగర్‌రావుగారికి మనసులో నా మీద మంచి అభిప్రాయం ఏర్పడిపోయింది. ఆ తర్వాత ఎన్నికలకు వచ్చేసరికి నా మీద ప్రెజర్ పెట్టసాగారు. 'మన వాళ్ళలో ఆంధ్రప్రదేశ్‌లో ఎవరూ ఎమ్మెల్యేలు లేరు. అంతపెద్ద స్టేట్‌లో ఒక్క ఎమ్మెల్యే కూడా లేకపోవడమేంటి?' అని పార్టీ లోలోపల చర్చలు జరిగాయి. 'ఒకవేళ ఉంటే ఎవరుండాలి? ఎవరుంటారు? ఎక్కడ ఉండాలి? ఎవరు? ఏంటి' అనే చర్చ ముమ్మరంగానే సాగింది. చంద్రబాబునాయుడు బీజేపీతో పొత్తు కుదిరి ఎన్నికల్లోకి దూకిన సమయం అది.

**తన రాజకీయరంగ ప్రవేశం ఒక ప్రహసనంగా జరిగిందంటారు కోటశ్రీనివాసరావు. విద్యాసాగరరావుగారి చొరవతో విజయవాడ తూర్పు నియోజకవర్గం నుండి పోటీ చేశారు కోట. ఆరుగురు అభ్యర్థుల మధ్య నివాసిత ప్రాంతాల దగ్గర, మార్నింగ్ వాకింగ్ సమయాల్లోనూ, టెలిఫోన్ పలకరింపులతోనూ ఆయన తనదైన సరికొత్త పంథాలో ఓట్లు అడిగేవారు. అంత కష్టపడినాగానీ కోట గెలుస్తారని ఆయన పార్టీ వాళ్ళకే నమ్మకం లేకపోయిందట!**

అప్పుడు వాజ్‌పేయిగారి వేవ్ చాలా బాగా ఉంది. సరిగ్గా అదే ఎన్నికల్లో కోట శ్రీనివాసరావుని నిలబెట్టాలని వాజ్‌పేయి స్వయంగా నిర్ణయించి, పట్టుబట్టారు. ఆయనతోపాటు పార్టీలో మరికొంత మంది ప్రముఖులు కూడా అదే మాటన్నారు. చంద్రబాబునాయుడుగారు కూడా 'శ్రీనివాసరావుగారికి ఆ సీటు ఇచ్చేపనైతే నేను వదిలిపెడతాను. లేకుంటే వదిలిపెట్టను' అని గట్టిగా అన్నారు. దాంతో అందరూ 'శ్రీనివాసరావుగారూ మీరు నిలబడాల్సిందే' అన్నారు.



అందరూ అనడం వరకు బాగానే ఉంది. నాకు లోలోపల ఒకటే టెన్షన్. పార్టీ గురించి మాట్లాడతానే తప్ప రాజకీయంగా నాకు పెద్ద ఎక్స్‌పీరియన్స్ లేదు. ఆర్థికంగానూ తట్టుకోవాలి. అవతలవైపు నాకు ఆపోజిట్‌గా ఆరుగురు నిలుచున్నారు. కాంగ్రెస్, కమ్యూనిస్ట్, ఇండిపెండెంట్స్ అందరూ కలిసి ఆరుగురున్నారు. ఐలాపురం హోటల్స్ ఉన్నాయి కదా.. వాటి ఓనర్ ఐలాపురం వెంకయ్యగారు కూడా నాకు ప్రత్యర్థిగా నిలుచున్న వారిలో ఉన్నారు. వాళ్ళందరితో నేనెందుకండీ అని విద్యాసాగర్‌రావుగారితో అంటే

'ఏమైనా చేయి.. నువ్వు నిలుచోవాలంతే' అన్నారు. సరేనని బరిలోకి దిగా. నిజంగా చెబుతున్నా... అతి తక్కువ ఖర్చుతో నేను ఎన్నికల్లో పోటీచేసి గెలిచా. ఎన్నికల సమయంలో నేను పాటించిన విధానం చూసిన వారందరూ 'శ్రీనివాసరావు స్టైల్ చాలా బావుందే' అని చెప్పుకున్నారు. వృథాగా నేనేమీ వాడలేదు. ప్రచారానికి నా సుమో తీసుకెళ్దామనుకున్నా. మాటల సందర్భంలో కె.ఎస్.రామారావు గారితో ఆ విషయమే చెప్పా. వెంటనే అతను ఇంకో జీప్ ఉంటే బావుంటుంది అని 'నా దగ్గర షూటింగ్‌కి వాడిన ఓ జీప్ ఉంది. ఆ జీప్ రిపేర్ చేయించి బెజవాడ పంపుతాను' అన్నారు. అన్నట్టుగానే పంపారు. ప్రచారంలో నేను ముందు సుమోలో వెళ్తుంటే జీపులో వెనకాల అరటిపండ్లు, నీళ్ళు పెట్టుకుని మావాళ్ళు వచ్చారు.

### నా పద్ధతింతే!

నేను ఎన్నికలకు ఒక పద్ధతిగా ప్రచారం మొదలుపెట్టా. బెజవాడలో సిద్ధార్థ కాలేజీ గ్రౌండ్స్ ఉంది. ప్రతిరోజూ ఉదయం ఐదుగంటలకు మార్నింగ్ వాకింగ్ చేసేందుకు అక్కడికి వందల్లో వస్తారు జనం. అందుకే నేనూ ఐదింటికేవెళ్ళి నా గుర్తుతో జండా పట్టుకుని నిలబడేవాణ్ణి. ఏడు దాకా అక్కడికి వచ్చిన వారిని పలకరించడం, ఓటు అభ్యర్థించడం ఇదే నా పని. ఆ తర్వాత ఇంటికివెళ్ళి స్నానం చేసి, నాతో ఉన్నవారిని పిలిచి టెలిఫోన్ డైరెక్టరీ తీసుకుని రమ్మనేవాణ్ణి. వాళ్ళు ఒక్కో ఏరియాలో నుంచి ఒక్కో నెంబరు చెప్పేవారు. ఆ నెంబర్లకు డయల్ చేసేవాణ్ణి.





అవతలివారు 'హలో' అనగానే 'నా పేరు కోట శ్రీనివాసరావు అండీ. బీజేపీ తరఫున ఎమ్మెల్యేగా పోటీ చేస్తున్నాను, తెలుగుదేశం సపోర్ట్‌తో. ఫలానా రోజున ఎన్నికలున్నాయి. ఇదీ నా గుర్తు. మర్చిపోవద్దు. నేను పర్సనల్‌గా మిమ్మల్ని రిక్వెస్ట్ చేసినట్టు అనుకుని తప్పకుండా వచ్చి ఓటు వేయండి..' అని ఫోన్ పెట్టేసేవాణ్ణి. అవతలివాళ్ళు 'ఏమండీ కోట శ్రీనివాసరావు అంటే సినిమా ఆర్టిస్టా...' అని అడిగేంత టైమ్ కూడా ఇచ్చేవాణ్ణి కాదు. అలా అరగంటసేపు ఫోన్లు మాట్లాడేవాణ్ణి. ఆ సమయంలో దాదాపు 20, 30 కాల్స్ చేసేందుకు మా అల్లుళ్ళు, మా అబ్బాయి, మా తమ్ముడు చాలా బాగా సాయం చేసేవారు. ఎందుకంటే ఎన్నికల ప్రచారానికి నాకు 22, 23 రోజులు టైమ్ మాత్రమే ఉంది. కాకపోతే నేను పోటీ చేసేది సిటీ నియోజకవర్గం కావడం వల్ల, కొంచెం అడ్వాంటేజ్ ఉండేది. పల్లెటూర్లయితే ప్రయాణం ఎక్కువగా ఉండేదేమో. సిటీ కావడం వల్ల ఒక గంట తిరిగితే ఓ వార్డు అయిపోయేది. దానికి తోడు చాలామందికి ఫోన్లు ఉండటం.. నేను ఫోన్లు చేస్తున్న సంగతి ఆనోటా.. ఈ నోటా అందరికీ తెలియడం.. 'కొత్తగా కోట మొదలెట్టాడురా.. భలే ఉందే ఇది' అని చాలా మంది చెప్పుకోవడం. దాంతో ఒక తరహా ప్రచారం జరిగేది.

### అపార్ట్‌మెంట్ల ముందు.

అప్పుడప్పుడే అపార్ట్‌మెంట్ కల్చర్ విరివిగా పాకుతోంది. ప్రతి అపార్ట్‌మెంట్‌కీ, ఫ్లాట్‌కీ వెళ్ళలేక మా తమ్ముడు కోట శంకర్రావుని పైకి పంపేవాణ్ణి. మా తమ్ముడు కరపత్రాలు చేతిలో పట్టుకుని పైకి వెళ్ళేవాడు. వెళ్ళగానే 'టీవీల్లో వస్తుంటారు.. శంకర్రావుగారంటే.. శ్రీనివాసరావుగారి బ్రదర్.. మీరేనా' అంటూ మొదలుపెట్టేవాళ్ళు అవతలివారు. వాళ్ళ ప్రశ్నలకు వాడు చిరునవ్వుతో సమాధానం చెప్పి, ఓటు వేయమని అడిగి వచ్చేసేవాడు. అంతలో నేను కింద రోడ్డుమీద నిలుచుని చేతులు ఊపుతూ 'హాయ్' అని పలకరించి, ఓటు వేయమని అడిగేవాణ్ణి. ఈ పబ్లిసిటీ కూడా అప్పటిదాకా ఎవరూ చేయనిదే. ఇలా ఏడున్నర నుంచి తొమ్మిదిన్నర దాకా రెండు గంటలు ఫ్యామిలీ ఏరియాస్‌లో తిరిగేవాణ్ణి. ఇలా నా తిప్పలు నేను పడ్డాసరే, నేను గెలుస్తానని మా పార్టీలోనే నమ్మకం లేదు. పైపందాలు కూడా కాసుకున్నారు. ఒక పక్క తిరిగిన అలసట, మరోవైపు ఈ సూటిపోటి మాటలు.. చిరాకు తెప్పించేవి. అయినా ఈ మాటలు విన్నకొద్దీ రెట్టింపు ఉత్సాహంతో పరుగులు తీసేవాణ్ణి.

### జనం అలా అనుకున్నారు!

నేనేమో బీజేపీపట్ల ఎంతో పాజిటివ్‌గా ఉంటాను. కానీ నన్ను ఒకసారి ప్రజలు కాంగ్రెస్ వాడినని అనుకున్నారు. మాగంటిబాబుగారు ఉన్నారుగా.. ఆయన అప్పట్లో ఏలూరు ఎంపీగా నిలబడ్డారు. అప్పుడు కాంగ్రెస్ తరఫున ఆయన పోటీచేశారు. నాకేమో సినిమాల ద్వారా, ఈవీవీ సత్యనారాయణ ద్వారా తను పర్సనల్‌గా నాకు మంచి ఫ్రెండ్. పరిచయం. నాతో చాలా క్లోజ్‌గా మెలిగేవారన్న మాట. ఒకసారి ఆయనకోసం ప్రచారం చేయమని అడిగారు. ఏలూరుకు నేను వెళ్ళిందేమో మాగంటిబాబు కోసం. మా మధ్య సాన్నిహిత్యం గురించి తెలియనివారు నేను కాంగ్రెస్ కోసం ప్రచారం చేశాననుకున్నారు. విషయం తెలిసిన తర్వాత నేను ఇంకెప్పుడూ కాంగ్రెస్ కోసం పనిచేయలేదు. ఆ తర్వాత వాళ్ళూ వీళ్ళూ ఎప్పుడైనా పిలిచినాగానీ వెళ్ళి చేతులు ఊపి రావడమేగానీ ఎప్పుడూ పెద్దగా ఏకాగ్రత పెట్టి ప్రసంగాలు చెయ్యలేదు.

(ఇంకా ఉంది)

–డా.చల్లా భాగ్యలక్ష్మి
సెల్: 88850 55528



# జాంకాయలాఫీసర్!

**ఎట్టకేలకు కరటకం ఆఫీసరయ్యాడు! మిగిలిన సర్వీసు రెండేళ్ళే. అదిచాలు అధికారిగా ఆధిపత్యం అనుభవించడానికి అనుకున్నాడు. నిలువెల్లా అహంభావం నింపుకున్నాడు. మంచితనం, మానవత్వం అన్న పదాల్ని పాదాల కింద తొక్కేశాడు. ఒక్కముక్కలో చెప్పాలంటే కరటకం కర్కోటకం అయ్యాడు!**

కరటకానికి రెండు క్షణాల్లా, సిబ్బందికి రెండు యుగాల్లా కాలం ముగిసింది!

అంటే రిట్టైరయ్యాడన్న మాట!

సభ చేసినవాళ్ళు లేరు, వీడ్కోలు పలికినవాళ్ళు లేరు. ఎవరు విసిరేశారోగానీ వాడినపూలు వీడిన దండొకటి వీపుకి కొట్టుకుంది. మాడిన మాడుతో ఇంటికొచ్చిన మర్నాడు పేపరుచూస్తే, పదవీవిర మణ వయసు పెంచుతూ ప్రభుత్వం చేసిన ఆదే శాల ప్రకటన చూశాడు. ఒక్కరోజులో ఆ అవకాశం కోల్పోయాడు. ఎవరో కాళ్లూ చేతులూ కట్టేసి ఒంటి మీదకి తేళ్లూ పాములూ వదిలిపెట్టినంత బాధపడ్డాడు. కుమిలిపోయాడు. కుప్పకూలాడు!

***

నలుగురిలోకి వెళ్తే ఛీదరింపులు ఛీత్కారాలే తప్ప ఆదరంగా పలకరించే మనిషంటూ దగ్గ రికి రావడం లేదు. జనజీవనంలో తలెత్తలేక ఇంటిగోడలకే బల్లి అయ్యాడు. భార్య ఊర డించబోయింది. "వంటవార్పు ఓదార్పుకు" అని విసిగాడు. మానసిక వైకల్యం చోటు చేసు కుంది. ఏదోఒకటి భర్త ఇంటిపట్టునే ఉంటాడను కున్న భార్య ఆనందవల్లి జీవితం విషాదం అయిం దనే చెప్పాలి, ఎందుకంటే, కరటకం జాంకాయ లాఫీసరయ్యాడు!

భర్త మనస్థిమితం కోల్పోయాడని తొందరపడి నలుగురితో చెప్పుకునేట్టు లేదు!

***

చెదిరిన భర్త ప్రవర్తనకు బెదిరిన ఆనందవల్లి దూరపు చుట్టమైన డాక్టరు చ్యవనప్రాసతో తన గోడు చెప్పుకుంది. "ఈ వ్యాధికి మందు నాదగ్గర లేదు. డాక్టర్ పట్టు పీతాం బరం అని ఓ కుర్ర సైకియాట్రిస్టు. ఆ వైద్యంలో మంచి పట్టున్నవాడు" అని చెప్పి చిరునామా ఇచ్చాడు చ్యవనప్రాస.

పిచ్చి అనే రాయి భర్తచేతిలో ఉంది! వైద్యుణ్ణి రోగినీ ఒక దగ్గరికి తీసుకువచ్చే దారీ తెన్నూ తోచక అలమటిస్తున్న ఆనందవల్లికి కొండంతధైర్యంగా తమ్ముడు ఉత్తాన పాదం వచ్చాడు, అక్కాబావల్ని పండక్కి పిలవడానికి!

"ఏమైందే అక్కా. ఏదో దిగులుగా కనిపిస్తున్నావు, బావేడీ" అడిగాడు ఉత్తానపాదం.

"జాంచెట్ల తనిఖీలో ఉన్నాడురా" చెప్పింది ఆనంద వల్లి ముఖం మీద ఆనందాన్ని అల్లి. అదేం పెద్ద తోట కాదు, ఉన్నది రెండు చెట్లు! తనిఖీ ఏంటో అర్థం కాలేదు ఉత్తానపాదానికి.

"బావా" అంటూ ఇంటి వెనక్కు వెళ్తున్న తమ్ముణ్ణి ఆపి సంగతి వివరించింది ఆనందవల్లి.

***

ఆఫీసు గది! పిల్ల తలుపులు! ముందు స్టూలు, ఏదో నోటీస్ బోర్డు. ఆ వాతావరణం చూసి, వచ్చింది బావదగ్గరికి అనే స్పృహ కోల్పోయాడు ఉత్తానపాదం. ఎక్కడనుంచి వచ్చారు. ఏ పని మీద వచ్చారు, ఎవర్ని కలవాలి అనే ప్రశ్నలకు జవాబులు అక్క ఇచ్చిన కాయితం ముక్కమీద నింపాడు.

"సార్ రమ్మంటున్నారు లోపలికి వెళ్ళండి" అని పక్కగదిలోకి వెళ్తున్న అక్కనుచూసి జాలిపడ్డాడు!

***

"నమస్తేసార్" అన్నాడు వినయంగా అక్క చెప్పిన జాగ్రత్తతో.

ఉలుకూ పలుకూ లేదు. కూర్చోమన్న సైగా లేదు. ఆఫీసరుకి ఉండే లక్షణాల్లో అదొకటేమో అను కున్నాడు ఉత్తానపాదం.

అద్దాల బీరువాలోంచి ఫైల్సూ, లెడ్జెర్లూ తొంగి చూస్తున్నాయి. పెద్దపెద్ద అక్షరాలతో.

చిలక్కొట్టిన జాంపండ్ల ఫైలు! ఎండిపడిన ఆకుల ఫైలు! పురుగుపట్టిన ఆకుల ఫైళ్ళు! మిగిలిన ఫైళ్ళేంటో అర్థమైంది ఉత్తానపాదానికి.

ఏ జాంకాయమీద ఎన్ని గోటి గాట్లున్నాయో అనే లెక్కలో తలమునకలై ఉన్నాడు ఆఫీసరు.

తలెత్తిచూస్తే తననే అనుకున్నాడు ఉత్తానపాదం, మందహాసం చేయబోయి ఆగాడు, చాటుగా చూస్తున్న అక్కను చూసి.

"ఏయ్! బీ వన్!" అరుపుగా పిలిచాడు ఆఫీసరు.

"సార్" అంటూ వచ్చి వినయంగా నించుంది అక్క.

"మన ఆఫీసులో అటెండర్ పోస్ట్‌కి పేపరు ప్రక టన ఇమ్మన్నాను ఇచ్చావా? లేదా? ఏమైంది?" కసిరాడు ఆఫీసరు.

"కళ్ళూ కాళ్లూ సరిగాలేని రెండు అప్లికేషన్స్ వస్తే తర్వాత చూద్దాం అన్నారు తమరు" చెప్పింది అక్క.

"అదొదిలేయ్! ఇతనెవరో పనీపాటలేని పోకిరీ వెధవలా ఉన్నా, జులాయ్ వేషాలు వేసే వాడిలా లేడు. వెంటనే ఆర్డర్స్ టైపు చేయి" అని అక్కతోచెప్పి "నీ పేరేంటోయ్" ఏదో కాయితం మీద పిచ్చిగీతలు గీస్తూ అడిగాడు ఆఫీసరు.

"ఉత్తానపాదం సార్!" పిచ్చిగీతల కాయితాల కట్ట చూసి బెంబేలెత్తిపోతూ చెప్పాడు.

"ఆఫ్ట్రాల్ ఆఫీసు బాయ్‌కి పెద్ద పేర్లుండరాదు. ఉత్తపాదూ అని పిలుస్తా. పలుకు".

"ఊతప్పా, అని పిలవండి సార్, క్రికెట్ ప్లేయ ర్ననుకుంటా".

"కిర్రులేదు కెట్టులేదు! ప్రొబేషన్ పీరియడ్లో నువ్వు చేయాల్సిన పని చెబుతా విను".

"చెప్పండి సార్, ఏదైనా చేస్తాను"

"గరీబ్‌రథ్ ఎక్స్‌ప్రెస్ పట్టాలమీద తిరిగినంత సేపూ, నువ్వు రైలు డబ్బాలో, ఇటునుంచటూ, అటు నించిటూ కదులుతుండాలి, నీ భుజంమీద జాంపండ్ల బరువుండాలి. అడిగిన వాళ్ళకు ఉప్పూకారం కలి పిన ముక్కలివ్వాలి. పైసలిస్తారు. తీసుకొచ్చి లెక్క చెప్పాలి. తేడావస్తే తోక కోస్తా, తల తీస్తా".

"అలాగే సార్".

***

"అక్కా, నువ్వు చెబితే ఏమో అనుకున్నాగాని, పిచ్చి పరాకాష్టకు చేరింది. అది కుదరాలంటే బుజు



# సరదా కథ 17

**రాజా సెల్: 9849863672**

మార్గం ఒకటే" లో శబ్దంతో అన్నాడు ఉత్తాన పాదం.

"ఏమిట్రా అది" ఆందోళనగా అడిగింది ఆనంద వల్లి.

"ఇంటి చుట్టుపక్కలెక్కడా చెట్టు అన్నమాటే లేకుండా చేయడం".

"వామ్మో! ఆ పని చేయకురో! పిచ్చిలో మంచి లాగా మనిషికి మాటన్నా ఉంది. అది పోయి మూకీ చేష్టల్లోకి దిగాడనుకో..." గాభరాపడింది ఆనందవల్లి.

'తరు'ణోపాయం దొరికినట్టుగా, పెదిమమీద ఆలోచనగా ఉన్న వేలు ఆనందంగా గాల్లోకి విసి రాడు ఉత్తానపాదం.

"ఏదైనా, చెప్పిచేయరా, నా తండ్రీ" అంది ఆనందవల్లి.

"చెప్పేదికాదు, ఇది పాండవుల జెండామీద ఉన్నాయనతో పని" అన్నాడు.

***

పొద్దున్నే ఇంటి వెనక్కువెళ్ళిన కరటకం కెవ్వుకేక పెట్టి, కళ్ళు తేలేసి కిందపడి, గిలగిలా కొట్టుకుంటు న్నాడు. ఒక్కగంతులో వచ్చిన ఆనందవల్లి చెట్లనూ భర్తనూ చూసింది.

"ఎప్పుడూ లేని కోతులు ఎక్కడ నుంచి వచ్చాయో, ఏంటో! ఇలవేల్పుల్లా ఉన్న చెట్లని నీడ పట్టు కూడా లేకుండా కకావికలం చేసిపెట్టాయి. సమయానికి లేడు, వీడెక్కడి కెళ్ళాడో ఏంటో" గాల్లోకి ఆర్తనాదాన్ని విసిరి, భర్త తలని ఒళ్ళోకి తీసుకుంది.

"ఎక్కడికీ వెళ్ళలేదక్కా! ఇదిగో, ఇదేదో జరుగు తుందని ముందే ఊహించి, డాక్టరు గారిని తీసు కొచ్చా" అంటూ వచ్చాడు ఉత్తానపాదం.

కదలకుండా పట్టుకోమనిచెప్పి, మత్తు ఇంజెక్షనిచ్చి కరటకాన్ని మంచంమీద వాల్చాడు డాక్టరు పట్టు.

***

"ఏమండీ, అని పిలిచినందుకే చార్జిషీటు ఇచ్చా డండీ, ఇప్పుడేం ఇస్తాడో ఏంటో" అంది ఆనంద వల్లి, డాక్టరు పట్టుతో భర్త సంగతి చెబుతూ.

"నేను బావా అని నోరు విప్పినందుకే, చెట్లెక్కి మొత్తం ఆకులూ, చిగుళ్లూ లెక్కబెట్టి చెప్పమన్నా డండీ" తన అనుభవాన్ని మాట చేశాడు ఉత్తాన పాదం "చెప్పాననుకోండి" అని ముగిస్తూ. అంతా ఓపిగ్గా విన్న డాక్టరు పట్టు "కొందరు కొన్నిహోదాలు శాశ్వతం అనుకోవడంతో ఇటువంటి మానసిక ప్రకోపాలు చెలరేగుతుంటాయి. పెద్దపెద్ద పదవుల్లో ఉండి గతించినవాళ్ళ వారసుల్లో కూడా ఇటువంటి వక్రతలు చూశాను నేను. కొందరు తొందరగా కోలుకుంటారు. కొందరు మా చేతులు దాటిపోయి పిచ్చాసుపత్రుల్లో చేరుతుంటారు" అని చెప్పాడు.

"ఈ కేసు ఏ టైపో, అసలు బావ మూతి మీసం ఆ హిట్లర్ మీసాలే. దీనికంతటికీ అదే కార ణమై ఉంటుంది" చూపు చూపులో లేకుండా అన్నాడు ఉత్తానపాదం రేజర్‌కోసం వెళ్తూ.

"నువ్వాగరా! రేపు మా కూతురూ అల్లుడూ, కొడుకూ కోడలూ పిల్లలతో విమానాల్లో దిగుతున్నారు. వాళ్ళకేం మర్యాద జరుగుతుందోనని బెంగగా ఉంది డాక్టరు గారూ" అంది ఆనందవల్లి.

"చెప్పరేం, ఇంట్లో పదిమంది ఉంటేనే, ఇటువంటి

> **ఎట్టకేలకు కరటకం ఆఫీసరయ్యాడు. ఆ రెండేళ్ళూ కిందివారందరికీ పీడకుడే అయ్యాడు. రిటైరైన కరటకానికి ఒక్కడంటే ఒక్కడైనా వీడ్కోలు చెబితే ఒట్టు! పులిమీద పుట్రలా ఒక్క రోజు తేడాలో పదవీవిరమణ పెంపు అవకాశం కోల్పోయాడు. కుమిలి పోయాడు. కుప్పకూలాడు. ఆపై జాంకాయలాఫీసరయ్యాడు. అప్పుడు మొదలయ్యాయి తిప్పలు ఆనందవల్లికీ, ఉత్తానపాదానికీ! మరి వాళ్ళేం చేశారు?**

లోపాలు సరిదిద్దుకుంటారు" అన్నాడు డాక్టరు పట్టు.

"ఆఫీసు వాతావరణాన్ని ఏ పీసుకాపీసు చేయ మంటారా" అడిగాడు ఉత్తానపాదం మరుక్షణంలో ఆ పని చేద్దామన్న ఆవేశంతో.

"అప్పుడే వద్దులే" అని, ఎవరెలా ఉండాలీ, ఎవరు ఏ జాగ్రత్త తీసుకోవాలీ అనే బాధ్యతతో ఉండమని ఉత్తానపాదానికి చెప్పివెళ్ళాడు పట్టు.

***

విరగకాసి గుబురుగా ఉన్న జాంచెట్ల ఫొటోల్ని పెద్దసైజులో ఫ్రేం కట్టించి, లేచి కూర్చున్న కరటకం కళ్ళకు విందు చేస్తూ "ముంబాయి నుంచి ఎండీ గారు వస్తున్నార్ సార్" అన్నాడు ఉత్తానపాదం.

"అమ్మో! ఏర్‌పోర్ట్‌కి వెళ్ళాలి" అన్నాడు హడా విడిగా తయారవబోతూ.

"నా మీసకట్టు" అని కేకేశాడు. అద్దంలోంచి ముఖం తిప్పుతూ కరటకం.

"రాత్రి మీరు గట్టిగా తుమ్మారు సార్".

"తుమ్మితే ఊడేది ముక్కంటార్రా; అజ్ఞాన్".

"ఇప్పుడు మీస మీమాంసకు టైం లేదు సార్, విమానం ల్యాండయిందట".

***

"నీ పేరేంటోయ్, వ్యాకరణ దోషంలా ఉంది" అల్లుడుగారన్నారు ఎండీ హోదాలో.

"మీకు తోచినట్లుగా పిలవండి సార్" వినయ భూషణంగా అన్నాడు కరటకం.

"మిస్టర్ టకటకం! నీ ముక్కూ చెవీ నాకు ఏ మాత్రం నచ్చలేదోయ్".

"మీకు నచ్చిందాకా ప్లాస్టిక్ సర్జరీ చేయించు కుంటా సార్".

"ఆఫీసు మెయింటెనెన్స్ అధ్వానంగా ఉంది".

"నా కింద పని చేసే వాళ్ళు..."

"ఆ భాషేంటి అసహ్యంగా, నిన్ను డిస్‌మిస్ చేస్తున్నాను".

"ఇంకెప్పుడూ అనను సార్".

"అందుక్కాదు, పుట్టిన తేదీ తారుమూరు చేసి ఉద్యోగంలో కొనసాగుతున్నందుకు! ప్రజాధనం నష్టం చేస్తున్నందుకు".

"సార్! సార్! ఏదో కక్కుర్తిపడ్డాను సార్! భార్యాపిల్లలు గలవాణ్ణి, పొట్ట మీద కొట్టకండి సార్".

"అందులో కూడా అవకతవకలేమన్నా ఉన్నాయా".

"అంతా కర్మే సార్".

"ఏదీ వాళ్ళ పేర్లూ వివరాలూ చెప్పు".

సుడిగుండంలో పడ్డవాడిలా గిరగిరా తిరిగి సోలిపోయాడు కరటకం.

ఓ మత్తుగోలీ కరటకం నోట్లో వేశాడు ఉత్తాన పాదం.

కరటకాన్ని ఎత్తుకెళ్ళి గదిలో పడుకోబెట్టి, ఆఫీసు వాతావరణాన్ని ఆనవాలు లేకుండా చేసి, మత్తులో ఉన్న బావని పట్టుబట్టల్లోకి మార్చి తిలకం దిద్దాడు ఉత్తానపాదం.

***

కరటకం తేరుకోగానే ఆత్మీయతలూ, అను రాగాలూ, ఆప్యాయతలూ చుట్టూ వికసించి గుబా ళించాయి.

కరటకం మామూలు మనిషయ్యాడు!

ఆనందాలు పండగ చేసుకున్నాయి.

***

కరటకం ఇప్పుడేం చేస్తున్నాడని అడిగే వాళ్ళకు సమాధానం కౌన్సెలింగ్!

ఎవరికీ అంటే ఆఫీసర్లై శిక్షణలో ఉన్నవారికి...! తన తరహాలో వారికి మాత్రం కాదు, కాదండో!



# దగ్గరయ్యే దారులెన్నో

**ప్రతి ఒక్కరూ తమ భాగస్వామితో జీవితాంతం హ్యాపీగా, రొమాంటిక్‌గా ఉండాలని కోరుకుంటారు. కానీ నేటి కాలంలో భార్యాభర్తల మధ్య ఆ ఆసక్తి తగ్గుతోంది. తరచు గొడవ పడడం, పోట్లాడటం, వాదించుకోవడం వంటి సమస్యలు ఎదురవుతున్నాయి. కొన్నిసార్లు భార్యాభర్తల మధ్య సమస్యలు లైంగిక జీవితంపై ప్రభావం చూపిస్తున్నాయి.**

ఒకరి గురించి ఒకరు అర్థం చేసుకోలేకపోవడం, బిజీ షెడ్యూల్స్ కారణంగా, సరదాగా, గడిపే తీరిక లేకపోవడం వల్ల ఇద్దరి మధ్యా ఒత్తిడి కూడా వాగ్వా దాలకు కారణమవుతోంది. అయితే ఇలాంటి సమస్యలేవీ లేకుండా ఇద్దరూ ప్రశాంతంగా హ్యాపీగా రొమాంటిక్ లైఫ్ ఎంజాయ్ చేయాలంటే కొన్ని విషయాలు పాటించాలని రిలేషన్‌షిప్ నిపుణులు చెబుతున్నారు. అవేంటో మీరూ తెలుసుకోండి!

### భోజనానికి ముందా? వెనకా?

శృంగారం ఆరోగ్యకరమైనది. శరీరంలోని టాక్సిన్స్ అన్నీ ఆ సమయంలో విడుదలైపోవడం, రక్తప్రసరణ బాగా జరగడం వల్ల మనిషిని ఆరోగ్యవంతుణ్ణి చేస్తుంది శృంగారం. అయితే శృంగారం భోజనానికి ముందు చేస్తే మంచిదా లేక తర్వాత చేస్తే మంచిదా? అనే సందేహానికి మనం తీసుకునే ఆహారమే సమాధానం. అల్పాహారం, జ్యూస్, ఎనర్జీ డ్రింక్స్ వంటివి శృంగారానికి ముందు తీసుకోవచ్చు. కడుపు నిండుగా తిన్నతర్వాత మాత్రం వెంటనే శృంగారంలో పాల్గొనకూడదు. ఎందుకంటే మన శరీరంలో రక్త ప్రసరణ సహా అన్ని వ్యవస్థలు మనం తిన్న ఆహారం మీదే దృష్టి కేంద్రీకరించి పనిచేస్తుంటాయి. తిన్న వెంటనే శృంగారంలో పాల్గొంటే త్వరగా అలిసిపోతారు. దీంతో శృంగారాన్ని పూర్తిగా ఎంజాయ్ చేయలేరు. ఒకవేళ లిమిట్‌గా తినేవారు, డైట్ ఫాలో అవుతున్న వారికైతే తిన్న తరువాతే శృంగారం మంచిది. అలా అని శృంగారం తర్వాత కూడా వెంటనే ఆహారం తినకూడదు. కొంచెం గ్యాప్ ఇచ్చి శరీరంలోని అన్ని వ్యవస్థలూ రిలాక్స్ స్టేజికి వచ్చాక తినాలి. అప్పుడు కూడా తక్కువగానే తినాలి. లేకుంటే ఊబకాయం వచ్చే అవకాశాలు ఎక్కువ. ఎక్స్‌ప్రెస్ మ్యాగజైన్ వారు నిర్వహించిన సర్వే ప్రకారం, మగవారిలో 41శాతం మంది తినడానికి ముందే శృంగారం ఇష్టపడతారు కానీ ఆడవారిలో 61 శాతంమంది తిన్న తర్వాతే శృంగారానికి ఇష్టపడతారు. లైట్‌గా ఫుడ్ తీసుకున్న తర్వాతే శృంగారం చేయడం ఆరోగ్యవంతమైనదనేదే ఈ సర్వే సారాంశం.

### ప్రతిరోజూ శృంగారం

ఈమధ్యకాలంలో వివాహం తర్వాత ఒకరిద్దరు పిల్లలు పుట్టగానే దాంపత్య జీవితంపై అనాసక్తి పెరుగుతోంది. దీనికి కారణాలు అనేకం. కానీ పూర్వకాలంలో వివాహితులు ప్రతిరోజూ శృంగారంలో పాల్గొనడంవల్ల ఆరోగ్యపరంగా వారికి ఎంతో మేలు జరిగేదని పరిశోధకులు చెబుతున్నారు. అందుకు నాలుగు కారణాలున్నాయి. ఒకటి శృంగారం కూడా ఒక వ్యాయామం. ఇది అందరికీ తెలిసిందే. ఇక రెండోది శ్వాసక్రియ క్రమంగా పెరిగి ఎక్కువ కాలరీల శక్తి కరిగి శరీరం ఫిట్నెస్ సంతరించుకుంటుంది. వారానికి మూడుసార్లు 15 నిమిషాలు వంతున శృంగారంలో పాల్గొంటే ఏడాదికి 7,500 కాలరీల శక్తి పోతుంది. అంటే 75 మైళ్ళు జాగింగ్ చేసినట్టే. ఇక మూడవది శృంగార సమయంలో అధికంగా శ్వాస తీసుకుంటారు. దీనివల్ల శరీర కణాలకు ఆక్సిజన్ విరివిగా లభిస్తుంది. శృంగారంలో ప్రతిరోజు పాల్గొనడంవల్ల ఎనలేని ప్రయోజనాలు ఉంటాయని పలు అధ్యయనాలు తెలియజేస్తున్నాయి. నాలుగవ కారణం దంపతుల మధ్య బంధం పటిష్టం కావడమే కాకుండా పగటిపూట రోజు వారీ పనుల్లో చిరాకు, ఒత్తిడి తగ్గుతుంది. మధుమేహం, గుండెజబ్బులు లాంటి సమస్యల నుంచి కూడా దూరంగా ఉండవచ్చు.

### ఇవీ కారణాలు

సెక్స్ సామర్థ్యం తగ్గిపోవడంవల్ల ఈ కాలంలో చాలామంది సతమతమవుతున్నారు. శృంగార సమయంలో భాగస్వామి అసంతృప్తికి లోనుకావడంవల్ల భార్యాభర్తల మధ్య సంబంధాలు బలహీనపడుతున్నాయి. అసలు ఈ సామర్థ్యం ఎందుకు తగ్గుతుంది? దీనికి కారణాలేమిటి అంటే...

**ఆహార అలవాట్లు:** ఆహారం ఆరోగ్యాన్ని ఎంతో ప్రభావితం చేస్తుంది. అదీ కాక అనారోగ్యకరమైన ఆహారం, ఎక్కువ శాతం జంక్ ఫుడ్ తీసుకోవడం వల్ల సెక్స్ సామర్థ్యం తగ్గిపోతుంది. అనారోగ్యం కూడా సెక్స్‌లైఫ్‌ను ఎంజాయ్ చేయకుండా అడ్డుకుంటుంది. అందువల్ల తగిన మోతాదులో తీసుకునే పోషకాహారమే మన శృంగార జీవితాన్ని, శృంగార సామర్థ్యాన్ని వృద్ధిచేస్తుంది.

**మందుల వాడకం:** చాలామంది మగవారు శృంగార ఉద్దీపనకు ఎక్కువగా మందులు వాడు

### మాంసాహారుల్లోనే ఎక్కువ!

శృంగారం విషయంలో శాకాహార మాంసాహార మహిళలను పోల్చి చూస్తే మాంసాహారం తీసుకునే మహిళలే శృంగారంపై ఎక్కువ ఆసక్తి చూపిస్తారని పరిశోధకులు చెబుతున్నారు. శాకాహారం తీసుకునే వారిలో జింక్ లోపించి వారిలో టెస్టోస్టిరాన్ శాతం చాలా తక్కువగా ఉంటుంది. శాకాహారం తీసుకోవడం వల్ల సెక్స్ కోరికలు తక్కువగా ఉంటాయని పరిశోధకులు చెబుతున్నారు. అయితే మాంసాహారం తీసుకునే వారిలో శరీరంలో కొవ్వు పేరుకుపోతుందని తెలిపారు. కానీ మాంసాహారం తీసుకునే మహిళల్లో సెక్స్ సామర్థ్యం చాలా ఎక్కువ ఉంటుందని, భాగస్వామికి బాగా సహకరిస్తారని పరిశోధనల్లో వెల్లడైంది. కాబట్టి సెక్స్ సామర్థ్యం పెంచుకోవాలంటే పుష్టికర

తుంటారు. ఇలా మందులు వాడేవారు సంభోగం సమయంలో త్వరగా నీరసించిపోతారు. చెమటలు పట్టేస్తాయి. సెక్స్‌పై ఈ మందులు దుష్ప్రభావం చూపిస్తాయి. కొన్ని మందులు సెక్స్ సామర్థ్యం కలిగేలా చూస్తాయి. కాని ఇవి తాత్కాలికమే. వీటిని వాడటంవల్ల రానురానూ పూర్తిస్థాయిలో సమస్యలు ఎదుర్కోవలసి వస్తుంది.

**సిగరెట్, మద్యం:** అతిగా మద్యం సేవించడం, ధూమపానం చేయడం వల్ల శరీరంలో టెస్టోస్టిరాన్ లెవెల్స్ తగ్గిపోతాయి. దీనివల్ల సెక్స్ సామర్థ్యం త్వరగా తగ్గిపోతుంది. ధూమపానం, మద్యపానం వల్ల మగవారిలో వీర్య కణాలు నాశనం అవుతాయని అనేక మంది పరిశీలకులు చెబుతున్నారు.

**వ్యాయామలేమి:** వ్యాయామం రోజూ చేయడం వల్ల అనేక రకాల ప్రయోజనాలు పొందగలం. రోజూ వ్యాయామం సెక్స్‌లైఫ్‌కి చాలా మంచిది. అసలు శృంగారమే ఒక వ్యాయామం అని కొందరు పరిశీలకులు అభిప్రాయపడుతున్నారు. రోజూ వ్యాయామం వల్ల రక్త ప్రసరణ బాగా జరిగి చక్కటి శక్తి సామర్థ్యాలు పొందే అవకాశాలున్నాయి.



**స్వయంకృతాపరాధం:** చాలా వరకు మగవాళ్ళు తమ భాగస్వాముల్ని నిర్లక్ష్యం చేస్తుంటారు. దీనివల్ల వైవాహిక జీవితం, కుటుంబ జీవితం నాశనమవుతాయి. అంతేకాక ఇలా ఉంటే ఆందోళన ఒత్తిడి పెరిగి మరిన్ని శృంగార సమస్యలు ఎదుర్కోవాల్సి వస్తుంది. రానురాను వయసు పైబడే కొద్దీ ఎక్కువ సమస్యలు ఎదుర్కోవాల్సి వస్తుంది.

**ఆందోళన, ఒత్తిడి:** ఆధునిక మానవుడికి ఒత్తిడే అతిపెద్ద శత్రువు. ఎక్కడ చూసినా సరే ఉక్కిరిబిక్కిరి చేసే ఒత్తిడి మనిషిని ఆవహిస్తోంది. దీన్ని సమర్థంగా ఎదుర్కోవడం అవసరం. ఈ ఒత్తిడి మనల్ని కబళించకుండా అడ్డుకోవడం అత్యవసరం. ఒత్తిడికి గురైనప్పుడు ముందుగా మన నాడీ వ్యవస్థ చాలా తీవ్రంగా స్పందిస్తుంది. కార్టిజోల్, అడ్రినల్ అనే శక్తిమంతమైన హార్మోన్లు పెద్దమొత్తంలో విడుదలవుతాయి. దీంతో గుండెవేగం, శ్వాసవేగం, రక్తపోటు పెరుగుతాయి. కండరాలన్నీ సంకోచించి బిగుతుగా అవుతాయి. దీనివల్ల ఇతర పనులతోపాటు శృంగారంపై కూడా ఆసక్తి తగ్గిపోతుందని పరిశీలకులు చెబుతున్నారు. కాబట్టి వీలైనంత వరకు ఒత్తిడి తగ్గించుకోవడం మేలు.



మైన ఆహారంతోపాటు మానసిక ఆరోగ్య పరిస్థితి కూడా బాగుండేలా చూసుకోవాలని పరిశోధకులు సూచిస్తున్నారు.



## శృంగారం తర్వాత నిద్రెందుకు?

శృంగార సమయంలో శరీరం సాధారణంగా రిలాక్స్ అవుతుందని పరిశీలకులు చెబుతున్నారు. అలాగే మెదడు కూడా ఆందోళన, తెలియని భయాలకు గురవుతుంది. కాబట్టి శృంగారం చేసిన వెంటనే మగవారు నిద్రపోతారు.

శృంగారం సమయంలో మగవారి మెదడులో కొన్ని రకాల కెమికల్స్ విడుదల అవుతాయట. ప్రొలాక్టిన్, వాసోప్రెస్సిన్, నైట్రిక్ ఆక్సైడ్ , సెరటోనిన్, ఆక్సిటోసిన్ విడుదల కావడం వల్ల మగవారికి నిద్రపోవాలనిపిస్తుందని అధ్యయనాలు చెబుతున్నాయి.

**అధిక బరువు:** అధిక బరువు కూడా నేటి కాలంలో చాలామందిని వేధిస్తోంది. ఊబకాయం వల్ల వచ్చే సమస్యలు అన్నీ ఇన్నీ కావు. అధిక బరువు శృంగార సామర్థ్యాన్ని తగ్గిస్తోందని అనేక పరిశోధనలు వెల్లడిస్తున్నాయి. అందుకని బరువు తగ్గించుకోవడం వల్ల శృంగార సామర్థ్యం పెంపొందించుకోవచ్చు.

**ఇవి చేయండి:** ఆరోగ్యవంతమైన శృంగారం అన్నివేళలా మేలు చేస్తుంది. మరి శృంగారంలో మధురిమలు చవిచూడాలంటే కొన్నింటిని పాటించి చూడండి. అవేంటంటే..

**ఆరోగ్యకరమైన ఆహారం:** అలసిపోయి ఇంటికొచ్చిన వెంటనే మనకు నచ్చిన స్వీట్స్ తీసుకోవడం ద్వారా స్టామినా పెంచుకోవచ్చని తద్వారా రోజంతా కోల్పోయిన శక్తిని తిరిగి పొందవచ్చని ఆరోగ్య నిపుణులు అభిప్రాయపడుతున్నారు. శృంగారానికి ముందు ఆకుకూరలు, చేదుగా వగరుగా ఉండే కూరగాయలు తినడం కన్నా కొన్ని ఆరోగ్యకరమైన తీపి పదార్థాలు తీసుకోవడం మంచిదని చెబుతున్నారు. శృంగారానికి ముందు ఒక గ్లాస్ బాదం మిల్క్ తాగడంవల్ల మంచి శక్తి లభిస్తుంది. ఫిగ్స్ లేదా అత్తిపండులో అమినో యాసిడ్స్ పుష్కలంగా ఉంటాయి. అవి కూడా తీసుకుంటే మంచిది. డార్క్ చాక్లెట్, ఆక్రోట్, తేనె, క్యారెట్, వాటర్‌మిలన్, దానిమ్మ, బొప్పాయి, ఖర్జూరం వంటి ఫ్రూట్స్, సలాడ్ రూపంలో తీసుకుంటే మంచి ఫలితం ఉంటుందని శరీరానికి కావల్సిన శక్తి సమకూరుతుందని ఆరోగ్య నిపుణుల అభిప్రాయం.



### పుస్తకాలు చదవండి!

రొమాంటిక్ పుస్తకాలు, నావెల్స్ చదవడం, అందులో ఉండే క్యారెక్టర్స్‌ను మనకు ఆపాదించుకుని మనసులో మనకు మనమే సెక్స్‌లైఫ్ గురించి ఓ ఆలోచన ఏర్పరుచుకోవాలి. ఫలితంగా శృంగార సమయంలో మంచి ఆలోచనలు వచ్చే అవకాశాలు ఉన్నాయి.



### ఉదయం పూట శృంగారం మేలు

ప్రాతఃకాలంలో శృంగారం ఆరోగ్యకరం అని ఓ అధ్యయనంలో వెల్లడైంది. రాత్రిపూట నిద్రతో రిలాక్సేషన్ పొందిన దేహానికి సహజంగానే తెల్లవారే సరికి శృంగార వాంఛ పెరుగుతుందని, ఇది ప్రతి ఒక్కరికి అనుభవమే అని పరిశోధకులు వివరించారు. నిద్రతో లభించిన సాంత్వనతో శృంగార సంబంధమైన హార్మోన్ల విడుదల పెరుగుతుంది. తద్వారా కాంక్ష పెరుగుతుంది. అలాంటి సమయంలో కలయిక వల్ల ఆనందం స్థాయి పెరుగుతుంది. సమయానికి భోజనం, తగినంత నిద్ర ఉండడం, వారంలో ఐదుసార్లు వ్యాయామం చేయడం వల్ల శరీర ఆరోగ్యానికి ఎన్ని లాభాలున్నాయో లేలేత కిరణాలు తాకే వేళ శృంగారంలో పాల్గొనడంవల్ల అన్నే లాభాలుంటాయని అధ్యయనవేత్తలు చెబుతున్నారు. దీనివల్ల రోగనిరోధక శక్తి మెరుగుపడుతుంది. ఆక్సిటోసిన్ పెరుగుతుంది. ఆక్సిటోసిన్ ఫీల్ గుడ్ కెమికల్. దీనివల్ల శరీరానికి కొత్త ఉత్తేజం కలుగుతుంది.



—విజేత

# కుమాతా...

-గొర్లి శ్రీనివాసరావు

**ఆ ఊరు మంచుదుప్పటి కప్పుకున్నట్లు వణుకుతోంది. అదేం విచిత్రమోగాని అక్కడ ఎండలూ ఎక్కువే, చలికూడా ఎక్కువే. అయితే చలికాలంలో ఆ ఊరు అందంగా అలంక రించుకుంటుంది. ఎటుచూసినా పుష్పించేవనాలతో కళ్ళకు అందాలవిందు చేస్తుంది ఆ ఊరు. ప్రతి ఇంటిముందు అక్కడ కనీసం బంతిపూలైనా కనిపిస్తాయి. నవ్వు మొఖంతో పలకరిస్తుంటాయి. పెద్దపెద్ద దాలియాలు, రంగురంగుల గులాబీలు, ఇంకా పేరు తెలియని వింత వింత పుష్పాలతో ప్రతిమొక్కా సంతోషంగా ఉంటుంది.**

అంత అందమైన వాతావరణంలో కూడా ఎందుకు కొందరు దుఃఖాన్ని వేటాడి సొంతం చేసుకుంటారో ఎవరికీ అర్థం కాదు. అన్నీ సాదాసీదాగా ఉంటే మజా ఏముంటుంది అనుకుంటుందేమో విధి. కొందరిని ఆశ వెంట పరుగెత్తిస్తుంది. మరికొందరిని దురాశ చుట్టూ గిరికీలు కొట్టిస్తుంది. అయితే ప్రకృతి ఉన్నంత అందంగా మానవనైజం కూడా ఉంటే ఎంత బాగుంటుంది. అలాగే ఉంటే ఇక అది స్వర్గమే కదా!

అరోజు గుడిలో పూజారిగారితో కాస్త ఏకాంతంగా మాట్లాడాలని మాయ వేచి ఉంది. తన సమస్యలు ఆయనతో చెప్పుకుని ఊరటపొందడం అనే అలవాటు ఆమెకు పెళ్ళై ఆ ఊరు వచ్చినప్పటి నుంచీ ఉంది. అప్పట్లో ఆ పూజారికి నలభైయేళ్ళు ఉండేవేమో. మాయకు పెళ్ళై ఇప్పటికి ముప్పై రెండేళ్ళు. ఆమెకు ఒక కొడుకు, ఒక కూతురు. కొడుకు పేరు కాళిదాసు, కూతురు కృష్ణ.



ఆమె భర్త ఇప్పుడులేడు. అతను గతించి తొమ్మిదేళ్ళు అవుతోంది. ఆయనపేరు ఆమె ఎప్పుడూ పలకలేదు. ఇప్పుడు పలకవలసిన అవసరం కూడా లేదు.

ఆ ఊరిలో ఎక్కువగా కాళీమాత మందిరాలే ఉన్నాయి. కొన్ని మందిరాలలో కాళీమాత భయంకరరూపంలో దర్శనం ఇస్తుంది. కానీ ఈ గుడిలో అమ్మవారు సౌమ్యరూపంలో దర్శనం ఇస్తుంది.

అమ్మవారికి పూజారి హారతి ఇచ్చి అందరికీ ప్రసాదాలు పంచిన కొద్దిసేపటికి అందరూ వెళ్ళిపోయారు. ఆ రాత్రి చలి మామూలుకంటే ఎక్కువగా ఉంది. నేలపైన కాళ్ళు పెడితే ఐసుగడ్డలపై నుంచున్నట్టు ఉంది. మాయ తలకి మఫ్లర్ చుట్టుకుని భుజాలచుట్టూ షాల్ కప్పుకుని ఉంది. గుడిలో అరుగుమీద కాళిదాసు కూర్చుని ఉన్నాడు.

'ఏంటమ్మా, ఏదో మాట్లాడాలి అన్నావు?' అన్నాడు పూజారి.

'మా అమ్మాయి విషయం ఎప్పటినుంచో మీతో చెప్పాలి అనుకుంటున్నా దాదా' అంది మాయ.

కాళిదాసువైపు ఒకసారి చూసి, 'అబ్బాయి విషయం ఏమిటి? ఉద్యోగం ఏమైనా దొరికిందా?' అన్నాడు పూజారి.

మాయ కూతురుకి తండ్రి మరణానంతరం అదే డిపార్ట్‌మెంట్‌లో ఉద్యోగం దొరికింది. అప్పుడు ఆమె వయసు ఇరవై ఒకటి. డిగ్రీ ఫైనల్ ఇయర్ చదువుతూ ఉండేది. కాళిదాసు ఇంటర్ ఫైనల్‌లో ఉండేవాడు. కావాలంటే అబ్బాయికే ఉద్యోగం ఇప్పించవచ్చు. కానీ మాయ కూతురుకి ఉద్యోగం ఇప్పించాలనుకుంది. అప్పుడు తన దగ్గరకు సలహా కోసం వస్తే, కొడుక్కి ఇప్పించమన్నాడు తను. కాని తన కొడుకు ఐ.ఎ.ఎస్ అవుతాడనీ, ఒకచిన్న ఉద్యోగంలో పెట్టి వాడి భవిష్యత్తు నాశనం చేయననీ చెప్పింది మాయ.

కృష్ణకు ఆ ఉద్యోగం వచ్చి ఇప్పటికి తొమ్మిదేళ్ళు అవుతోంది. క్రమేపీ ఆమె సూపర్‌వైజర్ స్థాయికి ఎదిగింది. ఈలోగా కాళిదాసు ఇంజనీరింగ్ పూర్తిచేశాడు. మూడుసార్లు సివిల్స్‌కోసం ప్రయత్నించాడుగానీ ప్రిలిమ్స్ కూడా దాటలేకపోయాడు. అతను వేరే ఏదైనా ఉద్యోగంకోసం ప్రయత్నిస్తే మంచిదని తను సలహా ఇచ్చాడు. కానీ మాయకు అది నచ్చలేదు. కాళిదాసుకూడా ఖాళీగా ఉండడానికి అలవాటు పడినట్టున్నాడు.

ఇప్పుడు మాయ తన సమస్య అంతా తన కూతురు కృష్ణ అన్నట్లు చెపుతోంది.

'ఇంకాలేదు. ఈలోపు ఆ కృష్ణ మమ్మల్ని బాగా సతాయిస్తోంది. ఆ టెన్షన్‌లో వాడు పాపం ఎంత కష్టపడినా ఫలితం ఉండటం లేదు. మమ్మల్ని ప్రశాంతంగా ఉండనివ్వదుకదా అది' అంది మాయ.

'మళ్ళీ ఏమైంది?' అన్నాడు పూజారి.

'మీకు తెలుసుకదా దానికి వాళ్ళ నాన్న ఉద్యోగం ఇప్పించాను నేను. అయినా దానికి విశ్వాసం లేదు. నేను వద్దన్నా ఆ గోపాల్‌ని పెళ్ళి చేసుకుంది. ఇప్పుడు అతనితో పాటు కలకత్తా వెళ్ళిపోవ

డానికి పథకం వేస్తోంది' అంది మాయ.

'ఓ, అలాగా! అయినా ఈడు వచ్చిన అమ్మాయికి పెళ్ళి చేయాలికదా? తనకు నచ్చినవాణ్ణి చేసుకుంటే తప్పేముందిలే' అన్నాడు తేలికగా తీసివేస్తూ.

'అయ్యో దాదా, నీకు అర్థం కావడంలేదు. ఇది వరకు ఒక గూండా మాయని వేధిస్తున్నాడని ఆయన, నేను వచ్చి మీకు చెప్పాము, గుర్తుందా?' అంది మాయ.

పూజారి ఒకసారి బుర్రగోక్కుని 'అవును గుర్తొచ్చింది. ఆమె టెన్త్ చదివేటప్పుడు ఎవరో ఆమెని దారికాచి అల్లరి చేస్తున్నాడని చెప్పింది. అప్పుడు నువ్వు, మీ ఆయన వచ్చి నాకు చెప్పారు. అ అబ్బాయి వాళ్ళ నాన్నతో మాట్లాడాము అతన్ని కంట్రోల్‌లో పెట్టమని' అన్నాడు పూజారి.

'ఆ, అతనే! అప్పటినుంచి దాన్ని సతాయిస్తూనే ఉన్నాడు. తనని విడిచిపెట్టమని అది ఎంత బతిమాలినా దాన్ని వదిలిపెట్టేవాడుకాదు. ఒక్కోసారి అది ట్యూషన్ నుంచి రావడం కూడా లేటైపోయేది. ఆయన బ్రతికున్న రోజుల్లో రోజూ ఆయనే ట్యూషన్‌కి వెళ్ళి దాన్ని వెంట పెట్టుకుని వచ్చేవాడు. కాని అది డిగ్రీలో చేరాక బస్సులో అసన్‌సోల్ వెళ్ళి వచ్చేది. ఆ రోజుల్లో దాన్ని బాగా అటకాయించేవాడు ఆ గూండా. రోజూ ఇంటికివచ్చి పాపం ఏడ్చేదిపిల్ల. అది ఉద్యోగంలో చేరిన తర్వాత కొద్దిగా తగ్గింది. అది కూడా స్కూటీ మీద వచ్చేది కాబట్టి త్వరగా వచ్చేసేది. కాని ఆ మధ్య మళ్ళీ మొదలైంది. ఒకటి రెండు సార్లు పోలీస్ కంప్లైంట్ కూడా ఇస్తానని వెళ్ళింది. కానీ ఆ పోలీసులు అలాంటి గూండాలతో లాలూచీ అనుకుంటా! వాళ్ళు కూడా ఏమి చేయలేకపోయారు' అంది మాయ.

తను ఆమెను ఆపకపోతే ఆమె ఆ ఫ్లాష్‌బ్యాక్‌లోనే ఉండిపోతుందని భయపడ్డాడు మాయ మనస్తత్వం తెలిసిన పూజారి. 'అది సరేలే ఇప్పుడు నీకువచ్చిన సమస్య ఏమిటి?' అన్నాడు కొంచెం అసహనంగా.

'ఏముంది దాదా? అది కలకత్తా వెళ్ళిపోతే మాకు ఇబ్బంది కదా? అది ఇక్కడే ఉండి మమ్మల్ని చూసుకోవాలి కదా. ఇలా అర్థాంతరంగా మమ్మల్ని వదిలి వెళ్తే మేము ఏమైపోవాలి?' అంది మాయ.

'నీకేమి ఇబ్బంది ఉంది? నీకు రూప్‌నారాయణ్‌పూర్‌లో ప్లాట్ ఉంది కదా. నీకొచ్చే పెన్షన్ డబ్బులతో అక్కడ హాయిగా ఉండొచ్చు' అన్నాడు పూజారి.

'అదేంటి దాదా. నాకు ఈ ఊరు బాగా అలవాటు అయిపోయింది. ఇక్కడైతే మీరంతా కనిపిస్తారు. అదీగాక మేము ఉండే ఇల్లు కూడా ఆయన ఉన్నప్పుడు మాకు అలాట్ అయిన క్వార్టర్ కదా. అందుకే ఆయనతో ఉన్న జ్ఞాపకాలన్నీ ఆ ఇంటితోనే ముడిపడి ఉన్నాయి నాకు. అది ఇక్కడినుంచి కలకత్తా వెళ్ళిపోతే మమ్మల్ని ఆ ఇంట్లో ఉండనివ్వరు. అది నేను భరించలేను' అంది మాయ.

'అవును పాపం. నీ బాధ కూడా అర్థం చేసుకోవాల్సిందే. పాపం ఈ వయసులో నీకు కావలసింది నీ జ్ఞాపకాలే కదా మరి' అన్నాడు పూజారి సానుభూతితో.

కాళిదాసు సీరియస్‌గా వాళ్ళిద్దరి సంభాషణ వింటున్నాడు. ఎందుకనోగానీ ఒక్కమాట కూడా అతను మాట్లాడలేదు అప్పటివరకు. అతన్నికూడా ఒకమాట అడుగుదామనిపించింది పూజారికి.

'ఏమయ్యా కాళిదాసు, నీకు ఉద్యోగంవస్తే మీ అమ్మను ఇక్కడ ఉంచి వెళ్ళిపోతావా, లేక నీతో పాటు తీసుకువెళ్తావా?' అన్నాడు పూజారి.

'మా అమ్మను నాతోనే తీసుకువెళ్తాను. కానీ నాకు ఐ.ఎ.ఎస్ వచ్చినప్పుడు ట్రైనింగ్ ఉంటుందికదా, అప్పుడు మాత్రం అమ్మ ఇక్కడే ఉంటుంది' అన్నాడు కాళిదాసు సీరియస్‌గా.

ఐ.ఎ.ఎస్ అంటే ఆమ్లాదహి మార్కెట్‌లో సమోసా కొనుక్కుని తినడం అనుకుంటున్నాడా వీడు అని మనసులోనే నవ్వుకున్నాడు పూజారి. కాని బయటకు మాత్రం గంభీరంగా తల ఊపాడు అతని మాటలు సీరియస్‌గా తీసుకున్నట్లు!

'అదే నేను చెప్పేది దాదా! వాడికి ఆ సర్వీస్ ఏదో వచ్చేస్తే మా దారినమేం పోతాం. అంత వరకు మా బాగోగులు చూసుకోవలసిన బాధ్యత దానిదే కదా! నువ్వేచెప్పు న్యాయం' అంది మాయ మళ్ళీ తన బాధ వెళ్ళబోసుకుంటూ.

'బాగుంది కుటుంబ విషయాలలో న్యాయం చెప్పడం ఏమన్నా సులువు అనుకున్నావా?' అన్నాడు పూజారి, లేనిపోని వివాదాలలోకి తనను లాగొద్దన్నట్లు చూస్తూ.

'అలా అంటే ఎలా చెప్పు? మా కుటుంబానికి నువ్వే పెద్ద దిక్కు కదా! నాకు పెళ్ళై నేను ఈ ఊరికి వచ్చినప్పటి నుంచి మేము గుడిలో దర్బారు తీరిన ఆ అమ్మని, ఆమెని సేవించే నిన్ను నమ్ముకుని ఉన్నాం. మమ్మల్ని నువ్వుగానీ, అమ్మగానీ పొమ్మని తరిమినా పోము' అంది మాయ.

ఆమె మూఢభక్తికి మనసు కరిగింది పూజారికి. 'సరేనమ్మా! ఇప్పుడు నేనేం చేయాలో చెప్పు' అన్నాడు చివరికి.

'ఏమీ లేదు దాదా, ఆ పిల్లదాన్ని పిలిపించి కాస్త గడ్డిపెట్టు. ఈ వయసులో తల్లిని, తమ్ముణ్ణి చూసుకోకుండా తన సుఖమే తను చూసుకుంటానంటే తప్పు అనీ, ఇలాంటి పాపపు పనులు మానుకోమనీ చెప్పు. ఎవడో గూండాగాణ్ణి పెళ్ళి చేసుకోవడమే పెద్ద తప్పు. ఇప్పుడు వాడు రమ్మన్నాడని మమ్మల్ని వదిలి కలకత్తా వెళ్ళిపోతే మా గతేమిటి చెప్పు?' అంది మాయ కన్నీరు ధారాపాతంగా కారుస్తూ.

ఆమె కన్నీరుచూసి కాళిదాసు చలించిపోయాడు. 'అమ్మా ఊరుకో.. నీకు నేను ఉన్నాను. పువ్వుల్లో పెట్టి చూసుకుంటాను. నీకు ఏ లోటూ రానీయను' అన్నాడు కాళిదాసు.

'సరే నేను మాట్లాడతానులే కృష్ణతో. రేపు వచ్చి కలుసుకోమని చెప్పు' అన్నాడు పూజారి.

'అయ్యో దాదా, అది మాదగ్గర ఎందుకు ఉంటుంది? అది రూప్‌నారాయణ్‌పూర్‌లో ఆ గూండాగాడి ఇంట్లో ఉంటుంది. దాన్ని వాడు బాగా కట్టడిచేశాడు. అది మమ్మల్ని చూడడానికి కూడా రాదు. నాకు ఒంట్లో బాగాలేకపోతే కూడా వచ్చి



పలకరించదు. దానిలాంటి దుర్మార్గురాలిని నువ్వు ఇంత వరకు ఎప్పుడూ చూసి ఉండవులే' అంది కొంగుతో కళ్ళు తుడుచుకుంటూ.

ఎంత అన్యాయం అనుకున్నాడు పూజారి. 'సరేలే నువ్వు బాధ పడకు. నేను ఆఫీసుకి కబురుచేసి పిలిపిస్తానులే. మంచిమాట చెప్పి చూస్తాను. ఆపై అమ్మదయ ఎలా ఉంటే అలా' అన్నాడు పూజారి.

'చాలా థాంక్స్ దాదా! నువ్వు చెప్తే దానికి బుద్ధి వస్తుంది. తప్పకుండా అది మారుతుందని నా నమ్మకం. వస్తాను దాదా' అని పూజారికాళ్ళకు మొక్కింది మాయ. కాళిదాసు కూడా పూజారికాళ్ళకు మొక్కి ఆయనిచ్చిన పూలు తీసుకున్నాడు. ఇద్దరూ ఆయన ఇచ్చిన ప్రసాదం నోట్లో వేసుకుని వెళ్ళారు.

***

మరుసటి రోజు సాయంత్రం గుడిలో పూజా సామాను కడిగి శుభ్రంచేసి ఆరబెడుతున్న పూజారికి గుడి ఆవరణలోకి వస్తున్న కృష్ణ కనిపించింది. ఆఫీసునుంచి కొంచెం ముందుగా పర్మిషన్ తీసుకుని వచ్చినట్లుంది అనుకున్నాడు పూజారి. బహుశా ఆఫీసు వదిలిపెట్టే సమయానికి తన గూండా మొగుడి దగ్గరకు వెళ్ళకపోతే ఆమెను బాగా హింసిస్తాడేమో వాడు' అనుకున్నాడు పూజారి.

తూర్పుప్రాంతం కావడాన అక్కడ త్వరగా తెల్లారుతుంది. త్వరగా చీకటి పడుతుంది. విశాల భారతదేశంలో ఒకటే ఇండియన్ స్టాండర్డ్ టైమ్. కానీ అటు పశ్చిమాన ఉన్న గుజరాత్‌లో సాయంత్రం ఏడైనా వెలుతురు ఉంటుంది, ఇటు తూర్పున కల కత్తా నగరిలో సాయంత్రం అయిదు గంటలకే చీకట్లు ముసురుకుంటాయి!



కృష్ణ వచ్చే సమయానికి సూర్యుడు కుంగుతున్నాడు. ఇక అరగంటలో చీకటిగా అయిపోతుంది. చలిగాలి వీస్తోంది. ఒంటి పైనున్న జర్కిన్ ఆమెకు చలినుంచి పూర్తి రక్షణ ఇవ్వడం లేదు కాబోలు చేతులు గుండెలకు దగ్గరగా పెట్టుకుని, తల చుట్టూ తన చున్నీ చుట్టుకునివచ్చి పూజారికాళ్ళకి నమస్కరించింది.

'అమ్మ దర్శనం చేసుకుని రా, అలా కూర్చుని మాట్లాడుకుందాం' అన్నాడు పూజారి.

కృష్ణ ఆలయంలోకివెళ్ళి గంటకొట్టి, అమ్మ వారి ముందు మోకరిల్లి నమస్కరించింది. అక్కడ ఉన్న సింధూరంబొట్టు పెట్టుకుని బయట అరుగుపైకివచ్చి అక్కడ పూజారికి దగ్గరగా కూర్చుంది.

'ఏం కృష్ణా, అంతా బాగున్నారా?' అడిగాడు పూజారి.

**భర్త మరణించడంతో ఆ చిన్న ఉద్యోగం కూతురుకే వేయించింది తల్లి. కొడుకు ఐ.ఎ.ఎస్ పాసై పెద్ద అధికారి అయిపోతాడనుకుందామె. కానీ పదేళ్ళు గడిచిపోయినా ఆ కొడుకు ప్రయోజకుడు కాలేకపోయాడు. ఇక ఆ కూతురు సంపాదనే తల్లికి ఆధారమైంది. అంతలోనే తల్లీ కూతుళ్ళ మధ్య గొడవలొచ్చాయి. మరి ఆ గొడవలు ఎలా సద్దుమణిగాయి? ఆ కొడుకు ప్రయోజకుడయ్యాడా? లేదా?**

'హా దాదా! అంతా బాగున్నాం' అంది కృష్ణ. ఆమె మొఖంలో మబ్బుల్లా కదులుతున్నాయి అనేక సందేహాలు. అలసినట్లున్న ఆమె ముఖంచూస్తే, ఈమెకు వివాహమై భర్తతో ఆనందంగా కాపురం చేస్తున్నట్టులేదు. ఒక గూండాగాడి కబ్జాలో ఉన్నట్లుంది పాపం' అనుకున్నాడు పూజారి.

'మీ అమ్మ వచ్చింది నిన్న. చాలా బాధపడుతోంది' అన్నాడు పూజారి సూటిగా విషయంలోకి వస్తూ.

'నేను ఊహించాను దాదా. చాన్నాళ్ళుగా నన్ను సతాయిస్తోంది మా అమ్మ. చాలామంది దగ్గర నన్ను బద్‌నామ్ చేసింది. ఇప్పుడు మీ దగ్గర కూడా నన్ను చెడ్డదానిలా చూపించాలని ప్రయత్నిస్తోంది' అంది కృష్ణ.

'అంటే నీ తప్పేమీ లేదంటావా? తల్లిని తమ్ముణ్ణి చూసుకోవడం నీ బాధ్యత కదా! వాళ్ళను చూసుకుంటావనే కదా మీ నాన్న జాబ్ నీకు ఇచ్చారు? ఇప్పుడు వాళ్ళను నట్టేట్లో వదిలేసి నీ దారి నువ్వు చూసుకోవడం భావ్యమేనా? చెప్పు' అడిగాడు పూజారి.

'దాదా, మీకు కూడా అలానే అనిపిస్తోందా? మా అమ్మ మాటలు వింటే ఎవరికైనా అలానే అనిపిస్తుంది. నాకు నాన్న ఉద్యోగం ఇచ్చారు నిజమే గానీ, ఆ ఉద్యోగం నాకు ఇమ్మని నేను అడగలేదే? అదే ఉద్యోగం కాళిదాసుకే ఇవ్వొచ్చు. అమ్మ ఉద్దేశంలో కాళిదాసు కొడుకు కాబట్టి గొప్ప చదువులు చదివి ఐ.ఎ.ఎస్ లాంటి పెద్ద ఉద్యోగాలు చేయాలి.

## అప్పుడే బ్రేకప్ చెప్పేసింది

*హీరో హీరోయిన్లకు ప్రేమంటే ఎంత చులకన భావం ఉందో శ్రియ ఉదంతం చూస్తే తెలిసిపోతుంది అంటున్నారు సినీ జనాలు. ఆ మధ్య ఓ క్రికెటర్‌తో క్లోజ్‌గా మూవ్ అయిన శ్రియ ఇప్పుడు అతగాడి పేరు ఎత్తితేనే శివాలెత్తిపోతోందట! ఆ క్రికెటర్‌తో తనకు ఎలాంటి సంబంధం లేదని శ్రియ చెప్పిన మాటలన్నీ పచ్చి అబద్ధాలేనట! అసలు జరిగిన సంగతి వేరే ఉంది అంటున్నారు సినీ జనాలు. ఆ క్రికెటర్‌తో ఒకటి రెండుసార్లు సమావేశం అయిన శ్రియ అతగాడితో వ్యవహారం తనకు సరిపడదని తెలుసుకుందట! కొన్ని విషయాలలో ఇద్దరి అభిప్రాయాలు వేరుగా ఉండడంతో ముందుగానే బ్రేకప్ చెప్పుకోవడం బెటరని శ్రియ డిసైడ్ అయిందట! ఇదే విషయం సన్నిహితుల దగ్గర చెప్పుకొని బాధపడటంతో అసలు విషయం బయటకు వచ్చింది అంటున్నారు. మొదటి మీటింగులో ప్రేమ, రెండో మీటింగులో బ్రేకప్‌గా మారిన శ్రియ ప్రేమ వ్యవహారం ఇప్పుడు హాట్ టాపిక్ అయింది!*

## నవ్వుల పాలైన తమన్నా

'బాహుబలి 2' ప్రమోషన్లలో తమన్నాను పక్కన పెట్టేసిన సంగతి జగద్విదితం. ఈ విషయంలో తమన్నా అలిగిందన్న వార్తలు కూడా జోరుగా షికారు చేశాయి. ఓ దశలో తమన్నా కూడా ఈ విషయం మీద బహిరంగంగానే అసంతృప్తి వ్యక్తం చేసింది. ఆ సినిమా విడుదల తరువాత తమ్మూ మాట మార్చేసింది. ప్రమోషన్ విషయంలో తనను పిలవలేదన్న బాధ తనకేం లేదంటోంది. తను వేరే సినిమా షూటింగ్‌లో ఉండడం వలన పెద్దగా పట్టించుకోలేదని చెబుతోంది. అయినా 'బాహుబలి 2'లో తన పాత్ర నిడివి చాలా తక్కువ కనుక తనను అనవసరంగా ఇబ్బంది పెట్టడం ఎందుకని భావించి ఉండవచ్చని కవర్ చేసుకుంటోంది. తమన్నా ఎంతగా కవర్ చేయాలని ప్రయత్నించినా, బాహుబలి టీం తమన్నాను పక్కకు నెట్టేసిన విషయం అందరికీ తెలుసునని అంటున్నారు. విషయం ఎటూ బయటకి తెలిసిపోయింది కనుక తమన్నా మౌనంగా ఉండి ఉంటే బాగుండేదని సినీ జనాలు అంటున్నారు. తనను అవాయిడ్ చేసిన విషయాన్ని కవర్ చేసుకోవడానికి చేసిన ప్రయత్నం చివరికి నవ్వుల పాలైందంటున్నారు.



నేను కూతురుని కాబట్టి ఏదో చిన్న ఉద్యోగంలోచేరి పనిచేసి వాళ్ళని పోషించాలి. నాన్న ఉద్యోగం నాకు ఎందుకు ఇచ్చారు చెప్పండి, కుటుంబం కష్టాలలో ఉంది ఆదుకోవాలనే... కదా! మరి నేను కూడా ఆ కుటుంబంలోదాన్నేగా... నేను కూడా కష్టంలోనేగా ఉన్నాను. ఉద్యోగం రాగానే నా కష్టాలు తీరిపోయాయి అనుకుంటున్నారా? లేదు దాదా, నా కష్టాలు ఇంకా పెరిగిపోయాయి. నెలంతా ఆఫీసులో కష్టపడి పని చేసి జీతం డబ్బులు తెచ్చి అమ్మచేతిలో పోయాలి. నా జీతం నేను సొంతానికి వాడుకుంటానేమో అని అమ్మ మా ఇద్దరి పేరున జాయింట్ అకౌంట్ తెరిచింది. పాస్‌బుక్, చెక్‌బుక్ తన దగ్గరే పెట్టుకుంది. తర్వాత ఏటీఎమ్ ఫెసిలిటీ వచ్చాక ఆ కార్డు కూడా ఆమె దగ్గరే ఉంది. నా అకౌంట్‌నుంచి డబ్బులుతీసి వాడుకునేది ఆమె మాత్రమే, నేను కాదు. ఇప్పుడు చెప్పండి నేను ఆమెను చూసుకోవడంలేదనే మాట మీరు నమ్ముతారా?' అడిగింది కృష్ణ.

ఆమె మాటలకు షాక్ అయ్యాడు పూజారి. ఇదేమిటి కూతురి జీతం మొత్తం తనే తీసుకుంటూ కూతురిని నిందిస్తూ తిరుగుతోంది ఈ మాయ అనుకున్నాడు. కృష్ణకు పెళ్ళి కానంతవరకు ఆమె జీతం తల్లి తీసుకోవడంలో తప్పులేదు. అయితే కృష్ణ పెళ్ళితోనే మొత్తం సమస్య అంతాను అనిపించింది పూజారికి.

'అది సరేగానీ వెళ్ళి వెళ్ళి ఆ గూండాను ఎందుకు పెళ్ళి చేసుకున్నావు?' అన్నాడు పూజారి.

'అదేంటి దాదా, నా భర్తను గూండా అంటావు. అతను చక్కగా బాంక్‌లో ఆఫీసర్‌గా ఉద్యోగం చేసుకుంటున్నాడు' అంది కృష్ణ నొచ్చుకుంటూ.

'నిజమా! బాంక్ ఆఫీసరా అతను. మరి అలా అయితే నువ్వు మీ అమ్మ చెప్పినట్లు టెన్త్‌లో నిన్ను సతాయించిన గూండాను పెళ్ళి చేసుకోలేదా?' అడిగాడు పూజారి అయోమయంగా!

'దాదా, ఏం చెప్పేది. అతను నన్ను ఎప్పటినుంచో ఇష్టపడ్డాడు. చివరకు వాళ్ళ అమ్మానాన్నలను ఒప్పించి నన్ను పెళ్ళిచేసుకున్నాడు. అలాంటి వాణ్ణి గూండా అని నేను ఎందుకు అంటాను. మా అమ్మ అతన్ని అలా పిలిచి తన అక్కసు వెళ్ళగక్కుతుంది' అంది కృష్ణ చిరాకుగా ముఖంపెట్టి.

'అదేంటి, మరి అప్పట్లో మీ అమ్మానాన్న వచ్చి నీవెంట ఒక గూండా పడుతున్నాడనీ, నిన్ను సతాయిస్తున్నాడని, అతని తండ్రికి చెప్పి అతన్ని కంట్రోల్ చేయమని నన్ను అడిగారు. అప్పుడు నేను అతని తండ్రితో మాట్లాడినట్లు గుర్తు' అన్నాడు పూజారి.

'దాదా, ఒకరోజు అతను నేను స్కూల్‌దగ్గర పార్కులో మాట్లాడుకుంటూ కూర్చుంటే నాన్న కొలీగ్ చూసి నాన్నకు చెప్పాడు. ఇంటికి వెళ్ళాక నన్ను నిలదీస్తే అతను నావెంట పడుతున్నాడని, నన్ను సతాయిస్తున్నాడని చెప్పాను. అతని పేరు వివరాలు అడిగితే చెప్పాను. అయితే అప్పటినుంచి అతన్ని ఒక గూండా అని పిలుస్తూ, నాతో బలవంతంగా పోలీస్ కంప్లయింట్ కూడా ఇప్పించారు అమ్మానాన్నా. అయినా నన్ను తప్పు పట్టకుండా నన్నే ప్రేమించి పెళ్ళి చేసుకున్నాడు అతను. నా బాధ్యత తీరేవరకు నేను పెళ్ళి చేసుకోలేదు. కాళిదాసు ఇంజనీరింగ్ కంప్లీట్ అయిన తర్వాత కూడా మూడేళ్ళు ఆగిన తర్వాతే పెళ్ళి చేసుకున్నాను. నా స్నేహితురాళ్ళంతా ఎంత వైభవంగా పెళ్ళి చేసుకున్నారో తెలుసా! నాఖర్మకి నేను అతన్ని రిజిస్టర్ మ్యారేజీ చేసుకున్నాను. నేను మేజర్ అయ్యాక కూడా నా ఇష్టప్రకారం పెళ్ళి చేసుకోవడం కూడా తప్పేనా?' అంది కృష్ణ.

'అదేంటి మీ అమ్మ అలా ఎందుకు చెప్తోంది మరి! నువ్వు కలకత్తా వెళ్ళిపోవాలనుకుంటున్నావనీ, ఇప్పుడుకూడా వాళ్ళతో ఉండడానికి ఇష్టపడటంలేదనీ అంటున్నారు' అన్నాడు పూజారి. కృష్ణ చెప్తున్న విషయాలు వింటూ ఉంటే మాయపైన అదివరకు ఉన్న సానుభూతిస్థానే కోపం, జుగుప్స కలుగుతున్నాయి అతనికి.

'దాదా ఇప్పుడు అమ్మావాళ్ళు ఉంటున్న క్వార్టర్ ఇదివరకు నాన్నగారి పేరున ఉండేది. ఆయన పోయాక నాకు ఉద్యోగం ఇచ్చి ఆ క్వార్టర్ నా పేరున అలాట్ చేశారు. ఇప్పుడు ఆ క్వార్టర్ నా పేరునే ఉంది. నేను పెళ్ళి చేసుకున్నాక నా భర్తతో ఆ ఇంట్లో ఉండడానికి నాకు అధికారం ఉండాలా వద్దా చెప్పండి. మేమిద్దరం పెళ్ళి తర్వాత నెలరోజులు అక్కడే అమ్మతో కలిసి ఉన్నాము. ప్రతిరోజూ మా అమ్మ ఇంటిని రణరంగంలా మార్చేది. నా భర్తని నానా మాటలు అనేది. నన్ను కూడా బయటకు చెప్పుకోలేని మాటలతో నిందించేది. ఇక అక్కడ ఉండలేని పరిస్థితిలో నా భర్త ఒక ఇల్లు అద్దెకి తీసుకుంటే నేను వెళ్ళి అతనితో ఉంటున్నాను. నా భర్తతో కాపురం చేయడం కూడా నేరమేనా?' అంది కృష్ణ కళ్ళల్లో నీళ్ళు నింపుకుంటూ.

'ఛ ఊరుకోమ్మా, నువ్వు కంటనీరు పెట్టకు. నువ్వు చెప్పింది వింటే మీ అమ్మ ఎంత అమానుషంగా ప్రవర్తించి ఉంటుందో అర్థం చేసుకోగలను. అందుకే పెద్దలు ఇరువర్గాల మాటలు వినకుండా తీర్పు చెప్పకూడదు అనేవారు. మీ అమ్మ మాటలు మాత్రమే వింటే నీపైన చాలా తప్పు అభిప్రాయం వస్తుంది. మొదట నేను కూడా పొరబడ్డాను నీ విషయంలో' అన్నాడు పూజారి.

'మీ తప్పేమీలేదు దాదా, నా టైమ్ బాగోలేదు అంతే' అంది కృష్ణ.

'అది సరే మరి కలకత్తా వెళ్ళాలనుకుంటున్నావని చెప్పింది, అది కూడా అబద్ధమేనా?' అన్నాడు పూజారి.

'లేదు దాదా. అయనకి కలకత్తాకి ట్రాన్స్‌ఫర్ ఉంటుందని తెలిసింది. అందువలన నేను కూడా కలకత్తాకి ట్రాన్స్‌ఫర్ కోసం అప్లై చేశాను. ఆ విషయం నేను మాటల్లో కాళిదాసుకు చెప్పాను. అది విన్నప్పటినుంచీ అమ్మ అలా విపరీతార్థాలు తీస్తూ నాపై దుష్ప్రచారం చేస్తోంది' అంది కృష్ణ.

'ప్చ్ ఏం చేస్తాం. మనుషులకు వయసు పెరుగుతున్నకొద్దీ మనసు బలహీనపడి, రకరకాల మానసికరోగాలు వస్తున్నాయని అనిపిస్తోంది నాకు. మీ అమ్మని కూడా ఎవరైనా మానసికవైద్యుడికి చూపిస్తే మంచిదేమోకదా!' అన్నాడు పూజారి సీరియస్‌గా.

'అలాగనిచెప్తే నన్ను, మిమ్మల్ని డాక్టర్ దగ్గరికి పంపిస్తాను అంటుంది' అంది కృష్ణ నవ్వుతూ.




వాళ్ళు మాటల్లో ఉండగానే స్ట్రీట్‌లైట్స్ వెలిగాయి. చుట్టూ చీకటి కమ్ముకుంది. వాచ్ చూసుకుంటున్న కృష్ణతో, 'వెళ్ళిరా అమ్మా నీకు బాగా లేటయినట్లుంది ఈ వేళ' అన్నాడు పూజారి.

'అలాగే దాదా, వస్తాను' అంటూ ఆయన పాదాలు తాకి నమస్కరించి, మళ్ళీ గుడిలోకివెళ్ళి అమ్మవారికి నమస్కరించి తన స్కూటీ పైన వెళ్ళి పోయింది కృష్ణ.

ఆమె వెళ్ళినవైపే చూస్తూ ఆలోచనలలోకి వెళ్ళి పోయాడు పూజారి. కన్నతల్లి తన కూతురిపై ఇలా అభాండాలు వేస్తుంటే ఇక ఆ కూతురిని ఎవరు రక్షిస్తారు? అనుకున్నాడు. అంతలో ఎవరో భక్తులు దర్శనానికివచ్చి అమ్మవారి గుడిగంట కొట్టేసరికి, ఆ శబ్దానికి ఇహలోకంలోకి వచ్చాడు పూజారి. తనలో సుళ్ళు తిరుగుతున్న ఆలోచనలను తాత్కాలికంగా దూరంగా తరిమేసి అమ్మవారిపూజలో లీనమయ్యాడు. పూజ పూర్తయ్యాక మళ్ళీ కృష్ణ గురించి ఆమెతల్లి మాయగురించి ఆలోచనలు ముసురుకున్నాయి పూజారిని.

అమ్మవారి రూపాన్ని తదేకంగాచూస్తూ ఆమె పాదాల దగ్గర నేలపై పరుండి ఉన్న శివుణ్ణి చూశాడు. శివుడు ఆమె దారికి అడ్డుగా ఉన్నట్లు చెప్తారు. ఆమెను ఆపగలశక్తి ఆ మహాదేవుడికి తప్ప ఎవరికి ఉంది? బీభత్సం సృష్టిస్తూ యుద్ధం చేస్తున్న కాళీమాత అసురులను నిర్మూలించిన తర్వాత కూడా తన మారణకాండ కొనసాగిస్తూ వుంటే సాక్షాత్తూ శివుడు అలా అడ్డం వచ్చాడని, ఆ వేగంలో కాళి అయనను చూసుకోక ఒక అడుగు శివునిపై వేసిందని, తర్వాత నాలుక కరుచుకుని అక్కడే నిలబడి పోయిందని అంటుంటారు.

కానీ మాయలాంటి మనుషులలో దురాశ పెట్రేగిపోతే వాళ్ళు కూడా కాళీమాత చేసినట్లే సర్వనాశనం చేయాలని చూస్తారు. వాళ్ళని ఆపగలిగే శక్తి మరి ఎవరికి ఉంటుందో. ఎవరికైనా నొప్పి కలిగితే 'అమ్మా' అంటారు, కానీ అమ్మే వాళ్ళకి ఆ నొప్పి కలగచేస్తే వాళ్ళు ఎవరిని పిలవాలి? ఆదిశంకరులు దేవి అపరాధస్తోత్రంలో లోకంలో ఎక్కడైనా చెడ్డ కొడుకు ఉండొచ్చు కానీ చెడ్డతల్లి ఉండదు అనే అర్థంలో "కుపుత్రో జాయేత క్వచిదపి కుమాతా న భవతి' అంటారు.

'అమ్మా, నీ ఏలుబడిలో ఉన్న ఈ ప్రాంతంలో మాతృత్వానికి మచ్చతెచ్చే మాయలాంటివాళ్ళు కూడా ఉన్నారమ్మా. అలాంటి వాళ్ళను సరైనదారిలో పెట్టు తల్లీ' అని ప్రార్థించాడు.

***

ఇది జరిగిన ఒక నెలరోజులకు ఆఫీసులో పై అధికారులకు మాయ ఇచ్చిన ఫిర్యాదువల్ల కృష్ణను ఉద్యోగంలోనుంచి తొలగించారని తెలిసింది పూజారికి. చాలా బాధపడ్డాడు. చివరికి తాను ఎంతకాలంగానో సేవిస్తున్న అమ్మవారు కూడా ఏమీ కరుణ చూపలేదని బాధపడ్డాడు. కృష్ణను పిలిచి ఓదార్చాలనుకున్నాడు. కానీ ఆమె భర్తకు కలకత్తా ట్రాన్స్‌ఫర్ అయిందని, ఆమె అతనితో పాటు వెళ్ళిపోయిందని తెలిసింది. మాయతో మాట్లాడాలి అనిపించ లేదు ఆయనకి.

కానీ ఒక రోజు మాయ ఒక్కతే గుడికి వచ్చింది. అమ్మవారికి నమస్కారంచేసి భక్తులు అందరూ వెళ్ళేవరకూ వేచి చూస్తూ కూర్చుంది. ఆమెని పలకరించాలంటే అయిష్టంగా ఉంది పూజారికి. ఆమెతో మాట్లాడితే తనకు కోపం వస్తుందని ఆయన ఉద్దేశం. అయితే అందరూ వెళ్ళేవరకు మాయ అక్కడే కూర్చునే సరికి ఆమెతో మాట్లాడక తప్పలేదు ఆయనకి.

'ఏమ్మా, ఇంకా ఏం కావాలి?' అన్నాడు పూజారి. ఎంత వద్దనుకున్నా తన కన్నకూతురి ఉద్యోగం నిర్దాక్షిణ్యంగా పోగొట్టిందని ఆమెపై పీకలదాకా కోపంగా ఉంది ఆయనకి.

'ఏమీలేదు దాదా! కృష్ణ కలకత్తా వెళ్ళిపోయింది. ఆమె మమ్మల్ని చూడటం లేదన్నమాట డిపార్ట్‌మెంట్ చేసిన ఎంక్వైరీలో ఋజువైంది. ఆమెను ఉద్యోగం నుంచి తీసేశారు' అంది మాయ.

'నాకు తెలుసు. ఇప్పుడు నీ కళ్ళు చల్లబడ్డాయా?' అన్నాడు పూజారి.

'అవును దాదా! ఈ రోజుకి నా మనసు శాంతించింది. కృష్ణకు బదులుగా కాళిదాసుకు ఈరోజే ఉద్యోగం ఇచ్చారు డిపార్ట్‌మెంట్‌వాళ్ళు' అంది మాయ పూజారికాళ్ళకు మొక్కుతూ.

కాళ్ళు వెనక్కి తీసుకున్నాడు పూజారి. ఏదో అనబోయి గంభీరంగా ఉండిపోయాడు.

'దాదా, మీకు నాపైన కోపం ఉందని నాకు తెలుసు. మీకే కాదు కృష్ణకుకూడా నా పైన కోపం ఉంటుంది. అలా ఉండడం కూడా సహజమే! తప్పేమీ లేదు! కానీ నాకు వేరే మార్గం లేదు. కృష్ణకు పెళ్ళి అయింది. ఆమె భర్త మంచివాడు. స్థిరమైన ఉద్యోగం ఉన్నవాడు. కానీ కాళిదాసు పరిస్థితే నాకు ఆందోళన కలిగించింది దాదా. అన్నిసార్లు ప్రయత్నించినా ప్రిలిమ్స్ కూడా పాస్ కాకపోవడంతో బాగా డిప్రెషన్‌కి లోనయ్యాడు. ఆ సమయంలో అది పెళ్ళి చేసుకుంది. ఒకే ఇంట్లో మేం ఉండేవాళ్ళంకదా, వాళ్ళు సంతోషంగా ఉండటం చూస్తూ కాళిదాసు మరింత డిప్రెషన్‌కి గురయ్యేవాడు. వాళ్ళను అక్కడ నుంచి పంపెయ్యడానికి నానా మాటలు అన్నాను వాళ్ళిద్దరినీ. ఇక డిప్రెషన్‌లోంచి వాడు బయట పడాలంటే ఏదో ఒక ఉద్యోగం రావాలి. స్వయంగా ఉద్యోగం సంపాదించుకునేశక్తి వాడికి లేదు. ఇక ఈ ఉద్యోగం కాళిదాసుకు రావడంకోసం నేను కృష్ణ పైన నింద వేయక తప్పలేదు. అప్పుడుగానీ డిపార్ట్‌మెంట్‌వాళ్ళు ఆమెపై యాక్షన్ తీసుకోలేదు. అలా ఆమెను ఉద్యోగంనుంచి తొలగించకపోతే కాళిదాసుకు ఉద్యోగం ఇచ్చే పరిస్థితి లేదు. అందుకే అలా చేయవలసి వచ్చింది. నాకు వేరేమార్గం లేక పోయింది దాదా. దయచేసి నన్ను క్షమించండి' అంది మాయ చేతులు జోడించి. ఆమె కళ్ళవెంట కన్నీరు నిర్మల గంగాజలంలా ప్రవహించింది!

ఆశ్చర్యంతో ఆమెవైపూ, గుడిలోని అమ్మవారి వైపూ చూశాడు పూజారి. ప్రసన్నంగా ఉన్న కాళీ మాత ముఖంలో చిరునవ్వు ప్రకాశించింది.

**సెల్: 91+91633 40600**



# ఆరోగ్యమే మహాభాగ్యం



## సన్‌స్ర్కీన్‌తో సమస్యలు!

ఈ కాలం బయటకు వెళ్ళేముందు చాలామంది సన్‌స్ర్కీన్ లోషన్ అప్లయ్ చేసుకుని వెడుతుంటారు. సూర్యకిరణాల నుంచి చర్మాన్ని కాపాడుకునేందుకు తీసుకునే చర్యల్లో ఇదొక పద్ధతి. అయితే దీని వలన మేలు కన్నా కీడే ఎక్కువ జరుగుతుంది అంటున్నారు పరిశోధకులు. మనిషి శరీరానికి విటమిన్–డి ఎంతో అవసరం. మనం తీసుకునే ఆహారం నుంచే కాకుండా సూర్యకిరణాల ద్వారా శరీరానికి విటమిన్–డి అందుతుంది. సహజంగా శరీరం ఉత్పత్తి చేసే విటమిన్–డిని ఈ సన్‌స్ర్కీన్ లోషన్లు అడ్డుకుంటాయని పరిశోధకులు చెబుతున్నారు. దీని కారణంగా శరీరానికి కావలసినంత విటమిన్–డి లభ్యంకాక అనేక ఆరోగ్య సమస్యలు ఎదుర్కోవలసి వస్తుందన్నది వీరి వాదన. ముఖ్యంగా కొద్దిగా రంగు తక్కువగా ఉన్న వారు వీటికి దూరంగా ఉంటేనే మంచిదని సూచిస్తున్నారు. రంగు తక్కువగా ఉన్నవారి శరీరం విటమిన్–డి తక్కువగా ఉత్పత్తి చేసుకుంటుందనీ, ఈ లోషన్లు వాడడం వలన విటమిన్–డి సహజంగా ఉత్పత్తి ఆగిపోతుందనీ అంటున్నారు. ఎండలో బయటకి వెళ్ళే ముందు సూర్యకిరణాల నుంచి తప్పించుకోవడానికి సహజమైన పద్ధతులు పాటిస్తే మంచిదని వీరు సూచిస్తున్నారు.

## నొప్పిని మాయం చేసే బీరు?

బీరు తాగే వారికి ఇది నిజంగా శుభవార్తే! బీరులో నొప్పిని తగ్గించే గుణాలున్నాయనీ, ఇది పారాసెట్మాల్ మందు కన్నా బాగా పనిచేస్తుందన్న విషయం ఇటీవల నిర్వహించిన ఓ పరిశోధనలో వెల్లడైంది. లండన్‌లో సుమారు నాలుగు వందల మంది మీద నిర్వహించిన 18 అధ్యయనాలను పరిశీలించిన అనంతరం ఈ విషయం ధృవీకరించారు. నొప్పితో బాధపడుతున్న కొందరికి అధ్యయనవేత్తలు కొంత మొత్తంలో బీరును ఇచ్చారు. మరికొందరికి కేవలం నొప్పిని తగ్గించే మందులు మాత్రమే ఇచ్చారు. అనంతరం పరిశీలించగా బీరు తాగిన వారిలో నొప్పి కొద్దిగా తగ్గుముఖం పట్టగా, మందులు వేసుకున్న వారిలో ఎలాంటి మార్పును వీరు గమనించలేదు. బీరు తాగిన వారిలో అనవసర ఆందోళన తగ్గుముఖం పట్టడాన్ని గుర్తించారు. కేవలం బీరు తాగడం వలనే నొప్పి, ఆందోళన తగ్గాయా? మరేదైనా కారణం ఉందా? అన్న విషయాన్ని వీరు పరిశీలిస్తున్నారు.

## యోగాతో నెలసరి సమస్యలకు చెక్!

యోగా చేయడం వలన కలిగే లాభాల చిట్టా రోజురోజుకీ పెరిగిపోతోంది. ముఖ్యంగా మహిళలు యోగా చేయడం వలన పొందే లాభాలు అన్నీ ఇన్నీ కావు. ఈ లాభాల్లోకి మరో కొత్త లాభం వచ్చి చేరింది. సాధారణంగా నెలసరి సమయంలో స్త్రీలు శారీరకంగా, మానసికంగా ఎన్నో సమస్యలకు, ఒత్తిడులకు లోనవుతుంటారు. ఒత్తిడి, నొప్పి వంటివి తీవ్ర అసౌకర్యానికి గురిచేస్తాయి. క్రమం తప్పకుండా యోగా చేయడం వలన వీటి బారినుంచి తప్పించుకోవచ్చు అంటున్నారు లండన్ పరిశోధకులు. కొంతమంది మహిళల మీద వీరు ఓ అధ్యయనం నిర్వహించారు. ఎంపిక చేసుకున్న మహిళలను రెండు గ్రూపులుగా విభజించి ఒక గ్రూపు చేత క్రమం తప్పకుండా యోగా చేయించారు. మరో గ్రూపు వారి చేత సాధారణ వ్యాయామం చేయించారు. నెల రోజుల అనంతరం వీరిని పరిశీలించగా, యోగా చేసిన స్త్రీలు రుతుక్రమ సమయంలో ఎదురయ్యే పలు సమస్యల నుంచి తప్పించుకోగా, యోగా చేయని వారిలో ఆ సమస్యలు యదావిధిగా ఉండడం గమనించారు. కేవలం యోగా చేయడంవలన మాత్రమే ఇది సాధ్యమయిందా? లేక ప్రత్యేక కారణం ఉందా? అన్న విషయాన్ని కూడా వీరు పరిశీలిస్తున్నారు.



## కాఫీతో ప్రొస్టేట్ క్యాన్సర్ దూరం?

కాఫీ తాగితే కొన్ని రకాల ఆరోగ్య సమస్యలు దూరం అవుతాయన్న సంగతి గతంలోనే స్పష్టమైంది. ఇప్పుడు ప్రతిరోజూ మూడు కప్పుల ఇటాలియన్ కాఫీ తాగిన వారిలో ప్రొస్టేట్ కేన్సర్ ముప్పు 50 శాతం తగ్గుతుందన్న విషయం వెల్లడైంది. నీటిని బాగా మరగనిచ్చి చిక్కగా తయారు చేస్తారు ఈ కాఫీని. ఈ పద్ధతిలో తయారైన కాఫీ తాగినట్టయితే కేన్సర్ రాకుండా చూసుకోవచ్చని పరిశోధకులు చెబుతున్నారు. సుమారు ఏడువేల మందిపై పరిశోధనలు జరిపిన అనంతరం వీరు ఈ విషయం స్పష్టం చేశారు. వీరిలో సగం మందికి ఇటాలియన్ స్టయిల్లో తయారుచేసిన కాఫీ ఇచ్చారు. మిగతా సగం మందికి సాధారణ కాఫీ ఇచ్చారు. నాలుగు సంవత్సరాల అనంతరం వీరి ఆరోగ్యాన్ని పరిశీలించగా, ఇటాలియన్ కాఫీ తాగిన వారిలో ప్రొస్టేట్ కేన్సర్ కణజాలం పెరగకుండా ఉండటం గమనించారు. అదే సమయంలో ఈ కాఫీని తాగని వారిలో కేన్సర్ కణజాలం పెరగడాన్ని గుర్తించారు. కేవలం కాఫీ తాగడం వలనే ఈ మార్పు సంభవించిందా? అనే విషయమ్మీద ఇంకా అధ్యయనం నిర్వహిస్తున్నారు.

–అవినాష్






# రోహిప్నాల్

**హైవే రోడ్డులో గుర్తు తెలియని యువతి శవం కేసును డిటెక్టివ్ శరత్‌కు అప్పగించాడు ఇన్‌స్పెక్టర్ విజయ్. అమ్మాయి ఎవరో, ఏమిటో వివరాలు తెలియవు. కిడ్నాప్, జాడతెలియకుండా పోయిన కేసులు కూడా నమోదు కాలేదు. శవాన్ని పరిశీలించాడు శరత్. పోస్టుమార్టం నివేదికలో టాక్సికాలజీ వివరాలు గమ్మత్తుగా ఉన్నాయి. పొంతనలేకుండా ఉన్నాయి. అక్కడి నుండే తన పరిశోధన ప్రారంభించాడు శరత్.**

**ఇన్‌స్పెక్టర్ విజయ్ ఎదురుగా కూర్చున్నాడు డిటెక్టివ్ శరత్. 'ఏమిటి విషయం?' అని అడిగాడు.**

**'ఓ యువతి శవం రోడ్డు పక్కన పడి ఉంది. రెండు రోజులక్రితమే దొరికింది. మిస్సింగ్ రిపోర్టులులేవు. ఎవరో తెలియటంలేదు. నువ్వేమైనా తేలుస్తావేమోనని పిలిచాను.'**

'అమ్మాయిది హత్యా? ఆత్మహత్యా?' అడిగాడు శరత్.

'నిస్సందేహంగా హత్యే. శరీరంపై గాయాలున్నాయి. అత్యాచారం చేస్తున్న వాడితో అమ్మాయి పోరాడిన దాఖలాలు కనిపిస్తున్నాయి'.

'పోస్టుమార్టమ్ రిపోర్టు వచ్చిందా?'

శరత్‌కి రిపోర్టు అందించాడు విజయ్.

రిపోర్టు చదివిన శరత్ భృకుటి ముడిపడింది.

'నేనోసారి. పోస్ట్‌మార్టమ్ డాక్టర్ ఫణిని కలవాలి. అలాగే శవాన్ని చూడాలి' అన్నాడు శరత్.

***

'ఫణీ... పోస్ట్‌మార్టమ్ రిపోర్టులో టాక్సికాలజీ (toxicology) రిపోర్టు గమ్మత్తుగా ఉంది.

రక్తంలో ఆల్కహాల్ ఉందని రాశారుగానీ బెంజోడియా జెపైన్ (benzodio zepine) ఉందని కూడా పేర్కొన్నారు. కానీ ఆల్కహాల్, వాలియమ్ కలిపి తీసుకోవటం అంత సాధారణం కాదు కదా! ఆల్కహాల్ ఎలాగూ మత్తు కలిగిస్తుంది. వాలియమ్ ప్రశాంతతనిచ్చి నిద్ర కలిగిస్తుంది. ఏదైనా డోస్ ఎక్కువై మరణం సంభవించిందా?' అడిగాడు శరత్.

'నాకూ అదే అనుమానం వచ్చింది. ఆ పాయింట్ అండర్‌లైన్ చేశాను' చెప్పాడు ఫణి.

'రోహిప్నాల్ (rohypnol) కోసం టెస్ట్ చేశావా?'

శరత్ వైపు ఆశ్చర్యంగా చూశాడు ఫణి.

'డేట్ రేప్ డ్రగ్ (Date rape Drug). డేటింగ్‌కి వెళ్ళినప్పుడు అమ్మాయిల్ని మభ్యపెట్టి ఇచ్చే డ్రగ్. నా అనుమానం ప్రకారం అమ్మాయికి ఆల్కహాల్ ఇచ్చారు. అమ్మాయి స్వచ్ఛందంగా తాగి ఉంటుంది. ఆపై ఆమెకి తెలిసో, తెలియకో 'రోహి ప్నాల్' ఇచ్చి ఉంటారు.

'రోహిప్నాల్‌ను రక్తంలో కనుక్కునేందుకు ప్రత్యేక పరీక్ష చేయాలి' చెప్పాడు శరత్. తల ఊపాడు ఫణి. 'తెలుసు. కానీ మన దగ్గర డేట్ రేప్ డ్రగ్ వాడే వారున్నారా?'

'చెప్పలేం. పాశ్చాత్యుల వికృతిని ఎంజాయ్‌మెంట్‌గా భావించి అనుసరిస్తున్న యువతకు అనుభవమన్నది లేదు. ఒక అంచనా ప్రకారం అధిక శాతం డేట్‌రేప్‌లు ఆల్కహాల్ తాగించో, ఇలాంటి డ్రగ్స్ వాడో జరుగుతున్నాయి. ఇది యువతలో అధికం. ఈ డ్రగ్స్ వాడిన అమ్మాయి నియంత్రణ కోల్పోతుంది. తనకి ఏం జరుగుతోందో తెలియని ఒక 'ఆటోమేటిక్' స్థితికి చేరుకుంటుంది. తనపై అత్యాచారం జరుగుతోందన్న స్పృహ కూడా ఉండదు'.

'ఓ.కె. నేను రోహిప్నాల్ కోసం పరీక్షిస్తాను' అన్నాడు ఫణి.

శవాన్ని స్థూలంగా పరిశీలిస్తున్నాడు శరత్. హత్యకు పాల్పడినవాళ్ళు అసలు మనుషులే కాదు అనుకున్నాడు. అతడి ముఖం గంభీరంగా మారింది. శవాన్ని పరిశీలించటం పూర్తయ్యాక పక్కనే ఉన్న అసిస్టెంట్ రాము వైపు తిరిగాడు శరత్.

రామూ, అన్ని క్యాంపస్ కాలేజీల్లోనూ అమ్మాయి ఫొటో చూపించి అడుగు. అలాగే లేడీస్ హాస్టల్స్‌లో ప్రశ్నించు. ఎవరూ అమ్మాయి 'మిస్సింగ్' అని రిపోర్టు ఇవ్వలేదంటే అమ్మాయి ఒంటరిగా ఉండి ఉండాలి' అన్నాడు.

రాము వెళ్ళగానే విజయ్‌ని అడిగాడు శరత్.

'విజయ్, ఇలాంటి కేసులు ఇంకేమైనా ఉన్నాయా? లేక ఇలాంటి కేసుల్లో ఇదే ప్రథమమా?'

'ఇదే అనుకుంటాను. కాలేజీపార్టీల్లో, యువతీ యువకుల 'రేవ్' (Rave) పార్టీల్లో డ్రగ్స్ వాడకం తెలుసు. ఇలా డ్రగ్స్ ఇచ్చి రేప్ చేసిన కేసులు వచ్చాయిగానీ హత్యకేసు మాత్రం ఇదే' చెప్పాడు విజయ్. ఆలోచిస్తూ బయటకు నడిచాడు శరత్.

'బాస్... డాక్టర్లు ఈ మందు పేషంట్లకు ఇవ్వటం మానేశారట. అమెరికాలో ఇది నిషిద్ధం. మరి ఎలా సంపాదించాడో!' అన్నాడు రాము.

'అమెరికాలో నిషిద్ధం. మనదేశంలో కాదుకదా! మన దగ్గర షెడ్యూల్ డ్రగ్... అంటే పరిమితమైన వాడకానికి అనుమతి ఉంది. డాక్టర్ ప్రిస్క్రిప్షన్ ఉంటేనే అమ్మాలిగానీ అనేకులు దొంగ ప్రిస్క్రిప్షన్ సృష్టించి ఈ మందుని బయట దొంగతనంగా ఎక్కువ ధరకు అమ్ముతారు. నీ అసిస్టెంట్లను పనిలో పెట్టు. రాత్రిళ్ళు సందుల్లో చీకటి నీడల్లో డ్రగ్స్ అమ్మే వాళ్ళల్లో ఇటీవల ఈ డ్రగ్‌ను ఎవరైనా యువకులకు విక్రయించారేమో తెలుసుకో' చెప్పాడు శరత్.

'యెస్ బాస్' అంటూ లేచాడు రాము.

అతడి ఫోన్ మోగింది. ఫోన్ మాట్లాడుతూ తలుపుదాటి వెళ్ళిన రాము క్షణాల్లో వెనక్కు తిరిగి వచ్చాడు.

'బాస్.. నా అసిస్టెంటు ఫోన్ చేశాడు. ఓ పోష్ కాలనీలోని ఉమెన్ హాస్టల్‌లో ఓ అమ్మాయి ఈ ఫొటో గుర్తు పట్టిందట'.

రాము మాటలు పూర్తి కాకముందే లేచాడు శరత్. 'చలో' అన్నాడు.

కళ్ళు తుడుచుకుంది అమ్మాయి.

'చాలా మంచి ఫ్రెండండీ శిరీష. నేనే ఆమెకి ఈ హాస్టల్ చూపించాను. యూనివర్సిటీలో చదువు తోందిగానీ హాస్టల్ వాతావరణం పడలేదు. అందుకని నాతోపాటు ఇక్కడ ఉమెన్ హాస్టల్‌లో ఉండమన్నాను. వచ్చింది.

'మరి తను ఇన్నిరోజులు కనబడకుండాపోతే మీకు అనుమానం రాలేదా?' అడిగాడు శరత్.

చాలాసేపు మౌనంగా చేతివేళ్ళు పరిశీలిస్తూ కూర్చుంది అమ్మాయి. చివరికి మెల్లిగా చెప్పింది.

శిరీషది పేద కుటుంబం. వాళ్ళనాన్న అతికష్టం మీద ఆమెను చదివిస్తున్నాడు. అందుకే డబ్బు కోసం కష్టపడేది. ఎక్కడైనా పార్ట్‌టైమ్ ఉద్యోగం చేయాలనుకునేది. నేను ఒకటి సూచించాను. ముందు ఇష్టపడ లేదు. తరువాత ఒప్పుకుంది.

'ఏమిటా పని?'

'ఎస్కార్ట్' తల వంచుకుని మెల్లిగా చెప్పింది.

'ఎవరి దగ్గర?' అడిగాడు శరత్.

'మేడమ్ మమత ఎస్కార్ట్ సర్వీసెస్. రెండేళ్లుగా నేను అక్కడ చేస్తున్నాను. వేరే ప్రాంతాల నుంచి వచ్చేవారికి కంపెనీ ఇవ్వాలి'.

'శిరీష ఎప్పటి నుంచి చేస్తోంది' అడిగాడు శరత్.

'సంవత్సరం నుంచి.' మొన్న ఢిల్లీనుంచి వచ్చిన వ్యక్తి వారం రోజులు ట్రిప్‌కి రమ్మన్నాడు. నో సెక్స్ ఒప్పందంమీద వెళుతున్నానని చెప్పింది. అందుకే తను రాకున్నా నేను కంగారు పడలేదు' చెప్పింది.

'ఎస్కార్ట్ సర్వీసు చిరునామా చెప్పండి' అడిగాడు శరత్.

***

'యెస్... నేనే మమత. ఏం కావాలి?'

చాలా సింపుల్‌గా ఉందామె. కానీ ధనం, దర్పం రెండూ ఆమెలో ఉట్టి పడుతున్నాయి.

శిరీష ఫొటోను ఆమెకు అందించాడు శరత్ 'ఈమెను గుర్తు పడతారా?'.

'తెలుసు. నింఫెట్ నిమ్మీ.' అంటే అర్థం సమ్మోహితుల్ని చేసే యువతి. చాలా డిమాండ్ ఉందీ అమ్మాయికి'.

'ఆమె చివరిసారి ఎవరితో వెళ్ళిందో చెప్పగలరా?'

'సారీ... మాకు క్లయింట్ల వివరాలు తెలియవు. ఫోన్ నెంబర్లు, క్రెడిట్ కార్డులే మా క్లయింట్లు!

విజయ్ తన ఐడెంటిటీకార్డు చూపించాడు. 'శిరీష హత్యకు గురైంది. మీరు ఆమె వివరాలు ఏవి దాచిపెట్టినాగానీ నేరస్థుడికి సహాయం చేస్తున్నట్టే. శిక్ష అనుభవించాల్సి ఉంటుంది' హెచ్చరించాడు శరత్.

'సారీ, నాకు పోలీసులతో ఎలాంటి గొడవలు వద్దు' అంటూ రికార్డులు తిరగేసింది.

'నాకు మెసేజ్ వచ్చింది. క్రెడిట్‌కార్డు పని చేసింది. డబ్బులు వచ్చాయి. అతడి మెయిల్, ఐపీ అడ్రసు ఇవే. అతడు గది బుక్‌చేసిన హోటల్ ఇది' వివరాలు అందించింది మమత.

తరువాత హఠాత్తుగా ఏడవటం ఆరంభించింది. 'శిరీష చాలా మంచిపిల్ల. యంగ్‌గర్ల్. మంచి డిమాండ్ ఉంది. మంచి భవిష్యత్తు ఉంది.'

ఆమెని వదిలి బయటకు నడిచారు శరత్, విజయ్.

హోటల్ రిసెప్షనిస్టు శరత్‌వైపు చూశాడు నిరసనగా.

'సారీ సార్, ఆ వివరాలు వ్యక్తిగతం. చెప్పం' అన్నాడు.

నవ్వాడు శరత్. 'నాకు మర్యాదగా ఇస్తే మీ హోటల్‌పేరు పేపరులో రాదు. లేకపోతే కోర్టునుంచి ఆర్డరు తీసుకువస్తాను. పోలీసులతో, టీవీ కెమెరాలతో వస్తాను' విజయ్‌వైపు చూపిస్తూ చెప్పాడు శరత్.

వెంటనే మేనేజర్ పరుగెత్తుకు వచ్చాడు. 'సార్... సార్... మీరు అడిగిన వివరాలు నేనిస్తాను' అంటూ తీసుకెళ్ళాడు. రిజిస్టర్ చెక్ చేశాడు.

'సార్, ఆ గది మిస్టర్ నందకుమార్ పేరుమీద రిజిస్టరైంది. అతడి డ్రైవింగ్ లైసెన్స్ ఇది' జిరాక్స్ ప్రతిని ఇచ్చాడు.

ఇంతలో ఓ యువకుడు వచ్చాడు.

'ఇతనే ఆ రూమ్‌కి సర్వ్‌చేశాడు' పరిచయం చేశాడు.

ఆ గదిలో వ్యక్తి ఎలా ఉన్నాడు? అతడితో అమ్మాయి ఉందా?'

తల ఊపాడు యువకుడు. 'అతన్ని సరిగ్గా చూడలేదు. ఎందుకంటే నేను గదిలోకెళ్ళి వాళ్ళ ఆర్డర్ సర్వ్ చేసేసరికే అమ్మాయి నగ్నంగా మంచంపై ఉంది. నవ్వుతూ ఏదో మాట్లాడుతోంది. అతడు నీడల్లోంచే నా చేతిలోంచి డ్రింక్స్ తీసుకున్నాడు' డ్రైవింగ్ లైసెన్స్ మీద అడ్రస్ చూశాడు శరత్.

'లైసెన్స్ నాదే. పేరు నాదే. కానీ నేను హోటల్‌లో లేను. ఆ రోజు నేను ఇంట్లోనే ఉన్నాను. ఆ రోజు మా నాన్న షష్టి పూర్తి ఉత్సవం జరిగింది'.



'మరి మీ లైసెన్స్ వేరేవాళ్ళ దగ్గరకు ఎలా వెళ్ళింది' అడిగాడు శరత్.

నందకుమార్ కాస్సేపు ఆలోచించాడు. అంతలో ఏదో గుర్తొచ్చిన వాడిలా శరత్‌వైపు చూశాడు.

'నా ఫ్రెండ్ కిశోర్. నేను వాడికి అంతకుముందు రోజు కారు ఇచ్చాను. కారులోనే నా డ్రైవింగ్ లైసెన్స్ ఉంటుంది. బహుశా వాడేమైనా లామినేట్ చేయించాడేమో!'

అతడు ఆ మాట అనగానే తనదగ్గరున్న లైసెన్స్ జిరాక్స్ చూశాడు శరత్.

జాగ్రత్తగా పరిశీలించాడు. లైసెన్స్ అంచుల దగ్గర లామినేట్ చేసిన ప్లాస్టిక్ స్పష్టంగా తెలుస్తోంది.

'కిశోర్ అడ్రస్, ఫోన్ నెంబరు ఇవ్వండి.'

'ఎందుకూ? వాడు లోపలే ఉన్నాడు. భోజనం చేస్తున్నాడు' అంటూ డైనింగ్ గదివైపు దారి తీశాడు నందకుమార్.

నవ్వుతూ, తుళ్లుతూ, జోకులేస్తూ భోజనం చేస్తున్న కిశోర్ గదిలోకి అడుగుపెట్టారు శరత్, విజయ్. విజయ్‌వైపు ప్రశ్నార్థకంగా చూశాడు కిశోర్. అంతలోనే అతడి ముఖంలో భయం కనిపించింది.

***

'కిశోర్, అతడి స్నేహితుడు ప్రకాశ్ ఇద్దరూ శిరీష క్లాస్‌మేట్స్. శిరీష 'ఎస్కార్ట్'గా పార్ట్‌టైమ్ పని చేస్తూ డబ్బులు సంపాదిస్తోందని వాళ్ళకి తెలిసింది. దాంతో ఎలాగైనా ఆమెని అనుభవించాలని పథకం వేశారు. ఆమెని ఎస్కార్ట్ సర్వీసునుంచి దొంగిలించిన క్రెడిట్ కార్డుతో బుక్ చేశారు. అదే క్రెడిట్ కార్డుతో హోటల్‌గది బుక్ చేశారు. నందకుమార్ లైసెన్స్‌ను ఐ.డిగా ఇచ్చారు. అయితే శిరీష కలవగానే వాళ్ళు సరదాకి బుక్‌చేశామనిచెప్పి ఫ్రెండ్లీగా కూల్‌డ్రింక్ తాగించారు. కూల్‌డ్రింక్‌లో చీకటి బజారులో కొన్న 'రోహిప్నాల్' డ్రగ్ కలిపారు. డ్రగ్ ప్రభావంతో పిచ్చిగా మాట్లాడుతూ, మత్తులో తూగుతున్న శిరీషను అడ్డంగా పెట్టుకుని హోటల్ రిసెప్షన్‌లోవాళ్ళు తన ముఖం చూడకుండా జాగ్రత్తపడ్డాడు కిశోర్. అప్పటికే గదిలోకి చేరుకున్నాడు ప్రకాశ్. డ్రగ్ ప్రభావంతో అప్పటికే నియంత్రణ కోల్పోయిన శిరీషకు మద్యం తాగించి అత్యాచారం చేశారు. డ్రగ్ ఓవర్‌డోస్‌వల్ల శిరీష మరణించేసరికి కంగారుపడ్డారు. ఆమె ఒంటిపైన గుర్తింపు చిహ్నాలు లేకుండాచేసి, గదిఖాళీచేసి, ఆమె శవాన్ని మత్తులో ఉన్న అమ్మాయిలా నమ్మించి కారులో తీసుకెళ్ళి హైవేలో రోడ్డుపక్కన పారేశారు. నేరం తమ దాకా రాదనుకున్నారు. కానీ నేరం చేసిన వాడు కళ్ళు మూసుకుని పాలుతాగే పిల్లి లాంటివాడు. నేరానికి శిక్ష అనుభవించక తప్పదు' కేసును వివరించాడు శరత్.

*–కస్తూరి మురళీకృష్ణ*

*సెల్: **98496 17392***



# మనసుగతి ఇంతే!

4

-వక్కంతం సూర్యనారాయణరావ్, సెల్:98662 67287

**"హాయ్.. హౌ డూ యూ డూ సర్?" నీలం రంగు పాంటూ, అదే రంగు షర్టు వేసుకున్న ఇమ్మిగ్రేషన్ ఆఫీసర్.**

**"ఫైన్! హౌ ఆర్ యూ డూయింగ్ ఆఫీసర్?" వినయ్ నవ్వాడు.**

**"ఫైన్ థాంక్యూ!" అన్నాడు ఆఫీసర్.**

**సంధ్య ఇమ్మిగ్రేషన్ ఆఫీసర్నే చూస్తోంది. నున్నగా గీసిన గుండు. గుండ్రంగా ముందుకు పొడుచుకు వచ్చిన కుండలాంటి పొట్ట. ఆరడుగుల భారీ విగ్రహం. అమెరికన్లు ఒబేసిటీని లెక్కచేయరల్లే ఉంది.**

ఇమ్మిగ్రేషన్ ఆఫీసర్ తల కొద్దిగా పైకెత్తి సంధ్యను ఎగాదిగా చూశాడు. ఉబ్బిన బెలూన్‌లా ఉన్న అతని ముఖం మీద చిరునవ్వు మెరిసింది. ముఖం రబ్బరులా సాగింది.

"ఐ లైక్ యువర్ యూనిఫామ్ మామ్!"

"ఓ...థాంక్స్.." సంధ్య అంది.

వినయ్ ఆఫీసర్ వైపు చిరునవ్వు నవ్వాడు. "దటీజ్ నాట్ యూనిఫామ్ ఆఫీసర్. ఇన్ ఇండియా, వియ్ కాలిట్ శారీ అండ్ బ్లౌజ్.."

"ఓ...ఐసీ.." ఆఫీసర్ నవ్వాడు. "ఐ సీ...యూ ఆర్ న్యూలీ వెడ్స్.."

"యా!"

"కంగ్రాచ్యులేషన్స్! వెల్‌కమ్ టు అమెరికా మామ్!" అన్నాడు సంధ్యను చూస్తూ ఆఫీసర్.

సంధ్య చిరునవ్వు నవ్వింది.

ఇమ్మిగ్రేషన్ ఆఫీసర్ పాస్‌పోర్టుల మీద స్టాంప్ వేసి, వినయ్‌కి అందించాడు. "దిస్ వే ప్లీజ్!" అన్నాడు ఎడమచేత్తో దారి చూపిస్తూ.

వినయ్ సంధ్య చెయ్యి పట్టుకుని బ్యాగేజ్‌ని దగ్గరకు తీసుకువచ్చే కన్వేయర్ బెల్ట్ వైపు నడిచాడు.

అనుమతించిన దానికన్నా ఎక్కువగా ఉన్న తమ లగేజిని పోర్టర్లకు అప్పజెప్పి, బైటికి నడిచాడు వినయ్ సంధ్యతో...

"హాయ్ న్యూలీవెడ్స్! వెల్‌కమ్!" ఇద్దర్నీ చూడగానే ఉత్సాహంగా అరిచాడు వినయ్ మిత్రుడు కిరణ్.

"హాయ్ వినయ్" కిరణ్ భార్య హర్షిత నవ్వుతూ అంది.

"సిస్! దిసీజ్ మై బెటర్‌హాఫ్ సంధ్య.." సంధ్యను హర్షితకు పరిచయం చేస్తూ అన్నాడు వినయ్. "సంధ్యా హర్షిత, ఆమె భర్త కిరణ్.. మై బెస్ట్‌ఫ్రెండ్స్ ఇన్ అమెరికా.."

"హలో.. బావున్నారా?" సంధ్య నవ్వుతూ అంది.

హర్షిత ఫ్లవర్ బొకేను సంధ్యకు అందించింది. "బావున్నాం. నెవర్ బెటర్!" అంటూ సంధ్యను కౌగిలించుకుని, చెంపకు చెంప ఆన్చింది.

"సారీరా వినయ్. పెళ్ళికి రాలేకపోయాం..." కిరణ్ వినయ్ చేతిని పట్టుకుంటూ అన్నాడు.

"ఫర్వాలేదురా" వినయ్ అన్నాడు.

"వన్‌మినిట్.. లగేజ్ వ్యాన్‌లో పెట్టిస్తా!" అంటూ అటు తిరిగాడు కిరణ్.

"వినయ్..." హర్షిత సంధ్యను చూస్తూ అంది.

'యస్ సిస్..."

"ఒక సంగతి చెప్పనా?"

"చెప్పు... వద్దంటే మానవుగా!" వినయ్ చిరునవ్వుతో అన్నాడు.

"యువర్ వైఫ్ సంధ్య - రియల్ బ్యూటీ!"

"నిజంగా నీ మాట నమ్మాలనిపిస్తోంది!" వినయ్ నవ్వుతూ అన్నాడు.

"సంధ్యది రియల్ నేచురల్ బ్యూటీ.. తనను చూస్తుంటే ఈ జీన్సు, టీషర్టులు మానేసి చక్కగా చీర కట్టుకోవాలనిపిస్తోంది" హర్షిత నవ్వుతూ అంది.

"మంచి నిర్ణయం. కట్టుకో" వినయ్ అన్నాడు.

"ప్చ్....చీరకట్టు మరచిపోయాను. అన్‌ఫార్చ్యునేట్.!"

"డోంట్‌వర్రీ! సంధ్య నేర్పుతుంది, నేర్చుకో! ఏం సంధ్యా, నేర్పుతావా హర్షితకు చీర కట్టుకోవడం!" వినయ్ సంధ్య వైపు నవ్వుతూ అన్నాడు.

సంధ్య చిరునవ్వు నవ్వింది.

లగేజ్ ఉన్న వ్యాన్ శాన్‌ఫ్రాన్సిస్కో ఎయిర్‌పోర్టు నుండి శానోజే వైపు దూసుకెళుతోంది. స్టీరింగ్ వీల్ వెనక కిరణ్, పక్కనే వినయ్. హర్షిత డ్రైవ్ చేస్తున్న ఆడీ కారులో ఉంది సంధ్య.

"ఎలా ఉంది ఆడీ?" వినయ్ ప్రశ్నించాడు.

"వెరీనైస్ టు హ్యాండిల్. ఆడీని నువ్వు నాకు అప్పగించినప్పట్నుంచీ, హర్షిత మా కారు ఎక్కనే లేదు. దాన్ని అమ్మిపారేసి, ఆడీ కొనమంటోంది!" కిరణ్ నవ్వుతూ అన్నాడు.

"హోటల్ రూమ్ బుక్ చేశావుగా?" వినయ్ అడిగాడు. ప్రయాణం బడలికని ఆవులింతతో తరిమే ప్రయత్నం చేస్తూ.

"నో ప్రాబ్లమ్" కిరణ్ క్లుప్తంగా అన్నాడు.

"ఏయ్, కిరణ్! హోటల్‌కెళ్ళకుండా ఇటెక్కడికి?" వినయ్ ప్రశ్నించాడు, వ్యాన్ కుడివైపు కాకుండా ఎడం వైపు తిరగ్గానే.

"ఎక్కడికి? ఇంటికి."

"ఇంటికా?" వినయ్ ఆశ్చర్యంగా అన్నాడు. "ఎందుకు?"

"ముందు స్నానాలు చేసి, ఫ్రెష్ అవండి. తరువాత వెళదాం హోటల్‌కి."

"అది కాదురా.."

"నోరు మూసుకో. బీ ఏ గుడ్ బాయ్ అండ్ బీ మై గెస్ట్!"

***

## జరిగిన కథ

ఒక దాని తరువాత ఒకటిగా కంప్యూటర్ స్క్రీన్‌మీద ఫోటోలు జరిగిపోతున్నాయి. అన్నీ సంధ్య ఫోటోలే! అతనికి ఎటు చూసినా ఆమే కనబడుతోంది. ఆమెనే మంత్రముగ్ధుడిలా చూస్తూ తన తీయటి గతంలోకి జారుకుంటాడు వినయ్. అమెరికాలో ఉన్న వినయ్ ఇండియా వచ్చి సంధ్యని పెళ్ళి చేసుకుంటాడు. మొదటిచూపులోనే ఆమెను చూసి ఫ్లాటైపోతాడు. శోభనం రాత్రి గదిలోకి అడుగుపెట్టిన సంధ్య ఒక్కసారిగా కుప్పకూలిపోతుంది. హాస్పిటల్‌కి తీసుకు వెళతారు ఆమెని. అయితే ఆమెకేమీ సమస్య లేదని, రెండుమూడు రోజులు విశ్రాంతి తీసుకుంటే సరిపోతుందని చెబుతారు డాక్టర్లు. ఆ తరువాత ఇద్దరూ కలిసి తిరుపతి వెళ్ళి వస్తారు. మరునాడు అమెరికా వెళతారనగా, రెండోసారి మొదటిరాత్రి ఏర్పాట్లు చేస్తారు. అయితే రెండోరాత్రి కూడా ఎన్నెన్నో కలలతో ఆ గదిలోకి అడుగుపెట్టిన వినయ్‌కి నిరాశే మిగులుతుంది. ఇద్దరూ అమెరికా పయనమవుతారు.

**ఆ తర్వాత....**

నలుగురూ చైనీస్ హోటల్‌లోంచి బైటికి వచ్చారు. హర్షిత, సంధ్య జంటగా కారుపార్కింగ్ వైపు నడుస్తున్నారు. కొంచెం దూరంలో వాళ్ళ వెనక నడుస్తున్నారు వినయ్, కిరణ్ ఇద్దరూ.

కిరణ్ ఆగి, వినయ్ భుజం మీద చేయివేశాడు. వినయ్ ఆగి ప్రశ్నార్థకంగా చూశాడు.

"యూ ఆర్ లక్కీ వినయ్!" కిరణ్ ముందు వెళ్తున్న తమ ఇద్దరి భార్యలనే చూస్తూ అన్నాడు.

"ఏం?"

"నీకు నిజమైన అందగత్తె భార్యగా దొరికింది."

"థాంక్స్. హర్షిత కూడా అందగత్తే!"

"నాట్ ఫుల్‌ఫ్లెడ్జ్‌డ్! ఫుల్ ఫ్లెడ్జ్‌డ్‌గా కాదు. హర్షిత ఒక్క పంజాబీ డ్రస్సులో మాత్రమే అందంగా ఉంటుంది. చీరలో, జీన్సులో అందంగా అవుపించదు. సంధ్య అలాకాదు. ఏ డ్రస్సు వేసుకున్నా అందంగానే ఉంటుంది. 'ఎలా తెలుసు?' అనొద్దు. ఫ్లయిట్ దిగినప్పుడు ఆమెను చీరలో చూశాను. స్ట్రైకింగ్! ఇంట్లో పంజాబీలో చూశాను. ఎగైన్ స్ట్రైకింగ్! ఇప్పుడు జీన్స్‌లో చూస్తున్నా. నో లెస్ స్ట్రైకింగ్! సంధ్య ఈజ్ ఏ బ్యూటీ!"

"థాంక్స్ కిరణ్.."

"పుట్టబోయే పిల్లలు సంధ్యను పోలితే అద్భుతంగా ఉంటారు?"

"నన్ను పోలితే?" వినయ్ చిరునవ్వుతో అడిగాడు.

"అందంగా ఉంటారు."

"మాటలు బాగా నేర్చావ్. ఓకే.. ఎయిర్‌పోర్టు నుండి వచ్చేటప్పుడు 'బీ మై గెస్ట్' అన్నావు.."

"అన్నాను." కిరణ్ నడక సాగిస్తూ అన్నాడు.

"అయితే హోటల్‌కి ఎందుకు తీసుకొచ్చావ్?"

"ఇక్కడకూడా నువ్వు నా గెస్టువే. బిల్లు నేనే చెల్లించాను! హోటల్లో ఆతిథ్యం, నా ఇంట్లో ఆదరణ. ఓకే!"

"ఒరేయ్. నా మాట విను. హోటల్ గది.." వినయ్ ప్రారంభించాడు.

"మీకోసం చూసిన ఫ్లాట్ తాళం చెవి మరో మూడు రోజులకు గానీ రాదు. మూడు రాత్రులూ మీ ఇద్దరూ మా సెకండ్ బెడ్‌రూమ్‌లోనే!" కిరణ్ నవ్వాడు.

"నా మాట విను కిరణ్. మిమ్మల్ని ఇబ్బందిపెట్టడం నాకిష్టం లేదు..?"

"మా అమ్మా నాన్నా, లేకపోతే హర్షిత అమ్మా నాన్నా వస్తారన్న ఆశతో టూ బెడ్‌రూమ్ ఫ్లాట్ తీసుకున్నా. ఇంతవరకూ ఎవ్వరూ రాలేదు. తన ఒడిలో నిద్రపోయే వాళ్ళకోసం మా సెకండ్ బెడ్‌రూం మొహం వాచిపోయి ఉంది. అక్కడ ఆదమరిచి నిద్రపోయి మీరిద్దరూ దాని ఉనికిని పావనం చేయండి!"

"కిరణ్..?"



"డోంట్ టాక్. ఈ మూడు రోజులూ మీరు మా ఇంట్లోనే ఉంటారు. నువ్వూ, నేనూ, హర్షితా డ్యూటీలకి వెళ్ళిపోతాం. సంధ్య 'మా ఇంటి వంట' చేస్తుంది."

"ఒరేయ్... ఒరేయ్... సంధ్యకి వంట రాదేమోరా.." వినయ్ కంగారుగా అన్నాడు.

"ఇంటర్నెట్టుందిగా నాయనా! నేర్చుకుంటుంది. మూడు రోజులూ మన ముగ్గురి మీదా ప్రయోగిస్తుంది. ఆ తరువాత నీ మీద ప్రయోగిస్తుంది; జీవితాంతం!:"

"యూ ఆర్ ఇంపాసిబుల్!"

"ఔను. హర్షిత కూడా అంటూ ఉంటుంది. కమాన్... కారెక్కు!" కిరణ్ నవ్వుతూ రిమోట్ నొక్కాడు. కారు చిన్నగా ఈల వేసింది.

***

హాల్లో కూచుని అరగంట పాటు కబుర్లు చెప్పుకున్న తరువాత కిరణ్ లేచి ఒళ్ళు విరుచు కున్నాడు. "ఓకే వినయ్...వెళ్ళి పడుకో..."

"గుడ్‌నైట్" వినయ్ పైకి లేస్తూ అన్నాడు.

"నైట్!" అంటూ కిరణ్ బెడ్‌రూం తలుపు తెరిచి, లోపలికెళ్ళి, తలుపు మూశాడు.

వినయ్ తమకు కేటాయించిన బెడ్‌రూం తలుపును లోపలికి తోసి, గుమ్మంలో ఆగి, ఆశ్చర్యంగా చూశాడు. గది ఖరీదైన సువాసనతో నిండి ఉంది. రెండు పూలకుండీల్లో రంగురంగుల పువ్వులు మెరుస్తున్నాయి. మంచం మీద క్రీమ్ కలర్ బెడ్ స్ప్రెడ్ పరిచి ఉంది. దాని మీద రకరకాల ఆర్కిడ్స్ రేకులూ, టులిప్పూ వెదజల్లి ఉన్నాయి. తలగడల వైపు మంచం దగ్గరగా చిన్న టేబుల్ మీద రకరకాల స్వీట్సూ..

వినయ్ గిరుక్కున వెనుదిరిగి, కిరణ్ గదివైపు వెళ్ళాడు. తలుపు మీద వేళ్ళ కణుపుల్తో చప్పుడు చేశాడు. "కిరణ్"

కిరణ్ తలుపు తెరిచి, వినయ్ వైపు ప్రశ్నార్థకంగా చూశాడు. "ఏంట్రా?"

"ఏంటి? ఏంట్రా ఆ బెడ్‌రూం సెటప్? పిచ్చా?" వినయ్ చిరునవ్వును దాచుకుంటూ అన్నాడు. "ఆ ఫ్లవర్సేంటీ? ఆ స్వీట్సేంటీ? ఏంట్రా అది?"

కిరణ్ ఆవులిస్తూ అరచేతిని నోటికి అడ్డుపెట్టుకున్నాడు. "అదా? కొత్త దంపతులు కదా అని హర్షిత అరేంజ్ చేసినట్టుందిలే.."

"అదికాదోయ్..."

"ఆగు... మాట్లాడకు. అమెరికాలో, ఈ సిలికాన్ వ్యాలీలో మీ ఇద్దరికీ ఇది తొలిరాత్రి కదా! అందుకని హర్షిత నాక్కూడా ముందుగా చెప్పకుండా సర్‌ప్రైజ్ చేసింది. గో అండ్ హ్యావే నైస్ నైట్!"

"నువ్వెన్ని చెప్పినా నమ్మను. ఇదంతా నీ పనే!" వినయ్ రోషం నటిస్తూ అన్నాడు.

"ఓకే...అలాగే అనుకో. గో అండ్ ఎంజాయ్ యువర్ ఫస్ట్ నైట్ ఇన్ అమెరికా!"

వినయ్ నోరు తెరిచేలోగా కిరణ్ తలుపు మూశాడు.

వినయ్ తనలో నవ్వుకుంటూ తమకు కేటాయించిన బెడ్‌రూం వైపు నడిచాడు.

తలుపు మూసి, వినయ్ మంచం వైపు నడిచాడు. అతని కళ్ళు ఆత్రంగా సంధ్య కోసం చూస్తున్నాయి. మంచం మీద సంధ్య లేదు. మంచం మీద కప్పిన క్రీమ్ కలర్ దుప్పటి మీద పింక్ కలర్ ఆర్కిడ్స్‌తో రూపుదిద్దుకున్న 'వినయ్, సంధ్య' అనే అక్షరాలు వినయ్ కళ్ళకి విందు చేస్తున్నాయి. ఆర్కిడ్ పువ్వులతో రంగవల్లిలాగా పేర్చబడిన ఇద్దరి పేర్లూ చెక్కుచెదరలేదు. అంటే... సంధ్య మంచం మీద కూచోలేదు!

అన్నట్టు సంధ్య ఎక్కడుంది? వినయ్ గదిని కలియజూశాడు. గది బోసిగా ఉంది. గదిని అంటిపెట్టుకుని ఉన్న చిన్నపాటి స్టోర్‌రూం వైపు అతని చూపులు తిరిగాయి. స్టోర్‌రూంలో లైటు వెలుతురు లేదు. వినయ్ అటువైపు అడుగులువేసి, లైటు స్విచ్ పైకి నెట్టాడు. తలుపు చుట్టూ వెల్తురుగీతలు కనిపించాయి. వినయ్ తలుపు లోపలికి తోశాడు. పెద్ద పెద్ద సూట్ కేసులూ, తలగడలూ, ఏవో పెట్టెలూ గది నిండా ఉన్నాయి. సంధ్య లేదు! ఇక మిగిలింది ఒక్కటే, బాత్‌రూం...

వినయ్ బాత్‌రూం వైపు నడిచి తలుపు దగ్గరగా ఆగి, చెవులు రిక్కించాడు. ఏ విధమైన చప్పుడూ లేదు. సంధ్య స్నానం చేస్తుంటే నీళ్ళు చప్పుడు చేసేవి. వినయ్ తలుపు హ్యాండిల్ని తిప్పే ప్రయత్నం చేస్తూ లోనికి నెట్టాడు. తలుపు లోపలి నుంచి లాక్ చేయబడింది.

"సంధ్యా..." వినయ్ తగ్గుస్వరంతో పిలిచాడు. సమాధానం లేదు. వినయ్ కాసేపు తటపటాయిస్తూ ఉండిపోయాడు. ఏం చెయ్యాలి? సంధ్య ఏం చేస్తోంది?

వినయ్‌లో తలెత్తుతున్న ప్రశ్నలకి సమాధానంగా సింక్‌లో దూకుతూ నీళ్ళు చప్పుడు చేశాయి.

"సంధ్యా..." వినయ్ కంఠంలో ఆత్రుత ధ్వనించింది.

నీళ్ళ చప్పుడు ఆగింది. చిన్నచప్పుడుతో తలుపు తెరుచుకుంది. తెరిచిన తలుపుని ఆసరాగా పట్టుకుని నిలుచుంది సంధ్య. వినయ్ చిరునవ్వు నవ్వాడు. మరుక్షణం ఆ చిరునవ్వుని సంధ్య ముఖం మీద కనిపిస్తున్న అలసట తుడిచివేసింది. సంధ్య అలసటగా కళ్ళు మూసుకుంది. మళ్ళీ తెరిచేప్రయత్నం చేసింది.

"సంధ్యా... ఏమిటలా ఉన్నావు?" వినయ్ ఆదుర్దాగా అడిగాడు.

జవాబుగా సంధ్య నోటికి చేతిని అడ్డం పెట్టుకుని, వెనక్కి తిరిగి, తూలుతూ సింక్ వైపు వేగంగా అడుగులువేసింది. ముందుకు వంగి రెండుచేతుల్తో కణతలు నొక్కుకుంటూ వాంతి చేసుకుంది. ఆమె కుడిచేయి సింక్ మీద ఆనింది. ఎడమ చెయ్యి కొళాయిని తిప్పింది. నీళ్ళు ఆమె వాంతిని కిందికి తీసుకెళ్తూ సింక్‌ని కడిగేశాయి.

వినయ్ తనకు తెలీకుండానే, బాత్‌రూంలోకి పరుగెత్తాడు. సంధ్య భుజాల మీద చేతులు వేశాడు.

"సంధ్యా..ఏమయింది?"

సంధ్య మాట్లాడకుండా అతని వైపు తిరిగింది. చేతిని కిందికీ పైకీ ఆడిస్తూ వాంతి అయినట్టు సైగ చేసింది.

"ఎందుకు?" వినయ్ కంగారుగా అడిగాడు.

సంధ్య మాట్లాడకుండా మంచం దగ్గరగా నడిచింది. జాగ్రత్తగా తన భుజాలు పట్టుకున్న భర్త చేతుల్లోంచి జారుతూ, మంచం దగ్గరగా చెక్కనేల మీదున్న కార్పెట్ మీద కూలబడింది. ఆమె తల బలహీనంగా మంచం అంచున వాలింది.

వినయ్ ఆమె దగ్గరగా కూచుని, భుజం చుట్టూ చేతిని వేశాడు. "సంధ్యా..ఎలా ఉంది నీకు? చెప్పు."

"ఎలాగో ఉంది...నన్ను వదిలేయండి ప్లీజ్"

"సంధ్యా... డాక్టర్ దగ్గరకెళదాం" వినయ్ పైకి లేస్తూ, ధైర్యం చెబుతున్నట్టు అన్నాడు.

"నేను...ఎక్కడికీ రాను."

"సంధ్యా!"

"నన్నిలా వదిలేయండి...నాకెలాగో ఉంది..."

"నో! నువ్వు డాక్టర్ని కన్సల్ట్ చేయాల్సిందే..." వినయ్ ఆగి, సంధ్య నైటీ వైపు చూశాడు. "కిరణ్‌తో మాట్లాడి వస్తాను. ఈలోగా నువ్వు డ్రస్ ఛేంజ్ చేసుకో.."

గుమ్మం వైపు వెళ్తున్న వినయ్ వైపు సంధ్య ఓరగా చూసింది. "ఆగండి!"

సంధ్య కంఠంలో గంటలా ధ్వనించిన ఆవేశం వినయ్‌ని ఆపింది. వినయ్ ఆమెవైపు తిరిగి చూశాడు.

"ఇలా రండి.."

వినయ్ మంత్రముగ్ధుడిలా ఆమె వైపు నడిచాడు. దగ్గరగా ఆగి ఆమె ముఖంలోకి తలవాల్చి చూశాడు.

సంధ్య తలెత్తి అతని ముఖంలోకి నిదానించి చూసింది. అలసట ఏదో పొరలా ఆమె ముఖాన్ని కప్పినట్టుంది. సంధ్య తల మెల్లగా కిందికి వాలింది.

"ఎందుకో.. హైదరాబాద్‌లో రెండవ తొలిరాత్రి అయినట్టు అవుతోంది నాలో. నేను... నేను... చాలా డిస్టర్బ్‌డ్‌గా ఉన్నాను. నన్ను...ఆ రాత్రిలాగే...అలా వదిలేయండి.."

"సంధ్యా.."

"సారీ...అయాం నాట్ రెడీ ఫర్ యూ"

"సంధ్యా!" వినయ్ కంఠంలో ఆశ్చర్యం జేగంటలా ధ్వని చేసింది.

"ఐ...మే...నాట్ బీ రెడీ ఫర్ యూ.. ఫార్ సమ్ డేస్.."

"సంధ్యా... స్పష్టంగా చెప్పు. ఏమైంది నీకు? ప్రతి రోగానికీ ఏదో ఒక ట్రీట్‌మెంట్ ఉంటుంది."

"మీ కాళ్ళు పట్టుకుంటాను. నన్ను... నన్ను ఇలా వదిలేయండి కొన్నాళ్ళపాటు. కనీసం మన అద్దె ఇంట్లో మన కొత్త కాపురం ప్రారంభించేంత వరకూ.." సంధ్య కంఠం జీరగా, దీనంగా ధ్వనించింది.

**అమెరికాలో తాను అద్దెకు తీసుకున్న ఫ్లాట్‌కి చేరుకున్నాడు వినయ్. సంధ్యకు ఫ్లాటంతా తిప్పి చూపించాడు. అది సింగిల్ బెడ్రూం ఫ్లాట్. కానీ తనకు నచ్చలేదంది సంధ్య. టూబెడ్రూం ఫ్లాటే కావాలని మంకుపట్టు పట్టింది. దాంతో ఏం చేయాలో తోచలేదు వినయ్‌కి. మరి అతడు ఆమె కోరినట్టు టూ బెడ్రూం ఫ్లాట్ తీసుకున్నాడా?**

"అయామ్ వర్రీడ్ సంధ్యా... ఎందుకిలా జరుగుతోంది నీకు?" వినయ్ నిస్సహాయంగా అడిగాడు. సంధ్య తలెత్తి దయనీయంగా చూసింది. "నిజం చెప్పండి... మీరు నన్ను ప్రేమిస్తున్నారా?"

"హృదయపూర్వకంగా" సంధ్య తన ప్రశ్నను నిర్లక్ష్యం చేసిన అంశాన్ని పట్టించుకోకుండా అన్నాడు వినయ్.

"అయితే, మనం ఇలా దూరంగా ఉన్నట్టు కిరణ్‌కూ, హర్షితకూ తెలియనివ్వకండి.."

వినయ్ మౌనంగా, తదేకంగా సంధ్య ముఖంలోకి చూస్తూ ఉండిపోయాడు. ఆమె పెదవులు ఆరిపోతూ, అదురుతున్నాయి. పెద్దపెద్ద కళ్ళు ప్రాధేయపూర్వకంగా చూస్తున్నాయి.

'ఒకే సంధ్యా. అలాగే. విశ్రాంతిగా పడుకో"

"మీరు మంచంమీద పడుకోండి. నేను ఆ ఈజీ చెయిర్లో పడుకుంటాను..." అంటూ సంధ్య మెల్లిగా లేచి, నీరసంగా ఈజీ చెయిర్ వైపు అడుగులు వేసింది. వినయ్ చూపులు తూలుతూ అడుసులో నడుస్తున్నట్టు నడుస్తున్న సంధ్యనే వెంటాడుతూ ఉండిపోయాయి. సంధ్య ఈజీ చెయిర్లో కూర్చుంది.

"సంధ్యా...కొంచెం పాలు తాగు.."

"వద్దు.."

"నీళ్ళు.."

"ప్లీజ్.. కాసేపు నన్ను మాట్లాడించకండి?" సంధ్య అరచేత్తో నుదుర్ని కప్పుకుంటూ అంది.

వినయ్ బరువుగా నిట్టూర్చాడు. మంచం అంచున కూచున్నాడు. సంధ్యకు ఏమిటవుతోంది? ఎందుకవుతోంది? అందాల భరిణ అయిన సంధ్యతో తన జీవితం గురించి బంగారు కలలు కన్న తనకు ఎందుకిలా జరుగుతోంది?

'రెండవ తొలిరాత్రి'... ఇండియాలో తనకు తారసిల్లిన రెండవ తొలిరాత్రి గురించి తాను రహస్యంగా ఉంచాడు. రహస్యంగా ఉంచమని సంధ్యకు చెప్పాడు. ఇక్కడ అమెరికాలో తొలి రాత్రి విషయం ఆతిథ్యం ఇచ్చి, ఆదరించిన మిత్రులకి చెప్పొద్దంటోంది సంధ్య! ఒకే...తను తొందరపడకూడదు. తొందరపడి సాధించేది ఏమీలేదు.

సన్నగా, లయబద్ధంగా వినిపించడం ప్రారంభించిన సంధ్య గురక వినయ్‌లో ఆలోచనల సమరాన్ని ఆపింది. సులభంగా నిద్రలో మునిగిపోయిన సంధ్యను క్షణకాలం మౌనంగా చూసి, చూపుల్ని మంచం వైపు తిప్పాడు వినయ్. పూలపాన్పు! వినయ్ విరక్తిగా నవ్వుకున్నాడు. ఆర్కిడ్సూ, టులిప్సూ తన వైపు సానుభూతిగా చూస్తున్నాయనిపిస్తోందతనికి.

"మనం ఇలా దూరంగా ఉన్నట్టు కిరణ్‌కూ, హర్షితకూ తెలియనివ్వకండి" సంధ్య అభ్యర్థన అతని చెవుల్లో మారుమ్రోగింది.

యస్! కిరణ్‌కూ, హర్షితకూ తెలీకూడదు. వినయ్ చెయ్యి మెల్లిగా కదిలింది. పువ్వులతో రాయబడిన తమ పేర్లని అతని కుడిచెయ్యి చీపురులా తుడిచి, చెరిపివేసింది. మంచం మీద చల్లిన పువ్వుల్ని పిడికిలిలో బిగించి నలపసాగాడు వినయ్; నిర్దాక్షిణ్యంగా నలిగిన పువ్వులూ, చెదిరిన దుప్పటీ కిరణ్ దంపతులకు కనిపించాలి.

***

మూడు పగళ్ళు గడిచి పోయాయి. మూడు రాత్రులూ గడిచిపోయాయి.

నాలుగోనాటి ఉదయం వినయ్ తన ఆడీ కారుని 'గోల్డెన్‌గేట్' అపార్ట్‌మెంట్ ఆఫీసు ముందు ఆపి, పక్కసీట్లో కూచున్న సంధ్య వైపు చూశాడు. "తాళం చెవి తీసుకొస్తా" అంటూ కిందికి దిగాడు. కాసేపట్లో తాళం చెవితో తిరిగొచ్చాడు. స్టీరింగ్ వీల్ ముందు కూచుని కారు స్టార్ట్ చేసి, వరసగా ఉన్న ఆపార్ట్‌మెంట్ బ్లాక్స్ వైపు పోనిచ్చాడు.

మూడో నంబరు బ్లాక్ ముందు కారాపి, 'ఇక్కడే' అంటూ సంధ్యకు చెప్పి, కారు దిగాడు. సంధ్య దిగి, ముందు వెళ్తున్న వినయ్‌ని అనుసరించింది.

301 నంబరున్న ఫ్లాట్ ముందు ఆగి, వినయ్ తాళం తెరిచి, తలుపు లోపలికి తోశాడు. చిరునవ్వుతో సంధ్య వైపు చూశాడు. "స్టెప్‌ఇన్! కుడికాలు పెట్టు!"

సంధ్య కొంచెం తడబడి, ఎడమకాలు పెట్టింది. గుమ్మం దాటి, పొరపాటు తెలుసుకుని నాలుక కరుచుకుంది. "సారీ..ఎడమ కాలు పెట్టాను."

"నెవర్ మైండ్! ఊరికే అన్నాను. ఇది మన గృహప్రవేశం కాదు!"

సంధ్య హాలు కలియజూసింది. ఒక వైపు గోడ కింది నుంచి పైదాకా అద్దాలే. అడ్డంగా వెనిషియన్ బ్లయిండ్స్. నేలంతటినీ గ్రేకలర్ కార్పెట్ కప్పి ఉంది.

"ఫర్వాలేదే! నేల కనిపించకుండా కార్పెట్ వేశారు!" సంధ్య అంది.

"నేలంతా చెక్క. మనదేశంలో లాగా మార్బుల్ గానీ, టైల్స్ గానీ, సిమెంటు గానీ కాదు. కింది నేల, పైకప్పు, గోడలు అన్నీ చెక్కవే!" వినయ్ వివరించాడు. "కిరణ్ ఇల్లు చూశావుగా?"

"చూశాను. ఎందుకని అడగలేదు. అక్కడ గుమ్మం దాటగానే వంటగది. ఇక్కడా అంతేనా?" సంధ్య కుడివైపు చూస్తూ అంది.

"ఎక్కడైనా అంతే! తలుపుతెరిస్తే వంటగదిలో ఉంటావు! అక్కడే చెప్పులు; బూట్లు. అక్కడే వంట! కమాన్ బెడ్‌రూం చూద్దాం" అంటూ వినయ్ హాల్లోంచి బెడ్‌రూంలోకి ఉన్న తలుపు తోస్తూ దారి తీశాడు.

సంధ్య కలయజూసింది. చిన్న గది. అద్దాలు బిగించిన కిటికీ.

"ఇదిగో.. ఇది బాత్‌రూమ్" వినయ్ తలుపు తెరుస్తూ అన్నాడు.

సంధ్య లోపలికివెళ్ళింది. గోడవారగా టబ్. ప్లాస్టిక్ షీట్ తెర, ఇటువైపు గోడంతా ఆక్రమించిన నిలువుటద్దం. అద్దంముందు సింక్. దాని పక్కనే టాయి



## అంజలిని భయపెట్టిన పిల్లులు

కడవంత గుమ్మడికాయ కూడా కత్తిపీటకు లోకువన్నట్టు...దయ్యం సినిమాలు చేసిన హీరోయిన్లే దయ్యాలకు భయపడుతుంటారు. తెర మీద వారి నటన, హావభావాలు చూసిన ప్రేక్షకులు వాళ్ళని ఆహా... బాగా చేశారు... భయపడకుండా చేశారు అంటూ ఆకాశానికి ఎత్తేస్తుంటారు. కానీ వీళ్ళేమో నిజ జీవితంలో దయ్యాలు ఉండవని తెలిసినా, వాటి పేరు వినగానే ఆమడ దూరం పరిగెత్తుతుంటారు. 'గీతాంజలి' సినిమా ద్వారా ఎంతో పేరు సంపాదించుకున్న అంజలి పిల్లుల అరుపులకు భయపడి, తను ఉంటున్న ఫ్లాట్ ఖాళీ చేసేసి దూరంగా వెళ్ళిపోయింది. ఇంతకీ అసలు జరిగిందేమిటంటే ఇంతకు ముందు అంజలి ఉంటున్న ఫ్లాట్‌లో గత కొన్ని రోజుల నుంచీ అరుపులూ, సన్నగా ఏడుపులూ వినపడడం మొదలయ్యాయట! అవి ప్రతిరోజూ వినిపిస్తూ ఉండడంతో అంజలి భయపడి ఆ ఫ్లాట్ ఖాళీ చేసిందట! అంజలి వెళ్ళిన తరువాత అసలు సంగతి తెలిసిందట! ఆ ఫ్లాట్‌లో పిల్లి పిల్లల్ని పెట్టిందట! వాటి అరుపులు ఏడుపులనే అంజలి దయ్యంగా భావించి భయపడిందట!

లెట్ కమోడ్.

"ఎలా ఉంది?" వినయ్ అడిగాడు.

సంధ్య మౌనంగా హాల్లోకి నడిచింది. బాత్‌రూమ్ తలుపునీ, బెడ్‌రూం తలుపునీ మూస్తూ వినయ్ ఆమె దగ్గరగా వెళ్ళాడు.

"బావుందా?"

"బాగుంది. అయితే, నాకు నచ్చలేదు." సంధ్య మొహం చిట్లిస్తూ అంది.

"బావుందంటున్నావ్. నచ్చలేదంటున్నావ్!" వినయ్ నవ్వుతూ అన్నాడు.

"ఎందుకు నచ్చలేదో చెప్పనా?" సంధ్య అంది.

"ష్యూర్!"

"ఇది సింగిల్ బెడ్‌రూమ్ అపార్ట్‌మెంట్. సింగిల్ బెడ్‌రూం సెటప్ నాకు నచ్చదు."

వినయ్ అర్థం కానట్టు చూశాడు. "ఇద్దరమేగా సంధ్యా! మనకిది చాలు..?"

"చాలదు. చిన్న కొంపలో ఇరుగ్గా సర్దుకు పోవడం నా చేత కాదు. ఐ వాంట్ డబుల్ బెడ్ రూమ్ అపార్ట్‌మెంట్!"

వినయ్ ఆమె ముఖంలోకి తదేకంగా చూశాడు. సింగిల్ బెడ్‌రూమ్ ఫ్లాట్ అద్దె మన ఆదాయానికి సరిపడే అద్దె. డబుల్ బెడ్‌రూం అయితే అద్దె కూడా డబులవుతుంది. అదీగాక మనం ఫర్నీచర్ కొనాలి. మంచం కొనాలి. బెడ్స్ కొనాలి. ఇంకా ఎన్నోఎన్నో కొనాలి. సంసారం సెటప్ కావాలంటే ఆర్నెల్లపాటు అవీఇవీ కొంటూనే ఉండాలి. అదీగాక హౌస్ క్లీనింగ్ ప్రాబ్లం ఉంది. అపార్ట్‌మెంట్ పెద్దదయితే మెయిన్ టెనెన్స్ కూడా కష్టమవుతుంది..."

"పనిమనిషి చూసుకుంటుంది" సంధ్య నిర్ల క్ష్యంగా అంది.

"ఈ దేశంలో సర్వెంట్స్ దొరకరు. దొరికినా, భరించలేం" వినయ్ చిన్నగా నవ్వాడు.

"అద్దె విషయంలో మా నాన్నతో మాట్లాడతాను."

వినయ్ సంధ్య వైపు ఆశ్చర్యంగా చూశాడు. "సంధ్యా?"

"ఏం? మా నాన్నదంతా ముందుముందు నాదే. ఐమీన్ మనదే.." సంధ్య చిరునవ్వు నవ్వే ప్రయత్నం చేసింది.

వినయ్ నిట్టూర్చి, సంధ్య ముఖంలోకి సూటిగా చూశాడు. "సో...యూ వాంట్ టూ బెడ్‌రూమ్ అపార్ట్‌మెంట్!"

సంధ్య రెప్పలెత్తి, వినయ్ ముఖంలోకి చూసింది. "ఐ వాంట్ టూ బెడ్‌రూమ్ అపార్ట్‌మెంట్."

"అలాగే. అయితే అద్దె గురించి మీ నాన్నతో మాట్లాడాల్సిన అవసరం లేదు. అద్దె చెల్లించే శక్తి నాకుంది. మనిద్దరికీ రెండో బెడ్‌రూమ్ అవసరం ఉండదని అలా అన్నాను" వినయ్ అన్నాడు.

"ఐ షల్ గెట్ యూ ఏ టూ బెడ్‌రూం అపార్ట్ మెంట్!"

"థాంక్స్"

"కమాన్. అపార్ట్‌మెంట్ ఆఫీసుకెళదాం. టూ బెడ్‌రూమ్ సెటప్ ఉందేమో కనుక్కుందాం.

***

అదృష్టం బాగుంది. అదే బ్లాకులో టూ బెడ్ రూమ్ అపార్ట్‌మెంట్ దొరికింది. అద్దె దారుణం. అయినా వినయ్‌కి నచ్చింది. చూసిన వెంటనే సంధ్యకు నచ్చింది కాబట్టి, వినయ్‌కి నచ్చింది. సంధ్యకు నచ్చింది ఏదైనా సరే తనకు నచ్చుతుంది. అందుకు కారణం ప్రేమ. తనకు తెలుసు. భవిష్యత్తులో తను సంధ్య కళ్ళతో చూస్తాడు; సంధ్య చెవులతో వింటాడు. అందుకు కారణం సంధ్య పట్ల తనకున్న ప్రేమ. లవ్ ఎట్ ఫస్ట్ సైట్!

వినయ్ సంధ్యకు నచ్చిన ఫర్నీచర్ కొన్నాడు. సంధ్యకు నచ్చిన మంచాలు కొన్నాడు. సంధ్యకు నచ్చిన బెడ్స్ కొన్నాడు. సంధ్యకు నచ్చిన కర్టెన్స్ కొన్నాడు. ప్రేమగా కొన్నాడు.

సన్నీవేల్ నుండి శానోజేవైపు వినయ్ డ్రైవ్ చేస్తున్న ఆడీ ఉషారుగా పరుగెడుతోంది! ఇంట్లో చేరి ఇవాల్టికి మూడో రోజు. మొదటి రెండు రోజులు రాత్రిళ్ళు బాగా పొద్దుపోయేదాకా ఫర్నీచరూ, అవీ సర్దడానికే సరిపోయింది. తను టైం చూశాడు. రాత్రి ఒంటిగంట దాటింది. హాల్లో సోఫా మీద జీన్సు పాంటూ, టీ షర్టుతో ఆదమరిచి నిద్రపోతోంది సంధ్య. వినయ్ ఆమెనే చూస్తూ అలా నిలబడిపోయాడు. సంధ్య ఏ డ్రస్సులో అయినా అందంగానే ఉంటుంది అన్న కిరణ్ మాటలు గుర్తొచ్చాయి వినయ్‌కి. సంధ్య గురకపెట్టకుండా ప్రశాంతంగా నిద్రపోతోంది. మోసుకెళ్ళి మంచం మీద పడుకోబెట్టే ఆలోచనతో ముందుకు వంగాడు తను. మరుక్షణం ఆ ఆలోచ నకు స్వస్తిచెప్పి, బెడ్‌రూమ్‌లోకెళ్ళి రగ్గు తెచ్చి కద లిక తెలీకుండా జాగ్రత్తగా ఆమె మీద కప్పాడు. రెండో రోజు కూడా అంతే!

ఇవాల్టి పరిస్థితి వేరు. ఇల్లు సర్దడం నిన్న అర్ధ రాత్రితో పూర్తయింది. ఈ ఉదయం తమ కొత్త సంసారం, కొత్త కాపురం గాడినపడింది. ఇవాల్టితో తమ కొత్త దాంపత్యం కూడా గాడిన పడుతుంది. ఇవాల్టినుంచీ సంధ్య తనను 'ఏమండీ' అనడం మానేస్తుంది. 'వినయ్' అంటుంది. 'మీరు' అనడం మానేస్తుంది. 'నువ్వు' అంటుంది. సంధ్యను సరదాగా పిజ్జాహట్‌కు తీసికెళ్తాడు. ఆకలి తీరాక ఇంటికి తిరిగి వస్తారు. రాత్రి దుప్పటిలా ఇద్దర్నీ ఏకం చేస్తుంది. ఇన్నాళ్ళకి, ఏ హంగూ, ఆర్భాటం లేని 'తొలిరాత్రి' ఫలిస్తుంది. తన జీవితం, సంధ్య జీవితం ఒక్కటిగా కలిసి, 'తమ జీవితం'గా ఎదుగుతాయి. ఇప్పటిదాకా సామాన్య పురుషుడైన తను ఈ రాత్రితో పూర్ణ పురుషుడవుతాడు. ఇప్పటిదాకా సామాన్యస్త్రీగా ఉండి పోయిన సంధ్య పరిపూర్ణ స్త్రీగా ప్రమోట్ అవుతుంది. ఇద్దరి శరీరాలూ ఏకమవుతాయి. ఇద్దరి ఆత్మలూ ఏకమవుతాయి. దైహికమైన ఐక్యత ఆత్మల ఐక్య తకు ఆనందమార్గాన్ని వేస్తుంది.

అక్కడ ఇండియాలో తమ తొలిరేయి విజయ వంతమైనట్టు అమ్మానాన్నలను, అత్తమామలను నమ్మించాడు తను. ఇక్కడ అమెరికాలో దేహాల ఐక్యతతో తామిద్దరూ భార్యాభర్తలుగా రాణిస్తున్నట్టు కిరణ్ దంపతుల్ని నమ్మించాడు. నాటకాలాడి నమ్మిం చాడు. ఈ రాత్రి నుంచి నాటకాలు ఆడాల్సినపని లేదు. ఎవ్వర్నీ నమ్మించాల్సిన పని లేదు. వినయ్ పాదం ఏక్సిలేటర్ని అదుక్కి తొక్కింది. 'ఆడీ' ఉత్సా హంతో ముందుకు దూసుకెళ్ళింది.

***(ఇంకా వుంది)***




## అమ్మకోసం

*ఎంతకూ అంతుదొరకని సంద్రాన్ని*
*ఈది ఈది అలసిపోయావో.. అలిగిపోయావో*
*దుఃఖపుదారుల్లో నడచినడచి*
*నాలుగంటే నాలుగైన స్వప్నక్షణాలను*
*నీ కోసం మిగుల్చుకోకుండానే*
*మేల్కొన్నంత సహజంగా*
*నిద్రలోకి జారిపోయావెందుకు?*
*నువ్వయితే తిరిగి లేవకుండానే*
*తిరుగులేని పయనమై పోయావుగానీ*
*చీకటి గట్టు మీద నువ్వు వెలిగించిన దీపం*
*దిగులు కళ్ళతో నీ కోసం ఎదురు చూస్తూనే ఉంది.*
*చిన్నప్పుడు చేతిలోని గాలిపటం*
*చూస్తుండగానే పుటుక్కున తెగిపోయినప్పుడు*
*రెక్కల్లే పతంగులుగా ఎగరేయమన్నది నువ్వే కదా!*
*పరుగు పందెంలో బొక్కబోర్లాపడ్డప్పుడు*
*యుద్ధ వ్యూహాన్ని తీర్మానించింది నువ్వే కదా!*
*నేనిప్పుడు ఎగరేసిన వెలుతురు జెండా మీద*
*తడారని సంతకమూ నీదే కదా!*
*ఒక పసుప్పచ్చ ప్రవాహమై చప్పుడులేకుండా*
*నా జీవవాహికలోకి ప్రవేశించిన నువ్వు*



*ఉత్త జ్ఞాపకానివెలా అవుతావు?*
*నేను పూరించే గుండె చప్పుడే నీదైనప్పుడు*
*నన్నొదిలి ఎక్కడికి పోతావ్?*
*నాకు తెలుసు ఒక ప్రారంభం కోసమే*
*నువ్వు మరణించి ఉంటావు!*
*దూరంగా ఆకాశం నీడలో నిలబడి*
*పాలపుంత కళ్ళతో నేను చూస్తూనే ఉంటాను!*

**—శారద ఆవాల**

**సెల్:92956 01447**

# సెక్స్ టెక్ మార్కెట్

ప్రపంచవ్యాప్తంగా సెక్స్ టెక్నాలజీ మార్కెట్ పుంజుకుంటోంది. ప్రపంచవ్యాప్తంగా ఈ ప్రస్తుత మార్కెట్‌ను 30.6 బిలియన్ డాలర్లుగా అంచనావేస్తున్నారు. పలు 'రియల్ సెక్స్ డాల్ పరిశ్రమలు' సరికొత్త పంథాలో డాల్స్ తయారీకి పోటీ పడుతున్నాయి. జీ-స్పాట్ పంక్షనింగ్ మోడల్స్‌తోపాటు ఏ-1 కేటగిరీ డిజైన్ డాల్స్ తయారీకి ప్రాధాన్యమిస్తున్నారు. మార్కెట్‌లో 15 వేల డాలర్ల ధర చెప్పినా కూడా వీటిని వెనుకాడకుండా కొనుగోలు చేస్తారంటున్నారు. కదలాడే దవడలు, సహకరించే పెదాలు, అల్ట్రాసాఫ్ట్ టంగ్, సాఫ్ట్ సిలికాన్‌తో చేసిన పళ్ళు...ఇలా అన్ని అవయవాలు కస్టమర్లకు రియల్‌గా అనిపిస్తాయి.



జపాన్‌లో సెక్స్‌డాల్స్‌ను 1980 నుండే ఉత్పత్తి చేస్తున్నా అవన్నీ ప్లాస్టిక్‌వే. సిలికాన్ ఉపయోగించడంతో వీటి తయారీలో మార్పు వచ్చింది. రియల్ డాల్స్ తయారీలో పేరుగాంచిన Abyss Creations సి.ఇ.ఓ మట్ మెక్లెన్ మాట్లాడుతూ, హై గ్రేడ్ సిలికాన్‌తో సెక్స్ డాల్స్ తయారుచేయడంవల్ల గ్రేటర్ ఎలాస్టిసిటీ, నిజమైన అనుభూతి లభిస్తుందన్నారు. కృత్రిమ ఇంటెలిజెన్స్ గల సెక్స్‌డాల్స్ స్కాటిష్ లాంగ్వేజ్ యాక్సెంట్‌లో మాట్లాడ తాయని, రొమాంటిక్ లుక్స్, సిగ్గు, కొట్టొచ్చినట్టుండే సమ్మోహనంతో పాటు శృంగార భావాలొలికించే స్టాండర్డ్ సెక్స్ డాల్స్‌ను 18 రకాల ఆకృతుల్లో ఉత్పత్తి చేస్తామని ఆయనన్నారు.

యజమానులను గుర్తుపట్టే శక్తిమంతమైన జ్ఞాపక శక్తిని అమర్చడంవల్ల నిజమైన యజమానిని అనుమతించడంతోపాటు వారితో అనుబంధం నెరపేలా వ్యవహరిస్తాయట. జీవం ఉట్టిపడే ఈ సిలికాన్ సెక్స్ డాల్స్ శరీర అస్థిపంజరం అవసరమైనవిధంగా మలుచుకునేందుకు వీలుంటుంది. వీటి తయారీకి 80 గంటల సమయం పడుతుంది. కాలిఫోర్నియాలోని శాన్ మార్కోస్ కంపెనీ 1996 నుండి సెక్స్‌డాల్స్‌ను అన్ని దేశాలకు సరఫరా చేస్తోంది. ఇవి కొంత లెవెల్ వరకు కంపానియన్‌షిప్‌ను ఇస్తాయి. ఒంటరితనంతో పోరాడే వారికి ఉపశమనమిస్తాయి.

అయితే 'ట్రూ కంపానియన్' అనే కంపెనీ స్థాపించిన డగ్లస్ హైన్స్ 9/11 దాడుల్లో సన్నిహితురాలిని కోల్పోయిన తర్వాత రాక్సీ అనే సెక్స్‌డాల్‌ను తయారు చేశారు. లాస్‌వేగాస్‌కు చెందిన మరో సెక్స్‌డాల్ క్రియేటర్ రోబెర్టో కార్డినోస్ కూడా రియల్ డాల్స్ తయారు చేస్తున్నారు. బార్సిలోనాకు చెందిన సెర్గీ శాంతోస్ కూడా Samantha పేరుతో రియల్ ఫీలింగ్ కలిగించే డాల్ తయారు చేశారు. మనిషి స్పర్శ తగలగానే అది రెస్పాండ్ అవుతుంది.






**అమ్మ.. నాన్న..ఓ జీనియస్ !**
**నేటి పిల్లల్ని మేటి పౌరులుగా పెంచే కళ**
వేణు భగవాన్
**ధర:** 300 రూపాయలు
**పేజీలు:** 216
**ప్రతులకు:** పల్లవి పబ్లికేషన్స్, విజయవాడ

తమ పిల్లలు జీనియస్‌లుగా, విలువలు జీర్ణించుకున్న వారుగా తయారవ్వాలని తల్లిదండ్రులు కోరుకుంటారు! కోరుకున్నంత మాత్రాన ఆ కల నెరవేరుతుందా! పిల్లలు అలా తయారవ్వాలంటే ఏం చెయ్యాలో చాలామంది తల్లిదండ్రులకు తెలియదు. అలా తపనపడే తల్లిదండ్రులు తప్పక చదవాల్సిన పుస్తకమిది. ముఖ్యంగా తల్లిదండ్రుల కోసమే ఈ పుస్తకం.

**ప్రపంచ ప్రసిద్ధ ఉపన్యాసాలు**
**అనువాదం:** పి.వి.యస్.రాజు
**ధర:** 100 రూపాయలు
**పేజీలు:** 160
**ప్రతులకు:** పల్లవి పబ్లికేషన్స్ ,59-1-23/2, అశోక్ నగర్, విజయవాడ -10, సెల్: 98661 15655

మాటే మంత్రం. అది రాజ్యాల్ని కూల్చివేస్తుంది. లక్షలాదిమందిని దేనికైనా సమాయత్తం చేస్తుంది. హావభావాలతో కూడిన ప్రసంగాలు ఎందరినో సమున్నత స్థానాల్లో కూర్చోబెట్టాయి. క్రీస్తువంటివారి ప్రసంగాలు వేల సంవత్సరాలు గడిచినా చెక్కుచెదరలేదు. అలాంటి ముప్ఫైమంది మహనీయులు, ప్రపంచ ప్రముఖుల శక్తిమంతమైన ప్రసంగాల అనువాదాలే ఈ పుస్తకం.

**బహుజనులకు శరణ్యం**
**అంబేద్కర్ మార్గం**
డి.నటరాజ్
**ధర:** 150 రూపాయలు
**పేజీలు:** 264
**ప్రతులకు:** పల్లవి పబ్లికేషన్స్, విజయవాడ

రాజీలేని అంబేద్కరిస్టు, ప్రకృతి ప్రేమికుడు, దీక్షా దక్షత, నీతినిజాయితీలు జీర్ణించుకున్న రచయిత నటరాజ్ రాసిన పుస్తకమిది. దళిత, బహుజనోద్యమ ప్రభావంతో అనుభవపూర్వకంగా రాసిన 19 వ్యాసాల సంపుటి ఈ పుస్తకం.



**తేట తెలుగు జాతీయాలు**
డాక్టర్ పమిడి శ్రీనివాస తేజ
**ధర:** 250 రూపాయలు
**పేజీలు:** 352
**ప్రతులకు:** పల్లవి పబ్లికేషన్స్, విజయవాడ.

తెలుగునుడి ప్రేమికుడు, తెలుగు పరిశోధకుడు, మనసు వైద్యుడు డాక్టర్ శ్రీనివాస తేజ. తెలుగువారి నోళ్ళలో నానుతున్న జాతీయాలను ఏరి వడగట్టి ఈ పుస్తకం తయారు చేశారు ఈ రచయిత. ఇందులో సుమారు 17 వేలకు పైగా తెలుగు జాతీయాలున్నాయి. ఈ పుస్తకం చదివితే అచ్చ తెలుగు భాష ఎలా ఉంటుందో తెలుస్తుంది.

**సైన్స్ సందేహాలు**
వైజ్ఞానిక పరికరాలు
(ఆవిష్కర్తలు, పనిచేయు విధానం)
వి.వి.యస్.యస్.రామారావు
**ధర:** 99 రూపాయలు, **పేజీలు:** 128
**ప్రతులకు:** పల్లవి పబ్లికేషన్స్, 59-1-23/2, అశోక్ నగర్, విజయవాడ -10. సెల్: 98661 15655.

నిత్యజీవితంలో మనం ఉపయోగించే వస్తువులు ఏ పద్ధతిలో ఎలా పనిచేస్తాయో వివరించే పుస్తకమిది. రేడియో మొదలు రాకెట్ వరకు 50కి పైగా వస్తువుల గురించి చక్కగా అర్థమయ్యేలా రాసిన పుస్తకమిది.



## స్వీకారాలు

**శ్రీసాయివిష్ణు సహస్రనామములు**
నిత్యపారాయణ గ్రంథం
బ్రహ్మశ్రీ ఆనందసాయి స్వామి
**ధర:** 250 రూపాయలు
**పేజీలు:** 346
**ప్రతులకు:** శ్రీ శిరిడిసాయి ప్రేమపీఠం, పి.ఆనందసాయి జగన్నాథ్, ఇ.నెం 124-133, ఐశ్వర్య హోమ్స్, చందానగర్, హైదరాబాద్-50
**సెల్:** 93964 30043

**నమకచమకాలు**
డా.తాడేపల్లి పతంజలి
**ధర:** 120 రూపాయలు
**పేజీలు:** 208
**ప్రతులకు:** గుడిపాటి శ్రీరామకృష్ణశర్మ, 17-25, ధర్మపురి కాలనీ, ఉప్పల్, హైదరాబాద్-38
**సెల్:** 94904 69300

—లలితా త్రిపుర సుందరి

# లేటు వయసులో ఘాటు ప్రేమ



**ప్రేమ...!**
**నిర్వచించలేనిది.**
**మాటలకందని మధురానుభూతి కలిగిస్తుంది.**
**ఈ అందమైన భావన గురించి ఎంతచెప్పినా తక్కువే.**
**అందులో ఏ మాత్రం అతిశయోక్తి లేదు.**
**ప్రేమ ఎప్పుడు ఎవరిమధ్య పుడుతుందో ఎవరూ చెప్పలేరు.కులమతాలు, వర్ణ భేదాలు, ఆస్తి అంతస్తుల భేద భావాలకు అతీతం ప్రేమ.**
**అంతేకాదు, దానికి వయసు తారతమ్యం కూడా ఏమీ ఉండదని నిరూపిస్తున్నాయి కొన్ని వృద్ధ జంటలు .**

వయసులో ఉండగా ప్రేమ, పెళ్ళి మామూలే. అందులో ప్రత్యేకతేమీ లేదుగానీ వయసుడిగిన సమయంలో పెళ్ళి చేసుకోవడం అదీ ప్రేమించి పెళ్ళిచేసుకోవడం అంటే, కాస్త ఆశ్చర్యపోవాల్సిన విషయమే. ఇప్పుడు చెప్పబోయే ప్రేమికులు అలాంటివాళ్ళే. ఒకరేమో ప్రేమించి పెళ్ళిచేసుకుంటే, మరొకరు ప్రేమించి ఎంగేజ్‌మెంట్ చేసుకున్నారు. ఇంకో స్టోరీలో ప్రేమించిన బామ్మ కోసం ఏకంగా ఆస్తినే వదిలేశాడు ఓ తాత. మరో స్టోరీలో పాపం ప్రేమలో పడి మోసపోయింది ఓ బామ్మ. ఆ లేటు వయసు ఘాటు ప్రేమలేంటో మీరూ చదివేసేయండి!

## యువజంట కాదు వృద్ధజంట

వధువు వయసు 106, వరుడు వయసు 66. ఇద్దరి మధ్యా నలభైయేళ్ళ తేడా ఉన్నా ఇద్దరి మనసులూ జతకలిశాయి. పీకల్లోతు ప్రేమలో మునిగిపోయారు. ఇంకేముందీ పెళ్ళితో ఒక్కటవ్వాలని నిశ్చితార్థం కూడా చేసేసున్నారు.

బ్రెజిల్‌లోని పిరసునుంగా పట్టణంలోని నోసా సెనోరా ఫాతిమా వృద్ధాశ్రమం ఉంది. ఆ ఆశ్రమంలో వేర్వేరు గదుల్లో నివాసముంటున్నారు వాల్డేమిరా రోడ్రిగ్యూన (106), అపరెసిడో దియాన జాకబ్ (66).

'ప్రాజెక్ట్ ఆఫ్ డ్రీమ్స్' అనే స్థానిక వాలంటీర్ గ్రూపు ఆ ప్రాంతంలో నివసించే వారి కోరికలను తెలుసుకునే క్రమంలో వారికి ఒక విచిత్రమైన విషయం తెలిసింది. అదేంటంటే అరవై ఆరేళ్ళ జాకబ్, నూటారేళ్ళ వాల్డేమిరా ప్రేమలో ఉన్నారని! దీంతో ఆ బృందం వీరిని వ్యక్తిగతంగా సంప్రదించి వారి కలలేంటో తెలుసుకునే ప్రయత్నం చేసింది. ఇక్కడ ఆశ్చర్యమేమిటంటే మేమిద్దరం పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాం అని ఇద్దరూ విడివిడిగా తమ మదిలోని భావాలు వ్యక్తపరిచారు. ఇలా తామిద్దరికీ ఒకరి మనసులో మరొకరం ఉన్నామన్న విషయం వెల్లడైంది. దాంతో వారి ప్రేమకు లైన క్లియర్ అయింది.

## ఘనంగా నిశ్చితార్థం

ఈ వృద్ధ ప్రేమికుల పెళ్ళికి అందరూ సంతోషం వ్యక్తం చేసినప్పటికీ వైద్యులు మాత్రం ఆ జంట ఆరోగ్యం, వయసు దృష్టిలో పెట్టుకుని పెళ్ళికి ససేమిరా అన్నారు. దీంతో వీరిద్దరూ మేము ఒకర్ని విడిచి మరొకరం ఉండలేం అనడంతో ఆ

## మోసపోయిన బామ్మ!

ఆన్‌లైన్ ప్రేమలవల్ల మోసపోతున్న అభాగ్యులెందరో ఉన్నారు. అలాంటి వారిలో ఈ బామ్మ కూడా ఒకరు. అరవైనాలుగేళ్ళ వయసులో ఓ అనామకుడితో ఆన్‌లైన్ ప్రేమకు పచ్చజెండా ఊపేసింది. ఆమె ఉండేది మనదేశంలోనే, ఆ ప్రేమికుడు ఉండేది లండన్‌లో. ఫేస్‌బుక్‌లో పరిచయమైన అతగాడు ఫేక్ లవ్‌తో 94.5 లక్షల రూపాయలు బామ్మకు టోకరా వేశాడు. ఆ తర్వాత ఏముంది... జండా ఎత్తేశాడు. అసలే లేటు వయసులో ఉన్న బామ్మకాస్తా విషయం తెలుసుకునేసరికి లేటైపోయింది. ఈ అరవైనాలుగేళ్ళ వృద్ధురాలు పూనేలోని కేంద్రప్రభుత్వం అధీనంలో నడిచే ఓ పరిశోధనా సంస్థలో పనిచేసి పదవీ విరమణ పొందారు. భర్త ఇటీవలే మరణించాడు. కూతురు యూఎస్‌లో ఉంటుంది. ఒంటరితనం ఫీలయ్యే ఆ బామ్మ, ఫేస్‌బుక్‌లో తనకు పరిచమయ్యే స్నేహితులతో కాలక్షేపం చేస్తూ కాలం గడుపుతోంది. ఈ సోషల్ మీడియాలో హార్లీ బెన్సన్ అనే లండన్ వాసి బామ్మకు ఫ్రెండ్ రిక్వెస్ట్ పెట్టాడు. వెంటనే బామ్మ నుంచి ఫ్రెండ్‌షిప్‌కు గ్రీన్ సిగ్నల్ రాగానే బెన్సన్ ఎగిరి గంతేశాడు. దీంతో త్వరలోనే ఇద్దరూ ఫోన్ నెంబర్లు ఒకరికొకరు ఇచ్చిపుచ్చుకున్నారు. ఉదయం, సాయంత్రం, రాత్రీ.. కాలంతో పనిలేకుండా వాట్సాప్‌లో ప్రేమ సందేశాలు తర్జుమా అయ్యాయి. ఆ బామ్మను పెళ్ళి చేసుకుటానని బెన్సన్ మాటివ్వడంతో బామ్మ హృదయం కరిగిపోయింది. ఆమెకోసం లండన్ నుంచి వస్తున్నట్లు కబురు పంపాడు.



ఆమె కోసం బంగారం, విలువైన నగలు, వజ్రాలు తెస్తున్నట్లు చెప్పాడు. అలా చెప్పిన కొన్ని రోజులకే ఢిల్లీ ఎయిర్‌పోర్టులో తాను తీసుకొస్తున్న ఆభరణాలకు జరిమానా కట్టాలని అధికారులు నిర్బంధించారని బామ్మకు సమాచారం ఇచ్చాడు. తన దగ్గర డబ్బు లేదని చెప్పడంతో అప్పటికే బెన్సన్‌తో పీకల్లోతు ప్రేమలో మునిగిపోయిన బామ్మ..ఇన్నాళ్ళుగా కూడబెట్టుకున్నదంతా బెన్సన్ ఇచ్చిన బ్యాంకు అకౌంట్లకు పంపించింది. ఓ ప్లాటు కూడా అమ్మి మొత్తం 94.5 లక్షల రూపాయలు బెన్సన్ ఖాతాల్లో జమచేసింది. ఇంకేముంది అంత డబ్బు బ్యాంకు ఖాతాల్లో పడ్డాక లెక్క సరిచూసుకున్న బెన్సన్ అకౌంట్ ఎత్తేశాడు. దాంతో లేటు వయసులో 'ఘాటు' ప్రేమకు బలయ్యానని కాస్త ఆలస్యంగా తెలుసుకున్న ఆ బామ్మ స్థానిక పోలీస్ స్టేషన్‌లో కంప్లయింట్ ఇచ్చింది.

వాలంటీర్ బృందం ఒక నిర్ణయానికి వచ్చింది. వీరి ద్దరి నిశ్చితార్థం ఘనంగా చేయాలనే ఉద్దేశంతో వృద్ధాశ్రమంలోనే అందుకు సంబంధించిన ఏర్పాట్లు పూర్తి చేసింది.

రోజాపూలు, బెలూన్లు కేక్, ప్రేమకు చిహ్నంగా భావించే కొన్ని వస్తువులతో ఆ ప్రాంగణాన్ని అందంగా ముస్తాబు చేశారు. వాల్డా తెలుపు రంగు గౌనులో ముత్యాల హారం ధరించగా జాకబ్ నలుపు, తెలుపు సూట్ ధరించి వేదిక వద్దకు చేరుకున్నారు. అనం తరం ఇద్దరూ ఉంగరాలు మార్చుకుని ముద్దాడుకోవ డంతో ఎంగేజ్‌మెంట్ ముగిసింది. అక్కడికి వచ్చిన వారంతా వీరిని ఆశీర్వదిస్తూ వారిపై పూలు చల్లారు.

### తొలిచూపులోనే

కొందరికి తొలి చూపులోనే ప్రేమ పుడుతుంది. ఈ జంట ప్రేమ కూడా అలానే మొదలైంది. వాల్డేను తొలిసారి చూడగానే ప్రేమలో పడిపోయాడట జాకబ్. వాల్డేమిరా తనకన్నా పెద్దదైనా అదేమీ పెద్ద విషయం కాదంటున్నాడు. దీనికి కారణం ఆమె అతన్ని ఎప్పుడూ సంతోషంగా ఉండేలా చూస్తుంది. ఇక వాల్డేమిరా విషయానికి వస్తే జాకబ్ లేకుండా ఒక్క క్షణం కూడా ఉండలేనంటోంది. ఎంతో ఇష్టం తనకి. ఒకవేళ జాకబ్ చనిపోతే తను కూడా చనిపోతానని చెబుతోంది. ఇలా తామిద్దరినీ తమ మధ్య ఉండే ప్రేమనూ ఎవరూ విడదీయలేరని చెప్ప కనే చెబుతోందీ జంట. వృద్ధాశ్రమంలో ఆ జంట ప్రతిరోజూ చాటింగ్‌లు చేసుకోవడం, కలిసి కూర్చో వడం, కలిసి భోజనం చేయడం, కలిసి సమయం గడపడం వంటివి చేసేవారు.

### ఆ ఇద్దరూ బ్యాచిలర్సే

ఇక్కడ ఆశ్చర్యకరమేంటంటే వీరిద్దరికీ ఇంత వయసొచ్చినా ఇద్దరిలో ఏ ఒక్కరూ ఇప్పటివరకు ఇంకా పెళ్ళి చేసుకోలేదు. ఎందుకంటే ఈ జంట ఇలా ఒక్కటవ్వాలని ఆ దేవుడు ముందే ఇలా రాసిపెట్టా డేమో! అక్కడివారంతా ఇదే అనుకుంటూ సంతోషం వ్యక్తం చేస్తున్నారు. ఇక్కడ మరో విషయమేం టంటే వారికి ఎవరూ లేరు కూడా. పక్షవాతం కార ణంగా జాకబ్‌కి ఎడమచేయి పనిచేయదు. దీంతో ఆయన ఉద్యోగం కూడా చేయలేక 19 ఏళ్ళ క్రితమే వృద్ధాశ్రమంలో చేరారు. ఇక వాల్డేమిరాకి ఉన్న చుట్టాలు స్నేహితుల్లో కూడా చాలామంది చనిపోయారు దీంతో వీరిద్దరూ ఇలా వృద్ధాశ్రమంలోనే కాలం వెళ్ళదీస్తున్నారు.

### చైనాలో నిజంగా జరిగిన తెలుగు సినిమా కథ

'నువ్వొస్తానంటే నేనొద్దంటానా' సినిమా గుర్తుందా? అందులో సిద్ధార్థ్ తను ప్రేమించిన అమ్మాయికోసం కోట్ల ఆస్తి కాదనుకుని ప్రేయసి ఇంటికి వచ్చి రైతుగా మారిపోతాడు. అచ్చం అలాంటి సంఘటనే ఒకటి చైనాలో జరిగింది. అయితే కొడుకు ఆస్తిని వదిలేయడం కాదు. తండ్రే తన ప్రేయసి కోసం కోట్ల ఆస్తిని, కొడుకులను సైతం వది లేసి దేశంకాని దేశానికి వెళ్ళాడు. స్పెయిన్‌కి చెందిన 57 ఏళ్ళ యో నానన్ కోట్లు సంపాదించాడు, యో తన పరిశోధన బృందంతో ఓసారి చైనాలో పర్యటించినపుడు జిజియాంగ్‌లోని ఓ మారుమూల గ్రామంలో లూ లిజియన్‌ను కలిశాడు. లూ పేదరి కంలో ఉన్న వితంతు రైతు. ఆమె కూతురు అరు దైన వ్యాధితో బాధపడుతోంది. అయినా లూ ధైర్యంగా జీవితాన్ని కొనసాగి స్తున్న తీరు చూసి యో ఆమెతో ప్రేమలో పడ్డాడు. అదే విషయం లూకి తెలిపాడు.

ఆయన్ను చేసుకుంటే లూ సమస్యలన్నీ తీరి పోయేవే. కానీ అందుకు ఆమె ఒప్పుకోలేదు. సకల సౌకర్యాలతో సంతోషంగా ఉండే ఆ సంపన్నుడైన యో పై తన సమస్యలు మోపడం ఇష్టంలేక అతని ప్రేమ తిరస్కరించింది. దీంతో స్పెయిన్‌కి తిరిగి వెళ్లిపోయిన యో తన ఆస్తులన్నీ కుమారుల పేరున రాసి, కట్టుబట్టలతో నెలరోజుల్లోపే తిరిగి లూ ఇంటికి వచ్చేశాడు. యో ప్రేమను అర్థం చేసు కున్న లూ అతన్ని భర్తగా అంగీకరించింది. ప్రస్తుతం వారిద్దరూ గ్రామంలోనే ఓ వసతి గృహం నిర్వ హిస్తూ సంతోషంగా ఉన్నారు. 57 ఏళ్ళ వయసులో ప్రేమ కోసం కష్టపడి సంపాదించిన కోట్ల ఆస్తుల్ని వదిలేసి వచ్చిన యో, ప్రేమకు వయస్సు, డబ్బుతో పనిలేదని రుజువు చేశాడు.

## కుర్రాడితో బామ్మ పెళ్ళి!!



రాంగ్‌కాల్‌లో ఎవరో అమ్మాయి ఫోన్ చేస్తే ప్రేమలోపడి పెళ్ళి చేసుకున్న లవ్‌స్టోరీలు మనకు తెలుసు. కానీ ఆ ఫోన్ చేసిన భామ బామ్మైతే? ఈ ముసలామెకి నాతో ఏం పనిరా దేవుడా అనుకుంటారు చాలామంది. కానీ సోఫి యన్ లోహో అనే యువకుడు మాత్రం గొంతు నచ్చిందని ఏకంగా బామ్మనే పెళ్ళాడాడు.

ఇండోనేసియాకి చెందిన 28 ఏళ్ళ సోఫియన్ ఓ మెకానిక్. ఓ రోజు సోఫియన్‌కి తెలీని నెంబర్ నుంచి ఫోన్ వచ్చింది. అవతల వైపు మార్తా అనే ఓ 82 ఏళ్ళ వృద్ధురాలు మాట్లా డుతోంది. అది రాంగ్ నెంబర్ అయినా సోఫియన్‌కి ఆమె గొంతునచ్చి ఏకంగా గంటసేపు మాట్లాడుతూనే ఉన్నాడు.

సోఫియన్‌కి మార్తా గొంతు ఎంతగా నచ్చేసిందంటే, ఆమెతో రోజూ గంటల కొద్దీ చాటింగ్ చేసేవాడు. ఇలా ఒకర్నొకరు చూసుకోకుండా ఏడాదిపాటు ఫోనులోనే ప్రేమించుకున్నారు. ఏడాది గడిచినా మార్తా తన వివరాలు సోఫియన్‌కి చెప్పలేదు. విషయం తెలీక సోఫియన్ మార్తాని కలవడానికి ఆమె ఇంటికి వెళ్ళాడు. తాను కలలు కన్న అమ్మాయి ఎంతో అందంగా ఉంటుందని ఆశ పడిన సోఫియన్ ఆమెని చూడగానే షాకయ్యాడు. తాను ఇష్టపడింది ఓ వృద్ధురాలినని తెలిసి బాధ పడినా ఆమెతో మనసారా మాట్లాడిన మాటలు నిజమేనని భావించి ఆమె కుటుంబ సభ్యుల సమక్షంలోనే మార్తాని వివాహం చేసుకున్నాడు.

### గిన్నిస్ రికార్డుల్లో..



ప్రేమించడానికి పెళ్ళి చేసుకోవడానికి వయసు అడ్డంకులు లేవని నిరూపించిందో వృద్ధ జంట. లేటు వయసులో వివాహం చేసుకుంది. ఆ వివాహం గిన్నిస్‌బుక్ రికార్డుల్లోకి ఎక్కింది. లేటంటే ఎంత అనుకునేరు మామూలు లేటు కాదు... వరుడికి 103 ఏళ్ళు వధువుకి 91 ఏళ్ళు. ఇంత ముదిమి వయసులో వీరు 50 మంది కుటుంబసభ్యులు, ఓ గిన్నిస్ ప్రతినిధి సమక్షంలో వైభవంగా పెళ్ళి చేసుకున్నారు. వరుడు జార్జ్ కిర్బీ పుట్టినరోజునాడు వీరిరువురి వివాహం జరిగింది. అతన్ని వీల్‌చైర్‌పై తోసుకుంటూ వచ్చింది వధువు డోరిన్ లక్కీ. ఆ తర్వాత వేలికి ఉంగరం తొడిగింది. తొలుత వీరి ప్రేమకు ఎప్పుడు బీజం పడిందంటే వీరిద్దరూ 1988లో కలుసుకున్నారు.

అప్పటికి కిర్బీ వైవాహిక బంధం విఫ లంకాగా, లక్కీ తన భర్తను కోల్పోయి అప్ప టికి మూడేళ్ళు. వారిద్దరిమధ్య ప్రేమ చిగు రించింది. వీరి వివాహం జరిగింది. ఇప్పుడు వీరికి ఏడుగురు బిడ్డలు, 15 మంది మనుమలు, ఏడుగురు మునిమను మలు ఉన్నారు.

—సంతోషలక్ష్మి దహగాం



# సాఫ్ట్‌వేర్‌లో సరిగమలు

23

- కంఠంనేని స్వప్న



**సర్వర్ రూమ్‌లో కూర్చుని అత్యంత ఏకాగ్రతతో పని చేసుకుంటున్నాడు సాకేత్.**
**అప్పటికి అతను ఆ కంపెనీలో చేరి రెండు నెలలవుతోంది.**
**సర్వర్ రూమ్స్‌లోకి అందరూ వెళ్ళే వీలుండదు. నెట్‌వర్క్, సిస్టమ్స్, డేటాబేస్ అడ్మినిస్ట్రేటర్లకీ, వాళ్ళ మేనేజర్లకీ, కంపెనీలో అత్యున్నతస్థాయి అధికారులకు మాత్రమే అక్కడికి ఆక్సెస్ ఉంటుంది.**

సాకేత్ సిస్టమ్స్ అడ్మినిస్ట్రేటర్‌గా పని చేస్తున్నాడు.

డోర్ శబ్దం చేస్తూ తెరుచుకుంది.

వెనక్కి తిరిగి చూశాడు సాకేత్.

అతని మేనేజర్.

సాకేత్ పనిచేస్తున్న మానిటర్ వైపు కళ్ళార్పకుండా రెండు నిమిషాలు చూశాడు.

అతని భుజం తట్టి అన్నాడు.

"గుడ్‌జాబ్ మై బోయ్. నీ అంత డెడికేటెడ్‌గా పనిచేసేవాళ్ళని నేనింతవరకూ చూడలేదు. నువ్వు జాయిన్ అయిన తర్వాత ఒక్క ఎస్కలేషన్ కానీ, సర్వర్‌డౌన్ అనే కంప్లయింట్ కానీ లేదు. కీపిటప్!"

నవ్వాడు సాకేత్.

"రోజంతా ఈ గడ్డ కట్టించే చలిలో కూర్చుని ఉంటావు. మిగతావాళ్ళు అటూ ఇటూ తిరిగి వస్తుంటారు. నీకు బోర్ అనిపించదా? చలి పుట్టదా?" అడిగాడు కుతూహలంగా అతని మేనేజర్.

"ఫుడ్ పెట్టే జాబ్ బోర్ ఎలా అనిపిస్తుంది? చలి అలవాటైపోయింది" చెప్పాడు సాకేత్.

"ఓకే, నేను వెళ్ళాలి. ఏదైనా అవసరముంటే కాల్‌చేయి" చెప్పి వెళ్ళిపోయాడతని మేనేజర్. కాటమరాయుడు సినిమాకి టికెట్లు దొరికాయట. అడ్డొచ్చిన వాళ్ళని నరికేసి అయినా వెళ్ళిపోవాలన్నంత ఉత్సాహంలో ఉన్నాడు.

తనకి చలి ఎందుకుంటుంది? మనసులోని బాధ ఒళ్ళంతా దహించివేస్తోంది. బయటి చలి తననేమి చేయగలుగుతుంది?

గుడ్ జాబ్ అంట. తొక్కలో జాబ్.

కాలిఫోర్నియాలో దీనిని మించిన కంపెనీలో ఆర్కిటెక్ట్‌గా ఉన్న తను ఇండియా తిరిగొచ్చి ఈ కంపెనీలో చేరింది ఒక ధ్యేయంతో కదా. వచ్చినపని అయిపోగానే వెనక్కి వెళ్ళిపోవాలి. ఇండియాలో ఎన్నెన్ని స్కామ్‌లో, ఎన్నెన్ని కుట్రలో ఈ మధ్యే తనకు అర్థం అవుతోంది.

ఆలోచిస్తున్నాడు సాకేత్.

డేటా సెంటర్ కొత్తగా మొదలెడతారట ఈ కంపెనీ వాళ్ళు.

దాని పర్యవేక్షణ బాధ్యతలు తనకి అప్పగిస్తామంటున్నారు.

మరో పది రోజుల్లో తనని అక్కడికి వెళ్ళమంటారు.

ఈలోగానే వచ్చిన పని పూర్తి చేసుకుని రిజైన్ చేసేయాలి.

ఒక్క నిమిషం కూడా టైమ్ వృథా అవకూడదు.

వేగంగా టైప్ చేస్తున్నాడు.

ప్రేమ విఫలమై కంపెనీ బిల్డింగ్ మీద నుంచి దూకి ఆత్మహత్య చేసుకుందని ప్రచారం జరిగిన మానసకి పిన్ని కొడుకతను. మానస వాళ్ళ ఇంట్లోనే అతనూ పెరిగాడు చిన్నప్పుడు. ఆమెకి అత్యంత సన్నిహితుడు.

వాళ్ళిద్దరూ ప్రతి విషయమూ షేర్ చేసుకునే వారు.

ఉద్యోగరీత్యా అతను అమెరికా వెళ్ళిపోగా, మానస ఈ కంపెనీలో చేరిందప్పటిలో.

ఆమె చనిపోయిందనే విషయం అతనిప్పటికీ జీర్ణించుకోలేకపోతున్నాడు. పైగా ఆమె చావు గురించి వచ్చిన రకరకాల వార్తలు అతన్ని మరింత షాక్‌కి గురిచేశాయి.

మానసకి సంబంధించిన ప్రతి విషయమూ



తనకి తెలుసు. ఆమెకి బాయ్‌ఫ్రెండ్ ఉండడమనేది పచ్చి అబద్ధమని తెలుసు. ఆమెని మళ్ళీ బ్రతికించి తీసుకురాలేకపోయినా, ఒక సోదరుడిగా ఆమె డిగ్నిటీని కాపాడాల్సిన బాధ్యత తనకుంది.

అందుకే ఇంట్లోవాళ్ళకి కూడా చెప్పకుండా ఇండియా వచ్చేశాడతను.

పోగొట్టుకున్న చోటే వెతకాలంటారు.

అదే కంపెనీలో ఉద్యోగం సంపాదించాడు.

### జరిగిన కథ

అక్షయ్, కావ్య, సీమ, హర్ష ఓ మల్టీనేషనల్ కంపెనీలో పనిచేస్తుంటారు. అక్షయ్ వాళ్ల అక్కా, బావ యాక్సిడెంట్‌లో చనిపోవడంతో, వారి కూతురు నైరాని తన సంరక్షణలోకి తీసుకుంటాడు అక్షయ్. ఒకరోజు నైరా కనిపించకుండా పోతుంది. పేపర్లలో వచ్చిన వార్తల ఆధారంగా, ఇన్‌స్పెక్టర్ శ్రీకాంత్ ఇచ్చిన సమాచారం మేరకు నైరా ఆచూకీ కోసం రకరకాలుగా ప్రయత్నిస్తుంటాడు అక్షయ్. ఆ ప్రయత్నాల్లో భాగంగా ఎంతోమంది చిన్న పిల్లలను కాపాడతాడు. నైరా ఆచూకీ కోసం కావ్య ఒక ఆన్‌లైన్ డిటెక్టివ్‌ను కాంటాక్ట్ చేస్తుంది. ఆఫీసులో వాళ్ళందరూ లియోనియా రిసార్ట్స్‌కి వీకెండ్ టూర్‌కి వెళతారు. అక్కడ సీమ రాజేష్‌ని ముప్పతిప్పలు పెడుతుంది. కావ్య రూంకి వెళ్ళిన రాజేష్‌ని కొట్టిస్తుంది. ఇంతలో అక్షయ్‌ని పోలీసులు అరెస్టు చేస్తారు. అయితే అక్షయ్‌ని అరెస్టు చేసిన డీఎస్పీ నిర్వాకాన్ని అతడికి తెలియకుండా సోషల్‌మీడియా ద్వారా అందరికీ తెలిసేలా చేస్తాడు అక్షయ్. దాంతో డీఎస్పీని ఉద్యోగం నుంచి తొలగిస్తారు.

ఆ తర్వాత...



నిజానికి అతను సిస్టమ్స్ అడ్మినిస్ట్రేటర్ కాదు. అయినా పదిరోజుల్లో దానికి సంబంధించిన ఆన్‌లైన్ కోర్సులు పూర్తిచేసి, బుక్స్ చదివి ఇంటర్వ్యూకి ప్రిపేరయ్యాడు. ఉద్యోగం సంపాదించాడు.

కంపెనీకి సంబంధించిన ప్రతి విషయమూ సర్వర్ రూమ్ ద్వారానే బయటికి వెళ్ళాలి. అందుకే ఆ ఉద్యోగాన్ని కోరుకున్నాడతను. ప్రతి ఈ-మెయిల్‌కీ అతని ఆక్సెస్ ఉంది. అప్పటికి చాలా విషయాలు సేకరించాడు.

మానస ఈ-మెయిల్స్ బయటికి వెళ్ళకుండా ఆడ్ చేసిన ఫిల్టర్స్‌ని చూడగానే అర్థమయిపోయిందతనికి.

"ఫౌల్ ప్లే!"

ప్రతిదానికీ సంబంధించిన ఆధారాలు తీసిపెట్టుకుంటున్నాడు.

మేనేజ్‌మెంట్‌కి ఉన్న లావాదేవీలు, వాటాలు... కొన్ని ఈ-మెయిల్స్ చూస్తుంటే స్పష్టంగా అర్థమై పోతోందతనికి.

డిలీటెడ్ మెయిల్స్‌ని రికవర్ చేసే సాఫ్ట్‌వేర్‌లు డౌన్‌లోడ్ చేసి ప్రయత్నించాడతను. మానస చనిపోయిందంటున్న రోజుకి సంబంధించిన ఈ-మెయిల్స్‌ని రికవర్ చేయటానికి ప్రయత్నిస్తున్నాడు.

60 రోజులు మాత్రమే రికవర్ చేయగలిగేలా సెట్టింగ్ ఉందా సర్వర్‌లో.

దానితో ఏ సాఫ్ట్‌వేర్ అతనికి సహాయపడట్లేదు.

తనే కోడ్ రాసి స్క్రిప్ట్ రన్ చేసి ఆ రోజు మెయిల్స్‌ని రిట్రీవ్ చేసే ప్రయత్నంలో ఉన్నాడు.

రాయటం ముగించి కోడ్ రన్ చేశాడు.

కంపెనీలో గత రెండు నెలలుగా డిలీట్ చేసిన మెయిల్స్ అన్నీ సర్వర్‌లోకి వరదలా వచ్చి పడుతున్నాయి.

"అబ్బా తన్నింది" తల పట్టుకున్నాడు.

సర్వర్ సైజ్ అంత ఫ్లో తట్టుకోలేక డెడ్ స్లో అయింది.

ఎవరికైనా సందేహం వస్తే బుక్ అయిపోతాడు తను.

గబగబా స్క్రిప్ట్ రన్ చేసి వాటిని డిలీట్ చేశాడు.

మళ్ళీ కోడ్‌లో కొన్ని ఛేంజెస్ చేసి రన్ చేశాడు.

చెమటలు పడుతున్నాయతనికి.

మానస యూఎస్ మేనేజ్‌మెంట్‌కి పంపిన ఈ-మెయిల్ కనబడుతోందతనికి. ఆ రోజు, అంతకు ముందురోజు ఆమె పంపిన ఈ-మెయిల్స్ ఏవీ డెలివరీ అవలేదని అర్థమైంది సాకేత్‌కి.

అంటే మానస మెయిల్స్ పంపే అవకాశాలున్నాయని ఎవరికో ముందుగానే తెలుసు. అంతకుముందు రెండు నెలల వరకూ మానస మెయిల్ బాక్స్‌లో ఉన్న ఈ-మెయిల్స్



## చిన్న హీరోల పక్కన నటించదా?

మెహ్రీన్ కౌర్...తొలి సినిమాతోనే మంచి విజయం అందుకుని పలువురు దర్శకనిర్మాతల కంట్లో పడడమే కాదు, చాలా మంది మెహ్రీన్ కావాలని కోరుకునే స్థాయికి ఎదిగిన హీరోయిన్. ఇంతలా అందరూ కోరుకుంటున్న ఈ అమ్మడికి ఇద్దరు మెగా హీరోల పక్కన నటించేందుకు అవకాశం వచ్చింది. ఇంకేముంది? మెహ్రీన్ ఎక్కడికో వెళ్ళిపోయిందని అందరూ నమ్మేశారు. ఉన్నట్టుండి ఆ సినిమాల నుంచి మెహ్రీన్ తప్పుకున్నట్టు వార్తలు వచ్చాయి. అందరూ ఈమెను తప్పించేశారనే అనుకున్నారు కానీ, జరిగింది వేరట! మెహ్రీన్ చేతికి ఓ పెద్ద ప్రాజెక్టు వచ్చిందట! ఈ సినిమాలకి డేట్లు ఇస్తే ఆ సినిమా ఛాన్స్ మిస్ అయ్యే అవకాశం ఉండడంతో ఈ సినిమాలకి కావాలనే హ్యాండ్ ఇచ్చిందనే ప్రచారం జరుగుతోంది. ఈ ఇద్దరు చిన్న హీరోలను కాదని పెద్ద హీరో సినిమాకే ఓటు వేయడం చూస్తుంటే, రాబోయే రోజుల్లో మెహ్రీన్ చిన్న హీరోల పక్కన నటించదనే పుకార్లు షికారు చేస్తున్నాయి.

వెతికాడు. ఆమెకి ప్రేమ వ్యవహారం ఉందనీ, ఎవరికైతే మెయిల్స్ పంపిందన్నారో అతని నుంచి ఆమెకి కానీ, ఆమె నుంచి అతనికి కానీ ఒక్క ఈ-మెయిల్ కూడా రాలేదు.

సంఘటన జరిగిందంటున్న ఒకటి, రెండు రోజుల్లో మాత్రమే ఉన్నాయవి.

అన్నీ స్క్రీన్‌షాట్స్ తీసుకున్నాడు.

అక్కణ్ణుంచి వాటన్నింటినీ తన పర్సనల్ ఈ-మెయిల్‌కి పంపుకున్నాడు.

తర్వాత లాగ్‌లోకి వెళ్ళి చూస్తే అర్థమైందతనికి.

మానస బిల్డింగ్ నుంచి దూకిందంటున్న సమయం తర్వాత కొద్ది నిమిషాల పాటు సర్వర్‌లో టైమ్ వెనక్కి జరిపారు.

ఆ టైమ్‌లో ఎవరైనా మెయిల్స్ పంపి ఉంటే అవి అప్పటి సమయాన్ని కాక వాళ్ళు ఛేంజ్ చేసిన టైమ్ చూపిస్తాయి.

మానసకీ, ఆమె బాయ్‌ఫ్రెండ్‌గా ప్రచారం జరిపిన వ్యక్తికీ మధ్య సంభాషణలు వాళ్ళు అలా సృష్టించినవే!

చాలా స్పష్టంగా విషయం అర్థమైపోయింది సాకేత్‌కి.

అవసరమైన అన్ని ఆధారాలూ తీసుకుని తను రాసిన కోడ్ డిలీట్ చేసి బయటికి నడిచాడు సాకేత్.

***

లియోనియాలో ఔటింగ్ జరిగి వారం దాటుతోంది.

ఆ రోజే ఆఫీస్‌కి వచ్చాడు రాజేష్.

ఈ వారం రోజులు చాలా ఆలోచించాడతను.

ఎంతో మంది అమ్మాయిల కోసం తను ట్రై చేశాడు.

ప్రమోషన్ల కోసమో, ఉద్యోగం తప్పనిసరయ్యో... కొందరు తన దారిలోకి వచ్చారు. మరికొంత మంది కంపెనీ మారటమో, వేరే డిపార్ట్‌మెంట్‌కి వెళ్ళిపోవటమో జరిగిందతనితో వేగలేక.

ఇంకొంతమంది నోరేసుకుని అరిచి బ్రతికేస్తారు.

అంతేకానీ ఒక్కమాట మాట్లాడకుండా, టీమ్ మారకుండా మొహం అమాయకంగా పెట్టి ఇక్కడ బ్రతికేస్తోంది కావ్య. పైగా దీనికి మిగతావాళ్ళ ఫుల్ సపోర్ట్.

విచిత్రంగా అతనికి సీమ మీద కంటే కావ్య మీదే ఎక్కువ పగగా ఉంది.

మన మీద దాడి చేస్తుందనుకున్నపుడు ఏ పిల్లినో, కుక్కనో అయితే రాళ్ళేసి కొట్టో, చంపో తప్పించుకుంటాం. అదే పులో, సింహమో అయినపుడు వాటి జోలికి వెళ్ళకుండా మన జాగ్రత్తలో మనముంటాం.

అదే జరుగుతోంది అక్కడ.

క్లయింట్ టీమ్‌తో మీటింగులు పెట్టుకున్నాడు. టీమ్‌ని ఒక్క మీటింగుకి కూడా ఆహ్వానించలేదతను.

రెండు రోజుల తర్వాత కావ్యకి మెయిల్ వచ్చింది.

"వారం రోజుల్లో యూఎస్ వెళ్ళాలి. అర్జంట్‌గా ట్రావెల్ డెస్క్‌లో వీసా స్టాంపింగ్ కోసం నీ పాస్‌పోర్ట్ ఇవ్వు."

ఆశ్చర్యపోయింది కావ్య.

తనెళ్ళి ఏం ఘనకార్యం సాధిస్తుంది యు.ఎస్.లో?

అసలంత వెళ్ళాల్సిన అవసరం కూడా ఎక్కడ ఉందిప్పుడు?

పైగా ప్రాజెక్ట్ ఆఖరు స్టేజ్‌కి వచ్చింది.

ఇంకొక రెండు వారాల్లో లైవ్ వెళ్తుంది అప్లికేషన్.

అదే అడిగిందామె.

"లైవ్ వెళ్ళాక సపోర్ట్ కోసం రెండు వారాలు అక్కడుండాలి. అదే టైమ్‌లో తర్వాత ఫేజ్‌కి కావలసిన రిక్వయిర్‌మెంట్స్ సేకరించాలి" చెప్పాడు రాజేష్.

"మరి నా మిగతా ప్రాజెక్ట్‌లు?" అడిగింది కావ్య.

"వాటికీ, దీనికీ ఏమిటి సంబంధం?" ఎదురు ప్రశ్నించాడు.

"ఈ క్లయింట్ ఆఫీస్‌లో రోజంతా ఉంటే మిగతా క్లయింట్ ప్రాజెక్ట్‌లు ఎలా చేస్తాను?"

"పగలు ఆ క్లయింట్ వర్క్ చేయి. ఇంటికెళ్ళాక మిగతా క్లయింట్స్ వర్క్. వేరే ఏవయినా పనులు ఉంటాయా రాత్రుళ్ళు నీకు?" వెటకారంగా ఉందతని గొంతు.

అవమానంగా అనిపించింది కావ్యకు.

మొహం ఎర్రబడింది.

చచ్చిపోవాలనిపించింది.

మాట్లాడకుండా వెనక్కి వచ్చి ట్రావెల్ డెస్క్ వద్ద తన పాస్‌పోర్ట్ సబ్మిట్ చేసింది.

ఆడవాళ్ళు ఎంతో ప్రగతిని సాధించారనీ, అంతరిక్షం వరకూ దూసుకుపోతున్నారనీ, ఆర్థిక స్వేచ్ఛ లభించిందనీ అంటుంటారు.

కానీ దీనివల్ల తమకేమి లాభం ఒరిగింది?

ఇదివరకు కొన్ని విషయాల్లో మాత్రమే తమని ఎక్స్‌ప్లాయిట్ చేస్తే, ఇప్పుడు అన్ని విషయాల్లో ఎక్స్‌ప్లాయిటేషన్.

**సాకేత్ కంపెనీ సీఈవోని కలిశాడు. తీరా కలిశాక పావుగంట కాస్తా గంటయ్యింది. ఆధారాలు చూపిస్తూ ఏదో చెప్తున్నాడు సీఈవోకి. అంతా విన్న తరువాత సీఈవో తలపంకించి, ఓకే మిగతా విషయాలు నేను చూసుకుంటాను అనిచెప్పి అతణ్ణి పంపించేశాడు. ఇంతకీ ఎవరీ సాకేత్? అతడు చెప్పిందేమిటి? కంపెనీ విషయమా లేక వ్యక్తిగతమా?**

పెళ్ళయిన ఆడవాళ్ళు, పిల్లలున్న ఆడవాళ్ళు ఉద్యోగాలు చేస్తారు. ఇళ్ళకెళ్ళాక ఇంటి పని, పిల్లలతో హోమ్‌వర్కులు చేయించటం, వాళ్ళ పనులు చూడటం...

ఇలా టైమ్ వెంట రోజంతా పరిగెడుతుంటారు.

వేరే పనేముంటుంది అన్న మిషతోనో, తన దారికి రావట్లేదనో తనలాంటి వాళ్ళని పనిలో చంపుతుంటారు.

ఉద్యోగం మానేస్తే!

తరచూ ఈ ఆలోచన వస్తోందీ మధ్య, ఆమెకి.

ఒకవేళ అక్షయ్ వెనక్కొస్తే తనకి కనబడతాడు మళ్ళీ. ఇదొక్క ఆలోచనే ఆమెని కొనసాగింప జేస్తోంది.

దూరంగా రోహిణి వెళ్ళి రాజేష్‌ని బ్రతిమాలటం కనబడుతోంది.

"నన్ను పంపొచ్చుకదా రాజేష్. ఈ కంపెనీలో చేరి ఇన్నేళ్ళవుతోంది. ఇంతవరకూ ఒక్క ఫారిన్ ట్రిప్ కూడా లేదు. అందరూ అడుగుతున్నారు, నిన్ను వేరే దేశాలకి పంపరా అని."

***

సాకేత్ యూఎస్‌కి బయల్దేరాడు.

తన దగ్గరున్న కాంటాక్ట్ ద్వారా సి.ఈ.ఓతో పావుగంట అపాయింట్‌మెంట్ దొరికేలా చేసుకున్నాడు.

అప్పుడే రిజిగ్నేషన్ ఇవ్వదల్చుకోలేదతను.

కంపెనీ ఎంప్లాయీకి ఇచ్చిన ప్రాముఖ్యం బయటివాళ్ళకు ఇవ్వకపోవచ్చు.

ఇండియాలో మేనేజ్‌మెంట్‌కి పర్సనల్ లీవ్ తీసుకుంటున్నట్టు మాత్రమే చెప్పాడు. సి.ఈ.ఓని తను కలవబోయే విషయం చాలా గోప్యంగా ఉంచాడు.

సరిగ్గా ముందు షెడ్యూల్ చేసుకున్న టైమ్‌కి సీఈవో వద్దకు తీసుకెళ్ళింది అతడి ఎగ్జిక్యూటివ్ అసిస్టెంట్.

పరిచయం చేసుకున్నాడు సాకేత్.

షేక్‌హాండిచ్చి కూర్చోమన్నాడు అతన్ని సీఈవో.

చాలా ప్లెజెంట్‌గా ఉందతని మొహం.

ముందుకు జరిగి టేబుల్‌మీద చేతుల పెట్టుకుని కూర్చున్నాడు.

"ఎందుకు నన్ను కలవాలనుకున్నావు?" అడిగాడతను.

సాకేత్ చెప్పటం మొదలెట్టాడు.

చెప్తున్న ప్రతి విషయానికీ తను సేకరించిన ఆధారాలు చూపిస్తున్నాడు.

తన అసిస్టెంట్‌కి ఫోన్ చేశాడు సీఈవో.

తర్వాత మీటింగ్‌ని కాన్సిల్ చేయమన్నాడు.

సి.ఈ.ఓ, సి.ఎఫ్.ఓలతో తనకు అర్జంట్‌గా మీటింగ్ అరేంజ్ చేయమన్నాడు.

పావుగంట ప్లాన్ చేసుకున్న మీటింగ్ గంట వరకూ కొనసాగింది.

సాకేత్ బయటికి వచ్చే ముందు అన్నాడు సీఈవో.

"సారీ ఫర్ యువర్ లాస్. ఒక కజిన్ కోసం నువ్వింతగా శ్రమపడటం నిజంగా మెచ్చుకోదగిన విషయమే. తర్వాత జరగాల్సిన పనులు నేను చూసుకుంటాను. నువ్వే చూస్తావు కంపెనీలో జరగబోయే మార్పులు".

అప్పుడు చెప్పాడు సాకేత్ తను రాజీనామా చేస్తున్న విషయం.

"ఆలోచించుకో. లేదా నువ్వెప్పుడైనా మళ్ళీ రాదల్చుకున్నప్పుడు వెనక్కు రావచ్చు" అన్నాడు సీఈవో.

***

మానస విషయంలో జరిగిందంతా తప్పుడు ప్రచారమనీ, ఆమెకు ఏ బాయ్‌ఫ్రెండ్ లేడనీ, కంపెనీలో జరుగుతున్న స్కామ్‌ని బయట పెడుతుందనే భయంతోనే ఆమెని బిల్డింగ్‌పై నుంచీ తోసి చంపేశారనీ అన్ని న్యూస్‌పేపర్లలో చిన్నబాక్స్‌లో వార్త వచ్చింది మర్నాడు.

నెగెటివ్ విషయాలకున్న ప్రచారం పాజిటివ్ వాటికి ఉండదు కాబట్టి మానస విషయం ఎవరూ పెద్దగా పట్టించుకోలేదు. స్కామ్ గురించి రెండురోజులు చర్చించుకుని బయట జరుగుతున్న వాటి ముందు ఇదొక లెక్కా అనుకోవటంతో, వార్త మరుగున పడిపోయింది.

***

కంపెనీలో పెనుమార్పులు జరగబోతున్నాయనే ఈ-మెయిల్ వచ్చింది ఆ రోజు అందరికీ.

లే ఆఫ్స్ అయ్యిండొచ్చేమోననే భయం పట్టుకుంది అందరినీ.

సీనియర్ లీడర్‌షిప్ లెవెల్లో జరుగుతున్న ఛేంజెస్ అనీ, తమకొచ్చిన భయమేమీ లేదనీ రెండు రోజులకు అర్థమైంది అందరికీ.

లీడర్స్ అంతా మొహాలు టెన్షన్‌గా పెట్టుకుని గ్రూపులుగా చేరి గుసగుసలాడటం గమనిస్తూనే ఉన్నారు అందరూ.

మొదటిసారిగా ఆర్గనైజేషన్ ఛేంజెస్‌ని టీమ్ మెంబర్లు స్వాగతించారు. పైవాళ్ళు పడుతున్న టెన్షన్ చూస్తూ, ఇదివరకు వాళ్ళు తీసుకున్న తప్పుడు నిర్ణయాల వల్ల, స్వార్థ ప్రయోజనాల కోసం తాము ఎంత నష్టపోయిందీ గుర్తు చేసుకుని సంతోషిస్తున్నారు.

కంపెనీ రీజియన్ లెవెల్స్‌లో విభజించబడింది. యు.ఎస్. ఏషియా పసిఫిక్, మిడిల్ ఈస్ట్ ఇలా ఒక్కో రీజియన్‌కీ అమెరికాలోని కార్పొరేట్ ఆఫీస్ నుంచి హెడ్స్ నియమితులయ్యారు. నిర్ణయాధికారాలన్నీ దాదాపు ఇండియా నుంచి లాగేసుకున్నట్లే అయింది. ప్రతి విషయానికీ తుది సంతకం అమెరికా నుంచీ రావాల్సిందే!

లీడర్‌షిప్ టీమ్‌లో ప్రతి ఒక్కరికీ మళ్ళీ ఇంటర్వ్యూలు జరిగాయి.

కొందరు ఇళ్ళకు పంపబడ్డారు.

మరికొందరు జాబ్స్ దక్కించుకోగలిగారు.

ఇంకొందరికి ప్రమోషన్లు వచ్చాయి.

దురదృష్టవశాత్తూ మానస హత్యలో ప్రమేయం ఉన్న వారెవ్వరికీ ఉద్యోగాలు పోలేదు. ఎక్కడా ఆధారాలు లేవు కాబట్టి, కంపెనీ రెప్యుటేషన్ దెబ్బతినే అవకాశం ఉంది కాబట్టి, కంపెనీ కూడా ఆ విషయం మీద పెద్దగా రెట్టించలేదు.

అప్పటివరకూ పోగుచేసుకున్న సంపాదన వారికీ, వారి పిల్లలకీ జీవితకాలం పాటు సుఖంగా గడిపేయ



## అమ్మడి బికినీ కోరిక తీరుతుందా?

సాధారణంగా తెరమీద బికినీ వేయవలసివస్తే, అదేదో తాము కోరి వేసుకున్న కాస్ట్యూమ్ కాదనీ, కథ డిమాండ్ చేసిందనీ ఇలా రకరకాల కారణాలు చెబుతుంటారు హీరోయిన్లు. కానీ అందాల రాక్షసి లావణ్య త్రిపాఠి మాత్రం తనకు బికినీ వేయాలని కోరికగా ఉందంటూ బాహాటంగా చెబుతోంది. తనకు మోడ్రన్ డ్రస్సులంటే ఇష్టమనీ, కానీ సినిమాల్లో మాత్రం తనను సంప్రదాయబద్ధంగా చూపుతున్నారనీ, ఇక నుంచి మోడ్రన్ క్యారెక్టర్లు ఇవ్వమంటూ దర్శకనిర్మాతలకు నేరుగా చెబుతోంది. అవసరమైతే బికినీ కూడా వేసుకుంటానని అంటోంది. లావణ్య కోరిక విన్న దర్శకనిర్మాతలు మాత్రం బికినీ గురించి ఆలోచించడం లేదట! తన కోరిక తీర్చే వారి కోసం లావణ్య ఆశగా ఎదురు చూస్తోందట! కాకపోతే లావణ్య మోడ్రన్ డ్రస్సులకూ, బికినీలకూ సరిపోదన్నది కొందరి అభిప్రాయం అట!

టానికి పనికొస్తుంది కాబట్టి వాళ్ళకీ పెద్దగా నష్టం లేదు. అయినప్పటికీ అక్రమ సంపాదన, డబ్బు పిచ్చి అలవాటైన వారికి కాస్త బాధాకరంగానే పరిణమించిందీ విషయం.

***

ఆర్గనైజేషన్ ఛేంజెస్ గురించి మాట్లాడటానికి టౌన్‌హాల్ మీటింగ్‌కి రావల్సిందిగా అందరికీ ఈ-మెయిల్ వచ్చింది.

ఐటీ కంపెనీల్లో మాటి మాటికీ వినపడే మీటింగ్‌లు 'ఆల్‌హాండ్స్', 'టౌన్‌హాల్'.

కంపెనీలో డిపార్ట్‌మెంట్ లెవెల్‌లో కానీ, ఆర్గనైజేషన్ లెవెల్‌లో కానీ ఏదైనా సమాచారాన్ని ఉద్యోగులకి అందించటానికి కానీ, ఎగ్జిక్యూటివ్ రిపోర్ట్‌లను ఉద్యోగులకు తెలియచేయటానికి కానీ, పీరియాడిక్‌గా అంటే మూడు నెలలకొకసారో, నెలకొకసారో కానీ ఈ మీటింగ్‌లను పెడుతుంటారు.

ఏదయినా పెద్ద కాన్ఫరెన్స్ రూమ్‌లోనో, కెఫెటేరియాలోనో అందరినీ సమావేశపరిచి ఈ మీటింగ్‌లను కండక్ట్ చేస్తారు. సాధారణంగా టౌన్‌హాల్ మీటింగ్స్‌లో ఉద్యోగులు అడిగే ప్రశ్నలకు సమాధానాలివ్వటానికి ఎక్కువ సమయం కేటాయిస్తారు. ఆల్‌హాండ్స్ మీటింగ్స్ ప్రెజెంటేషన్ బేస్‌డ్‌గా ఉంటాయి.

కెఫెటేరియాలో కుర్చీలన్నిటినీ పక్కకి జరిపేసి వరసగా వేశారు. పెద్ద స్క్రీన్ కనబడుతోంది. అన్ని ప్రాంతాల నుంచీ జాయిన్ అయిన వాళ్ళు స్క్రీన్‌లో ఒక పక్కన చిన్నచిన్న బాక్స్‌లుగా కనబడుతున్నారు.

సి.ఈ.ఓ. తెరమీద కనబడగానే ఈలలు, అరుపులతో రూమ్ దద్దరిల్లిపోయింది. అన్ని ప్రాంతాల వాళ్ళూ అదే ట్రాన్స్‌లో ఉన్నట్లున్నారు. అత్యమితంగా ఉద్యోగులు అభిమానిస్తారతన్ని.

చిరునవ్వు చిందిస్తూ ఒక నిమిషం నిలబడ్డాడతను. తనపైన చూపిస్తున్న అభిమానాన్ని ఎంజాయ్ చేస్తున్నాడని అతని మొహమే చెబుతోంది.

"థాంక్యూ" అందరికీ తల కొద్దిగా వంచి అభివాదం చేశాడతను. తర్వాత రీసెంట్‌గా కంపెనీలో తాము చేపట్టిన ఛేంజెస్ గురించి చెప్పటం మొదలెట్టాడు. ప్రతిదానికీ క్లియర్‌గా వివరణ ఇస్తున్నాడు. నిజానికి అతనా పని చేయాల్సిన అవసరం లేదు. తన కిందవాళ్ళకు చెప్తే వాళ్ళ ద్వారా ఉద్యోగులకు సమాచారం అందేలా చేయవచ్చు. కానీ అతను నిజమైన లీడర్. తాము చేపట్టిన మార్పులవల్ల ఎవరూ అభద్రతాభావానికి లోను కాకూడదనీ, వాళ్ళందరినీ కాన్ఫిడెన్స్‌లోకి తీసుకోవాలన్నదే అతని ఉద్దేశం.

కార్యక్రమం చివర్లో ఒక జోక్‌తో ముగిస్తానంటూ మొదలెట్టాడతను.

"ఒక ప్రాజెక్ట్ మేనేజర్ ట్రెయిన్‌లో ప్రయాణిస్తున్నాడు".

ప్రాజెక్ట్ మేనేజర్ అన్నమాట వినగానే బ్రహ్మీ రోహిణి కేసి చూసి కాలర్ ఎగరేశాడు.

"ఓకే. విషయమేమీ లేదు!" పెదవి విరిచి బొటనవేలు కిందికి చూపించిందామె.

మొహం తిప్పేసుకున్నాడతను.

ఒక అందమైన అమ్మాయి అతనున్న కూపేలోకి ఎక్కింది.

సంతోషంగా మొహం పెట్టాడతను.

కూపేలో అతనొక్కడే ఉన్నాడు.

అతని ఎదురుగా కూర్చొని నవ్విందామె.

"ఇవాళ అదృష్టం శని పట్టినట్లు పట్టుకుంది" మనసులోనే ఎగిరి గంతులేస్తున్నాడతను.

లేచి అతనివైపు రావటం మొదలెట్టిందామె.

ఉబ్బితబ్బిబ్బవుతున్నాడు.

అతని పక్కనే కూర్చుంది.

మెల్లిగా అతనితో అంది.

"నీ పర్స్, క్రెడిట్‌కార్డ్‌లు, సెల్‌ఫోన్, వాచ్ అన్నీ మర్యాదగా నాకిచ్చేయి. లేదంటే నన్ను రేప్ చేయబోయావని అరిచి గొడవ చేస్తాను".

తనకి వినపడదు, మాట్లాడరాదనీ, ఏమి చెప్తుందో రాసి చూపించమని సైగలు చేశాడతను.

పేపర్ మీద రాసి చూపించిందామె.

పేపర్ చేతిలోకి తీసుకుని ఆశ్చర్యంగా చదివాడు.

లేచి నిలబడి పేపర్ జేబులో పెట్టుకుంటూ అన్నాడు.

"ఇప్పుడు అరవవే!."

అందరూ గొల్లుమన్నారు.

"సో గయ్స్, డాక్యుమెంటేషన్ అనేది చాలాముఖ్యం. తప్పుచేస్తే మీరు దొరికేలా చేసేదీ, మంచిపని చేస్తే మీకు ప్రూఫ్‌లా పనికొచ్చేది డాక్యుమెంటేషనే! గుర్తుపెట్టుకోండి. నో ఇంప్లిమెంటేషన్ విత్‌ఔట్ డాక్యుమెంటేషన్".

"థాంక్యూ" చెప్పి అతను చేయి వేవ్ చేస్తుండగా స్క్రీన్ ఆఫ్ అయింది.

అందరూ అతను చెప్పిన విషయాల గురించి చర్చించుకుంటూ తమ క్యూబ్స్ దగ్గరికి వెళ్తున్నారు.

"ఇన్ని మార్పులు చేశారు. రాజేష్ గాడిని కూడా లేపేస్తే పోయేది" గొణిగింది కావ్య.

"వాడి మొహం. వాడొక చిన్న చీమలాంటివాడు వాళ్ళకు. కాస్త పెద్ద చేపల పని పట్టారీసారి. వాడి వంతు కూడా ఎప్పుడో వస్తుంది?" సర్ది చెప్పాడు బ్రహ్మీ.

***

కావ్యకి వీసా అప్రూవ్ అయింది.

టికెట్లు కూడా వచ్చేశాయి.

రెండు వారాలే అయినా ఆమెకెందుకో బెంగగా ఉంది.

ఒక్కసారి అక్షయ్‌ని చూడాలనిపిస్తోంది వెళ్ళేలోగా.

ఆఫీస్‌లో వాళ్ళంతా ఇదివరకెప్పుడో తను చేరక ముందు ఔటింగ్‌కి వెళ్ళిన ఫోటోలు రోహిణి దగ్గర ఉన్నాయి.

ఏదో వంకన ఆమె ల్యాప్‌టాప్ తీసుకుని అక్షయ్ ఫోటోలు జూమ్‌చేసి మరీ చూసింది. కొన్ని పెన్‌డ్రయివ్‌లోకి కాపీ చేసుకుంది.

మర్నాడే ఆమె ప్రయాణం.

బట్టలు సర్దుకుంటోంది కావ్య. ప్యాకెట్లు ఏవో తెచ్చి బాగ్‌లో వేస్తూనే ఉంది ఆమె తల్లి, పొడులనీ, పచ్చళ్ళనీ...




సడన్‌గా కావ్యకి అక్షయ్‌తో మాట్లాడాలనిపించింది. కాసేపు కంట్రోల్ చేసుకోవటానికి ప్రయత్నించింది. రాన్రాను అతనితో మాట్లాడాలనే కోరిక ఆమెలో బలపడింది.

"అమ్మా, నువ్వు సర్దుతుండు. ఇప్పుడే వస్తాను" చెప్పి ఫోన్ తీసుకుని బాల్కనీలోకి పరిగెత్తింది.

ఫోన్ చేసింది.

రింగ్ అవుతోంది. ఎత్తటం లేదు.

రెండు నిమిషాలు ఆగి మళ్ళీ నంబర్ కలిపింది.

ఒక రింగ్ రాగానే ఈసారి కట్ చేసినట్లున్నాడు. బిజీగా ఉన్నాడనే మెసేజ్ వచ్చింది.

ఒళ్ళు మండిపోయిందామెకి.

మళ్ళీ చేసింది.

ఈసారి ఫోన్ స్విచాఫ్ అని వస్తోంది.

ఏడుపొచ్చిందామెకి.

మొహం మాడ్చుకుని వెనక్కి వచ్చి బట్టలు సర్దుకోవటంలో పడింది. ఆమె మొహం చూసి అంది తల్లి.

"పోనీ ఇష్టం లేకపోతే వెళ్ళకు. ఉద్యోగం మానెయ్యవే!"

"నాకొచ్చిన పని ఇదొక్కటే!" గట్టిగా అరిచింది.

"ఏంటో, ఎవరెవరి మీద కోపమో నా మీద చూపిస్తావు" గొణుక్కుంటోంది.

***

పొద్దున నాలుగింటికి ఫ్లయిట్.

ఎయిర్‌పోర్ట్‌లో బోర్డింగ్ పాస్ తీసుకుంటున్న కావ్య తనని పలకరిస్తున్న మనిషిని చూసి షాక్ తిన్నది.

**(ఇంకా వుంది)**



# పిచ్చుక

-బి.వి.శివప్రసాద్

**ఆ రోజు ఉదయం మా బాల్కనీలో అబ్బుర పరచే ఒక దృశ్యం చూశాను. లేత బూడిదరంగులో బుజ్జిబుజ్జిగా ఉన్న ఒక పిచ్చుక పూలకుండీలోని గింజలను ముక్కుతో ముద్దాడుతోంది. నేను మా వంట గదిలోంచే ఈ దృశ్యాన్ని ఆస్వాదిస్తూ చాలాసేపు ఉండిపోయాను. దగ్గరకెళితే కలలాంటి ఆ యదార్థదృశ్యం ఆవిరై పోవచ్చు.**

అంతలో "ఏంటండి ఇక్కడ అలా నిలుచుండి పోయారు?" అన్న మా ఆవిడ పలకరింతకు ఉలికి పడ్డాను. పిచ్చుక ఎగిరిపోయింది. ఎందుకోగానీ, అప్పుడే ఆంజనేయకుమార్ గుర్తుకు వచ్చాడు. అతను నాకు బి.ఇ.లో సహాధ్యాయి, సన్నిహితుడూను. అవి నేను మద్రాసులోని (ఇప్పటి చెన్నై) గిండీ సాంకేతిక కళాశాలలో చేరిన రోజులు. వసతి గృహంలో చేరేదాకా కొద్దిరోజులు నేను సుళ్ళూరుపేట నుండి మద్రాసుకు రైల్లో రోజూ ప్రయాణం చేశాను. మొదటి రోజే కుమార్ విరామసమయంలో పలకరించాడు. ఆ సంవత్సరం చేరిన విద్యార్థుల్లో, తెలుగువాళ్ళం మొత్తం ఐదు మందిమి మాత్రమే ఉండేవాళ్ళం. కుమార్ హైదరాబాద్ నుండి వచ్చాడు. మిగిలిన వాళ్ళలో ఒకరు చీరాల, మరొకరు గుంటూరు, నాగేంద్ర దేమో విజయనగరం. మా సీనియర్లు (చివరి సంవత్సరం విద్యార్థులు) అప్పటికింకా కళాశాలలోనే ఉండడంవల్ల, మాకు వసతిగృహంలో గదులు కేటాయించలేదు. కొన్నిరోజులు వేచి ఉండవలసిన పరిస్థితి. ఆ సమయంలో నేను ఒక్కడినే రైల్లో ప్రయాణంచేసి, తరగతులకు హాజరై మరలా సాయంత్రం రైలు పట్టుకుని ఇంటికి చేరుకోవడం గమ్మత్తుగా అనిపించేది.

కుమార్ టి.నగర్లో వాళ్ళ పిన్ని దగ్గర, నాగేంద్ర పల్లావరంలో వాళ్ళ మామయ్య ఇంట్లో బస చేశారు. తొందరలోనే కుమార్‌కు నాకు ఏరా అని పిలుచుకునే సాన్నిహిత్యం ఏర్పడింది. ఓరోజు మా సహాధ్యాయులు ఇద్దరు ముగ్గురం మాట్లాడుకుంటున్నాం. సంభాషణ ఆంగ్లంలో జరుగుతోంది. నేను ఎవరి గురించో మాట్లాడుతూ "హి డు నాట్ నో టమిళ్" అన్నాను. వెంటనే కుమార్ "డునాట్ నో కాదు, డజ్ నాట్ నో అనాలి" అని సరిదిద్దాడు. అది నేను ఆ మహానగరంలో, ఆంగ్లంలో నేర్చుకున్న తొలి పాఠం. నేను ఇంటర్మీడియట్ వరకు తెలుగు మాధ్యమంలోనే చదివాను. మొదటినుంచి, ఆంగ్లభాష మీద ఉన్న మమకారంవల్ల తప్పులో, తడకలో ఆ భాషలో ఎక్కువగా మాట్లాడటానికి ప్రయత్నించే వాణ్ణి. అలా కుమార్ సవరించిన తప్పు నా జీవితంలో మరెప్పుడూ చేయలేదు. అతని సలహాలతో అతి తొందరలోనే నేను చక్కటి భాషా పరిజ్ఞానం పొందాను.

కొన్నిరోజులుపోయాక మాకు తాత్కాలిక ప్రాతిపదికన వసతి కల్పించారు. ఓపెద్ద హాల్లో పదిహేను

మందిని ఉంచారు. అందులో కొంతమంది తమిళ నాడుకు, మిగిలినవాళ్ళు కేరళ, ఒరిస్సా, అస్సాం, జమ్మూ కాశ్మీర్, కర్నాటక తదితర రాష్ట్రాలకు చెందిన వారున్నారు. అలా 'గిండీ' ఓ మినీఇండియాలా ఉండేది. వసుధైక కుటుంబాన్ని తలపించేది. ఇంత మంది రాష్ట్రేతర విద్యార్థులతో కలిసి చదువుకోవడమనే సువర్ణావకాశం, నేను మన రాష్ట్రంలోని కళాశాలలో చేరివుంటే కలిగేది కాదు. దీనికి ముఖ్యకారణం మా నాన్నే. అంతేకాక వెంకట రాఘవన్, శ్రీకాంత్ లాంటి మన దేశానికి ప్రాతినిధ్యం వహించిన క్రికెటర్లు, తెలుగు సినిమా నటుడైన బాలయ్య తదితరులు కూడా మా కళాశాల పూర్వవిద్యార్థులే. అలాంటి కళాశాలలో చదవడం నా అదృష్టమనే చెప్పాలి.

***

తర్వాత, వసతిగృహంలో గదులు కేటాయించాక నేను, కుమార్, నాగేంద్ర ఒకే గదిలో పడ్డాం. అలా మేము ముగ్గురం విడదీయలేని మిత్రులమయ్యాం. ఓరోజు నాగేంద్రకు జ్వరం వచ్చింది. పారాసెటమాల్ బిళ్ళలు మింగాడు. జ్వరం తగ్గలేదు. తీవ్రత నూట నాలుగు డిగ్రీలుగా నమోదయ్యింది. సరిగ్గా అవి మాకు సెమిస్టర్ పరీక్షలు జరుగుతున్న రోజులు. మాకు దగ్గర్లో అడయారులోని ఓ ఆసుపత్రికి తీసుకెళ్ళాం. డాక్టర్ టైఫాయిడ్ జ్వరమని తేల్చాడు. ఆ వార్తతో మమ్మల్ని ముంచాడు.

ఆసుపత్రిలో చేరిస్తే నయమవుతుందన్నాడు. ఆ సమయంలో కుమార్ తనే ఆస్పత్రిలో ఉండి నాగేంద్రను కంటికిరెప్పలా చూసుకున్నాడు. రాత్రంతా నాగేంద్రతో ఉండి, ఉదయమే కళాశాలకువచ్చి పరీక్షలు వ్రాశాడు. నాగేంద్ర "ఎందుకురా కుమార్ నువ్వు హాస్టల్‌కెళ్ళిపో, నేనెలాగో సర్దుకుంటాలే" అంటే, "ఏం పర్లేదురా నేనా విషయం చూసుకుంటాను. నువ్వు దానిగురించి బెంగపడకు" అన్నాడు. ఈ విషయం నాకెప్పుడు గుర్తుకొచ్చినా మనసు ఆర్ద్రమౌతుంది. నేను గిండీలో ఉన్న నాలుగేళ్ళకాలంలో చూసిన సినిమాలు, సందర్శించిన హోటళ్ళు చాలానే. ఇవన్నీ సాధ్యమవడానికి మూలకారణం కుమారే. తనకి మద్రాసులో ఉన్న దాదాపు అన్ని హోటళ్ళు, సినిమా థియేటర్ల గురించి చాలా విషయజ్ఞానం ఉంది. మేము ముగ్గురం బయటకు వెళ్ళినప్పుడు అయ్యే ఖర్చంతా కుమారే భరించేవాడు. మేము బలవంతంగా డబ్బులివ్వబోతే, "ఉంచండ్రా! మీరిద్దరూ చదువై స్థిరపడ్డాక నా కోసం ఖర్చుపెడుదురుగాని" అని హుందాగా అనేవాడు. డబ్బులు ఎందరి దగ్గరో ఉంటాయి. కానీ వాటిని, ఇతరులమీద, అదీ

**చదువుకునే రోజుల్లో వాళ్ళు ముగ్గురూ స్నేహితులు. ఒకే హాస్టల్ రూములో గడిపిన ఆప్తమిత్రులు. వారిలో విలక్షణమైన వ్యక్తి కుమార్. చేతికి ఎముక లేకుండా డబ్బు ఖర్చుపెట్టడం, ఆపదలో ఉన్నవారిని ఆదుకునే ఉదారగుణం, సేవాభావం, మంచి తెలివితేటలు మూర్తిభవించిన వ్యక్తి. కుమార్ జీవిత చరమాంకం వరకు ఆ లక్షణం నిలబెట్టుకున్నాడు. మరి అతని ప్రియస్నేహితులకు ఆ గుణం అబ్బిందా?**

ప్రతిఫలం ఆశించకుండా ఖర్చుపెట్టడం చాలా అరుదు. అదికూడా ఒకటీ, రెండుసార్లుకాదు. మా చదువు పూర్తయ్యేవరకూ, మేము కళాశాలకు వీడ్కోలు పలికేవరకూ మాకు ఇదే భోగం కొనసాగింది. మమ్మల్ని ఎన్నో సాంస్కృతిక కార్యక్రమాలకు కూడా తీసుకెళ్ళేవాడు. నాకు మంచి సాహిత్యాన్ని కూడా వాడే పరిచయం చేశాడు. ఓరోజు మేం ఒక బుక్‌హౌస్‌కు వెళితే, అక్కడ మాకు బాపూగారు (ప్రముఖ చిత్రకారులు, చిత్ర దర్శకులు) దర్శనమిచ్చారు. మరోసారి మందవెలిలో మహాకవి శ్రీశ్రీ గారింటికెళ్ళాం. ఓరోజు అనూహ్యంగా "మావా, నాకు ఐదువందలరూపాయలు వెంటనే కావాలిరా, పది రోజుల్లో సర్దుతాను" అని అడిగాడు కుమార్. నేను ఆనందంగా బ్యాంకులోనుంచి తీసిచ్చాను. తరువాత నాకు అసలు విషయం తెలిసింది. మా కళాశాలకు ఓ యువకుడు వచ్చాడట. వాళ్ళ చెల్లాయికి చాలా అరుదైనవ్యాధి సోకిందని, చికిత్సకు చాలా పెద్ద మొత్తం అవసరం అవుతుందని, తమకు స్తోమత లేనందున విరాళాలు సేకరిస్తున్నారని చెప్పాడు. మా ప్రిన్సిపాల్‌గారు కూడా అతనికి అనుమతినిచ్చారు. ఆ అబ్బాయికి కుమార్ ఐదువేల రూపాయలు సహాయం చేశాడు. మళ్ళీ వాళ్ళ నాన్న దగ్గర్నుంచి డబ్బులు వచ్చేవరకు, తన ఖర్చుల నిమిత్తం నన్నడిగాడు. వాడు అడగాలే కానీ, నిలువుదోపిడీ ఇవ్వనూ!

***

"నాన్నా అమ్మ కూరగాయలు తెమ్మంటోంది, ఉల్లిపాయలు అసలు లేవట" నా కూతురు ఇందూ నా దగ్గరకు రావటంతో గతం గురించిన నా ఆలోచనలు ఆగాయి. సంచి పుచ్చుకుని బయట పడ్డాను. ఐతే అంతర్లీనంగా, ఉదయం కనిపించిన బుజ్జిపిచ్చుక, దాని ద్వారా జ్ఞాపకాలపొరల్లోంచి బయట పడ్డ కుమార్ నన్ను వెంటాడటం మానలేదు. పిచ్చుకకూ, అతనికీ మధ్య ఏదో సాదృశ్యం నాకు గోచరిస్తోంది. ఇద్దరూ అంతర్ధానమౌతున్న అరుదైన జీవులుగా నాకు తోచారు. పిచ్చుకలాంటి జీవం వల్ల మానవాళికి ప్రత్యక్ష ప్రయోజనం లేకపోయినా, అవి ఈ పర్యావరణ సమతూకంలో ఉండే విషయంలో తమవంతు పాత్ర పోషిస్తాయని నాకనిపిస్తుంది.

నా చిన్నతనంలో మేమున్న ప్రతి ఊళ్ళోనూ మా ఇంట్లో కూడా లెక్కకు మిక్కిలిగా పిచ్చుకలు, ఇతర పక్షులు కనిపించేవి. వాటి కిచకిచరావాలతో, ధాన్యపు గింజలు ఏరుకుంటూ కనువిందు చేసేవి. ఇప్పుడు మేము చాలా సంవత్సరాల నుంచి అపార్ట్‌మెంట్లలో అఘోరిస్తున్నాం. అదోరకంగా బ్రతుకీడుస్తున్నాం. పిచ్చుకలు మచ్చుకైనా కనిపించడం మానేశాయి. దాదాపుగా అవి అంతరించిపోతున్నాయి. నాకు వాటిని తరచు వీలైనంత ఎక్కువ సంఖ్యలో కనీసం మా ఇంటి దగ్గర్లో చూడాలనిపిస్తూ ఉంటుంది. మా అమ్మాయి ఈ బాధ్యత తీసుకుంది. మా రెండు బాల్కనీల్లో రోజూ కొన్ని ధాన్యపుగింజలు, తాగడానికి నీరు పళ్ళాలలో ఉంచడం మొదలెట్టా. రెండు మూడు రోజుల్లోనే ఒక పిచ్చుక రోజూ వచ్చి వాలడం మొదలెట్టింది. కొన్నివారాలకు వాటిసంఖ్య పెరిగింది. మమ్మల్నిచూసి మాపక్క ఫ్లాట్‌వాళ్ళు కూడా మాలాగే చేయడం మొదలెట్టారు. క్రమంగా మేముంటున్న ఆవాసంలోకి పిచ్చుకలు కొంచెం పెద్దసంఖ్యలోనే రావడం ప్రారంభమైంది.

కుమార్, నేను ఫోన్లో మాట్లాడుకుంటున్నాం. అప్పుడప్పుడు కలుస్తూనే ఉన్నాం. నాగేంద్రకూడా భీమవరం దగ్గర్లో స్వంత ఊళ్ళో కుటీరపరిశ్రమ నడుపుతున్నాడు. కుమార్‌లోని మంచితనం, అదే దయాగుణం చెక్కుచెదరకుండా ఉన్నాయి. చదువులో, సామాన్య అవగాహన, విషయాల్లో అత్యంత ప్రతిభ కలిగినవాడవటంవల్ల ఐ.ఎ.ఎస్. ఆఫీసరయ్యాడు. ఢిల్లీలో ఉంటున్నాడు. సామాజికసేవా కార్యక్రమాల్లో విరివిగా పాలుపంచుకుంటున్నాడు. సమాజంలో మంచివ్యక్తులను తయారుచేసే అవకాశం నా ఉపాధ్యాయవృత్తి ద్వారా కొంతమేరకు నాకు దొరికింది. విద్యార్థినీ, విద్యార్థులకు విలువల



గురించి తెలియ చేయడమే కాకుండా, వాటినెలా అమలుచెయ్యాలనే అంశంమీద నా అభిప్రాయాలు వారితో పంచుకుంటూ ఉంటాను.

***

కుమార్ భార్య మన్‌ప్రీత్‌కౌర్‌నుంచి ఓరోజు ఫోన్. తను అప్పుడప్పుడూ ఫోన్లో మాట్లాడుతూ ఉంటుంది. తనని నేను వాళ్ళ పెళ్ళితర్వాత మొదటిసారిగా చూసే అవకాశం కలిగింది. ఈ విషయంలో కూడా కుమార్ తనదైన పంథాలో నిర్ణయం తీసుకున్నాడు. ఆమెకు చిన్నప్పుడే పోలియోవ్యాధి సోకి ఓ కాలు చచ్చుబడిపోయింది. అయినా మనోధైర్యంతో రైల్వేలో ఉద్యోగం సంపాదించుకుంది. కుమార్ ఆమెను ఇష్టపడి పెళ్ళి చేసుకున్నాడు. ఆమెతో ఎప్పుడు మాట్లాడినా ఆమె గొంతులో ఆత్మవిశ్వాసం తొణికిసలాడుతుంది. కానీ ఆ రోజు గొంతు వేరుగా ఉంది. "కుమార్‌కు సీరియస్‌గా ఉంది భయ్యా. మీరు ఓసారి వచ్చి చూస్తే బాగుంటుంది" అంది. "చికిత్సకు బాగానే స్పందిస్తున్నాడన్నావుకదమ్మా" అన్నాను. "అప్పుడు బాగానే ఉందనుకున్నాం. కానీ రెండువారాలనుంచి పరిస్థితి బాగాలేదు. ఇప్పుడు చక్రాలకుర్చీలోనే ఉన్నాడు. మీకు ఈ విషయం తెలియ చెయ్యొద్దన్నాడు. కానీ భయంవేసి మీకు చేశాను. నాగేంద్రతో కూడా ఇందాకే మాట్లాడాను" అంది.

అతనికి ఏడాదిన్నరకాలంగా 'అటాక్సియా' అనే అరుదైన మెదడు, నరాలకు సంబంధించిన వ్యాధి సోకింది. మామూలుగా ఇది అమెరికాలాంటి దేశాల్లో ఉన్నవారికి వస్తుంది. మనదేశంలో కూడా ఇప్పుడిప్పుడే ఈ కేసులు బయటపడుతున్నాయి. మెదడుకు ఇతర అవయవాలతో సమన్వయం క్రమంగా తగ్గిపోతూవస్తుంది. మందుల ద్వారా కొంతగుణం కనిపిస్తుందిగానీ, మెల్లమెల్లగా శరీరంలో అవయవాలు క్షీణించి రోగి తనువు చాలిస్తాడు. వాళ్ళు ఎందరో డాక్టర్లని సంప్రదించారుగానీ, పెద్దగా లాభం లేదు. నేను హడావిడిగా ఢిల్లీకి బయలుదేరాను. అరుదైన వ్యక్తికి మహా అరుదైనవ్యాధి. ఏమిటీ వైపరీత్యం?

కుమార్‌ని చూడగానే నాగుండె నీరయ్యింది. వాణ్ణి ఆ స్థితిలో చూడాల్సి వస్తుందని నేనెప్పుడూ అనుకోలేదు. అతని జీవితం దాదాపు ముగింపు దశకొచ్చింది. కుమార్ మృత్యువుతో పోరాడుతూ రెండురోజుల తర్వాత ఓడిపోయాడు. రావలసిన వాళ్ళు వచ్చాక అంత్యక్రియలు పూర్తయ్యాయి. నేను వెనుతిరగవలసిన సమయం ఆసన్నమైంది. కుమార్ మావగారు అక్కడే ఉన్నారు. "ఏంటండీ ఈ దారుణం?" అన్నాను. "అవునుబాబూ మేం కూడా ఇలా జరుగుతుందనుకోలేదు" అని కన్నీళ్ళలోంచి నన్ను చూశారాయన. భారమైన హృదయంతో ఊరికి బయలుదేరడానికి తయారవుతున్నాను. కుమార్ లాంటి మంచి మనుష్యులు త్వరితగతిన అంతరించిపోతుంటే ఇక ఈ సమాజంలో మంచికి తావుండదు. ఎక్కడ చూసినా మృగ్యమైపోతున్న మానవతా విలువలు, అపరిమితంగా పెరుగుతున్న స్వార్థం, పదవీకాంక్ష. అందుకే కుమార్ లాంటి వాళ్ళ అవసరం చాలా ఉంది. ఇంతలో కుమార్ మావగారితో వాళ్ళదగ్గరి చుట్టమొకరు "అనిరుధ్ (కుమార్ వాళ్ళ బ్బాయి) ఇప్పటికే సామాజిక సేవా కార్యక్రమాల్లో వాళ్ళ నాన్నగారికి చేదోడువాదోడుగా ఉంటున్నాడు. తను న్యాయశాస్త్రం చదవడం పూర్తయ్యాక ఇంకా చురుకుగా వాళ్ళనాన్న లేనిలోటు భర్తీచేస్తాడనుకుంటున్నాను" అంటూ ఆశాభావం వ్యక్తం చేశాడు. ఆ మాటలు నాలోకూడా స్ఫూర్తి రగిలించాయి. మరింత విరివిగా, ప్రత్యక్షంగా సేవా కార్యక్రమాల్లో పాలుపంచుకోవాలని నిర్ణయించుకున్నాను. అదే కుమార్‌కు నేనర్పించగలిగిన నిజమైన నివాళి కావచ్చు. ఆ సంకల్పంతో నేను మా ఊరికి తిరిగి వచ్చాను.

***సెల్:98485 27109***






# సౌభాగ్య చక్రం

మే 10 నుంచి
మే 16 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ

### మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, వేడుకలు, ఉన్నత విద్యా విషయాలు, వృత్తి, వ్యాపారాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. బహుమతులు ఇచ్చిపుచ్చుకుంటారు. ప్రియతములు కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. 12, 13, 14 తేదీల్లో ఆర్థిక విషయాల్లో ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. పెట్టుబడులకు సంబంధించిన సమాచారం సేకరిస్తారు. ప్రయాణాలు, చర్చల్లో కొంత అసౌకర్యం కలిగే అవకాశం ఉంది. బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. 15, 16 తేదీల్లో ప్రమోషన్లు అందుకుంటారు. ఇంక్రిమెంట్లు లభిస్తాయి. పెద్దల సహకారంతో ఆర్థిక వ్యవహారాల్లో లక్ష్యాలు సాధిస్తారు.

### వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)

వేడుకలు, వృత్తి, వ్యాపారాలు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో వివాహాది శుభకార్యాల్లో పాల్గొంటారు. శ్రీవారు, శ్రీమతి విషయాల్లో శుభపరిణామాలు సంభవం. స్పెక్యులేషన్లు లాభిస్తాయి. 12, 13, 14 తేదీల్లో పన్నులు, బీమా, పెన్షన్ వ్యవహారాలపై దృష్టి సారిస్తారు. రుణాలు మంజూరవుతాయి. పెట్టుబడులు లాభిస్తాయి. ఆర్థిక పరిస్థితిని సమీక్షించుకుంటారు. ఆరోగ్యం మందగించే అవకాశం ఉంది 15, 16 తేదీల్లో బంధుమిత్రుల వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది. ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. సంకల్పం ఫలిస్తుంది.

### మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, రుణప్రయత్నాలు, విద్యా విషయాలు, సమావేశాలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధ, గురువారాల్లో విందు వినోదాల్లో పాల్గొంటారు. వృత్తి, వ్యాపారాల్లో గత అనుభవంతో లక్ష్యాలు సాధిస్తారు. చేపట్టిన పనులు పట్టుదలతో పూర్తి చేస్తారు. 12, 13, 14 తేదీల్లో వేడుకల్లో పాల్గొంటారు. భాగస్వామికి సంబంధించి కీలక సమాచారం అందుకుంటారు. న్యాయ, రక్షణ, విదేశీ వ్యవహారాల రంగాల వారికి శుభప్రదం. ప్రియతములతో ప్రయాణాలు, చర్చల్లో అసౌకర్యం కలిగే అవకాశం ఉంది. 15, 16 తేదీల్లో గత అనుభవాలతో ఆర్థికపరమైన లక్ష్యాలు సాధిస్తారు. రుణప్రయత్నాలు ఫలిస్తాయి. సంస్మరణల్లో పాల్గొంటారు.

### కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)

వేడుకలు, పెట్టుబడులు, ఉన్నత విద్య, సమావేశాలు, బృంద కార్యక్రమాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో వేడుకలు, శుభకార్యాల్లో పాల్గొంటారు. బంధుమిత్రుల కలయిక ఆనందం కలిగిస్తుంది. పెట్టుబడులు లాభిస్తాయి. 12, 13, 14 తేదీల్లో బంధుమిత్రులతో విందు వినోదాల్లో పాల్గొంటారు. కొత్త పరిచయాలు లక్ష్య సాధనకు ఉపకరిస్తాయి. వృత్తి, వ్యాపారాల్లో ఆర్థికంగా ప్రోత్సాహకరం. సన్నిహితుల ఆరోగ్యం కలవరపెడుతుంది. 15, 16 తేదీల్లో పెట్టుబడులు లాభిస్తాయి. ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. పోటీల్లో విజయం సాధిస్తారు.

### సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)

వృత్తి, వ్యాపారాలు, శ్రీవారు, శ్రీమతి విషయాలు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో బదిలీలు, మార్పులకు అనుకూలం. పెద్దలు, పైఅధికారుల వైఖరిలో సానుకూలమైన మార్పు గమనిస్తారు. కుటుంబ విషయాల్లో శుభపరిణామాలు సంభవం. 12, 13, 14 తేదీల్లో వృత్తి వ్యాపారాల్లో సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. చిన్నారుల వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది. పెద్దల సహకారంతో చేపట్టిన పనులు పూర్తి చేస్తారు. ప్రేమానుబంధాలు బెడిసికొట్టే ప్రమాదం ఉంది. 15, 16 తేదీల్లో ఉద్యోగ వ్యాపారాల్లో ప్రోత్సాహకరంగా ఉంటుంది. పెద్దల ఆరోగ్యం మెరుగవుతుంది. ఉన్నత పదవులు అందుకుంటారు.

### కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)

శుభకార్యాలు, విద్య, ఆర్థిక వ్యూహాలు, సమావేశాలకు ఈ వారం అనుకూలం. బుధ, గురువారాల్లో విద్యార్థులకు శుభప్రదం. ప్రయాణాలు ఆనందం కలిగిస్తాయి. సోదరీసోదరుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. 12, 13, 14 తేదీల్లో రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారికి ప్రోత్సాహకరం. వేడుకలు, సమావేశాలకు ఏర్పాట్లు చేస్తారు. బంధుమిత్రులతో ఇల్లు సందడిగా ఉంటుంది. మానసిక ప్రశాంతత లోపిస్తుంది. 15, 16 తేదీల్లో ఉన్నత విద్యా విషయాల్లో ప్రోత్సాహకరం. చిన్నారులు, ప్రియతముల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. పెట్టుబడులు లాభిస్తాయి.

### తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)

రుణప్రయత్నాలు, పెట్టుబడులు, చిన్నారుల విషయాలు దూరప్రయాణాలకు ఈ వారం ప్రోత్సాహకరం. బుధ, గురువారాల్లో ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరంగా ఉంటుంది. విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. 12, 13, 14 తేదీల్లో విద్యకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి. ఆర్థికపరమైన చర్చలు, ప్రయాణాలు ఫలిస్తాయి. సన్నిహితుల ఆంతరంగిక విషయాల్లో జోక్యం చేసుకోవాల్సి రావచ్చు. వేడుకలు ఉల్లాసం కలిగిస్తాయి. 15, 16 తేదీల్లో ఇంటి కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. రుణ ప్రయత్నాలు ఫలిస్తాయి. సంస్మరణల్లో పాల్గొంటారు.

### వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)

కాంట్రాక్టులు, విద్యా విషయాలు, భాగస్వామి విషయాలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధ, గురువారాల్లో పందాలు, పోటీల్లో విజయం సాధిస్తారు. వివాహ నిర్ణయాలకు అనుకూలం. పందాలు, పోటీల్లో విజయం సాధిస్తారు. 12, 13, 14 తేదీల్లో పెట్టుబడులు లాభిస్తాయి. ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. షేర్లు, మ్యూచువల్ ఫండ్ లావాదేవీలకు అనుకూలం. ఖర్చులు అంచనాలు మించుతాయి. 15, 16 తేదీల్లో చర్చలు, సమావేశాల్లో తొందరపాటు తగదు. సోదరీసోదరుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. జనసంబంధాలు విస్తరిస్తాయి.

### ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)

ప్రమోషన్లు, ఇంక్రిమెంట్లు, ఉద్యోగ ప్రయత్నాలు, ఇంట్లో వేడుకలకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధ, గురువారాల్లో సినీ రాజకీయ రంగాల వారికి ప్రోత్సాహకరంగా ఉంటుంది. వైద్యం, పరిశ్రమల రంగాల వారికి ఆర్థికంగా లాభిస్తుంది. లక్ష్య సాధనలో గత అనుభవం తోడ్పడుతుంది. 12, 13, 14 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. విందు వినోదాల్లో పాల్గొంటారు. పరిశ్రమలు, హోటల్, వైద్య రంగాల వారు కీలక నిర్ణయాలు తీసుకుంటారు. ఆరోగ్యం మందగించే అవకాశం ఉంది. 15, 16 తేదీల్లో అదనపు ఆదాయం కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. ఇంక్రిమెంట్ల కోసం ప్రయత్నిస్తారు.

### మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, చిన్నారులు, ప్రియతములు, విద్యా విషయాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో పెట్టుబడులు లాభిస్తాయి. బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. చిన్నారులు ప్రియతముల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. 12, 13, 14 తేదీల్లో విద్యార్థులకు శుభప్రదం. సినీ, రాజకీయ రంగాలవారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. ప్రియతములకు సంబంధించి రహస్య సమాచారం అందుకుంటారు. బ్యాంకింగ్, ఉన్నత విద్య, ఫొటోగ్రఫీ, గ్రనైట్ రంగాల వారు ఆచితూచి ముందడుగు వేయాలి. 15, 16 తేదీల్లో చిన్నారుల వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది. సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. ప్రేమానుబంధాలు బలపడతాయి.

### కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)

గృహారంభ, ప్రవేశాలు, వేడుకలు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో బదిలీలు, మార్పులకు, గృహారంభ, ప్రవేశాలకు అనుకూలం. రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల్లోని వారు పెద్దల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. 12, 13, 14 తేదీల్లో సమావేశాలు, వేడుకలకు ఏర్పాట్లు చేస్తారు. బంధుమిత్రులతో విందుల్లో పాల్గొంటారు. బ్యాంకులు, ఆస్పత్రులు, హోటల్ రంగాల వారికి ఆర్థికంగా లాభదాయం. ఆర్థిక విషయాల్లో ఆచితూచి వ్యవహరించాలి. 15, 16 తేదీల్లో దూరంలో ఉన్న బంధుమిత్రుల రాకతో ఇల్లు సందడిగా ఉంటుంది. వేడుకల్లో పాల్గొంటారు.

### మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)

విద్యా విషయాలు, సమావేశాలు, వేడుకలు, ప్రేమానుబంధాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో విద్యార్థులకు శుభప్రదం. ప్రయాణాలు, చర్చలు ఫలిస్తాయి. ఉన్నత విద్యా ప్రవేశాల కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. 12, 13, 14 తేదీల్లో ప్రముఖులతో చర్చలు ఫలిస్తాయి. ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు. వృత్తి, వ్యాపారాలకు సంబంధించి కీలక సమాచారం అందుకుంటారు. పెద్దల నుంచి మాటపడాల్సి వస్తుంది. 15, 16 తేదీల్లో బృందకార్యక్రమాల్లో ఉల్లాసంగా పాల్గొంటారు. జనసంబంధాలు విస్తరిస్తాయి. ఆర్థిక విషయాల్లో సన్నిహితుల సహకారం లభిస్తుంది.

# నవ్య సినిమా



## దేవుని బిడ్డకు శుభాకాంక్షలు

రాజమౌళి మీద అందరూ ఓ రేంజ్‌లో ప్రశంసల జల్లు కురిపిస్తుంటే సూపర్‌స్టార్ రజనీకాంత్ ఓ అడుగు ముందుకేసి జక్కన్నను దేవుడి బిడ్డగా అభివర్ణించాడు. 'బాహుబలి' లాంటి సినిమా తీయడం, దాన్ని ఇంత పెద్ద హిట్ చేయడం ఎవరితరమూ కాదనీ అది జక్కన్న వలన మాత్రమే సాధ్యమనీ, ఆయన దేవుని బిడ్డ కనుకే ఇంతటి విజయాన్ని సొంతం చేసుకోగలిగాడంటూ సూపర్ స్టార్ రజనీకాంత్ ట్విట్టర్‌లో జక్కన్నను అభినందించాడు. జక్కన్న విషయంలో రజనీకాంత్ స్పందించడం అభినందనీయమే అయినా మరీ దేవుడి బిడ్డ అంటూ సంబోధించడాన్నే కొందరు జీర్ణించుకోలేకపోతున్నారట!

## సల్లూభాయ్ సినిమా వద్దంటున్నారట!



సల్మాన్‌ఖాన్‌కి ప్రపంచవ్యాప్తంగా అభిమానులు ఉన్నారు. ఆయన సినిమా అంటే కళ్ళు కాయలు కాచేలా ఎదురు చూసే వారి సంఖ్య తక్కువేమీ కాదు. అలాంటి సల్మాన్‌ఖాన్ సినిమాకి పాకిస్థాన్‌లో చుక్కెదురైంది. అసలు విషయం ఏమిటంటే....సల్మాన్‌ఖాన్ సినిమా 'ట్యూబ్‌లైట్' రంజాన్ రోజున విడుదల చేయాలనుకున్నారు. పాకిస్థాన్‌లో అదే సమయంలో రెండు సినిమాలు విడుదల అవుతున్నాయట! అందుకని ఈ సినిమా విడుదల ఆపివేయాలని అక్కడి డిస్ట్రిబ్యూటర్లు ప్రభుత్వానికి లేఖ రాశారట! దీని మీద అక్కడి అధికారులు సానుకూలంగా స్పందించారట!

## ఒట్టు గట్టున పెట్టేశాడు



మొన్నటి వరకూ ట్విట్టర్‌లో ఎవరి ప్రస్తావన తీసుకురానని సాక్షాత్తు బిగ్‌బీ మీదా, తన తల్లి మీదా వర్మ ఒట్టు పెట్టుకున్నాడు. ఒట్టు పెట్టిన తరువాత ఓ నాలుగైదు రోజులు సైలెంట్‌గా ఉన్నాడు. 'బాహుబలి 2' విడుదల తరువాత తిరిగి ట్వీట్ల విజృంభణ ప్రారంభించాడు. రానాను హాలీవుడ్ స్టార్‌తో పోలుస్తూ అతగాడు ఇంకా ముందు పుట్టి ఉంటే బాగుండేది అంటూ పొగడ్తల వర్షం కురిపించాడు. రాము సెటైర్లకు తట్టుకోలేక రానా ఓ నమస్కారం కూడా పెట్టాడు. ఈ సినిమా నచ్చని వారిని పిచ్చివాళ్ళ కింద జమకట్టాలని కూడా ఓ ఉచిత సలహా పారేశాడు.

## ఈ సంవత్సరం ఉత్తమ జోక్!



ఈ వార్తకీ, నటుడు సుబ్బరాజుకి ఎలాంటి సంబంధం లేకపోయినా ఇది కచ్చితంగా ఈ సంవత్సరం ఉత్తమ జోక్ అంటున్నారు. ఈ వార్త సారాంశం ఏమిటంటే... రాజమౌళి తరువాతి సినిమాలో సుబ్బరాజే హీరో అన్న పుకారు బాగా షికారు చేస్తోంది. .రాజమౌళి 'మగధీర' తరువాత సునీల్‌తో 'మర్యాద రామన్న' తీశాడు. సునీల్ 'మగధీర'లో కామెడీ సీన్లు బాగా చేశాడు. దాంతో తన తరువాతి సినిమాలో అతగాడినే హీరోగా పెట్టి తీసిన చిన్న సినిమా పెద్ద హిట్టయింది. ఇప్పుడు కూడా రాజమౌళి ముందు ఫార్ములానే ఫాలో అవుతాడని కొందరు అంటున్నారు. దాని ప్రకారం 'బాహుబలి 2'లో కామెడీ చేసిన సుబ్బరాజు హీరోగా ఓ సినిమా చేసే అవకాశం ఉంది అంటున్నారు సినీ జనాలు. ఇది నవ్వుకోవడానికే అయినా, ఈ సినిమా పట్టాలెక్కినా ఆశ్చర్యపోనవసరం లేదన్న వాదన కూడా వినిపిస్తోంది.

## నిర్మాతగా సోను మరో చిత్రం



విలన్‌గా పరిచయం అక్కర్లేని నటుడు సోనూ సూద్. దక్షిణాదిన, ఉత్తరాదిన అందరికీ తెలిసిన సోనూ ఇప్పుడు సోలో నిర్మాతగా అవతారమెత్తబోతున్నాడు. అదీ ఓ తెలుగు క్రీడాకారిణి జీవితాన్ని సినిమాగా తీయబోతున్నాడు. బాడ్మింటన్ క్రీడాకారిణి పివి సింధూ జీవితాన్ని తెరకెక్కించబోతున్నాడట! సింధూ జీవితం తనని ఎంతో ప్రభావితం చేసిందనీ, అందుకే ఆమె క్రీడా జీవితాన్ని తెరకెక్కించాలనే కోరిక కలిగిందనీ ట్విట్టర్‌లో పేర్కొన్నాడు. కాకపోతే ఈ సినిమాకు సంబంధించి గ్రౌండ్ వర్క్ జరుగుతోందట!



పేరులోనే కూల్‌ని నింపుకున్న ఏకైక హీరోయిన్ రకూల్ ప్రీత్ సింగ్! తొలి సినిమా 'దక్షిణాది ఎక్స్‌ప్రెస్'తో తెలుగులోకి దూసుకు వచ్చిన రకూల్ స్పీడ్‌కు బ్రేకుల్లేకుండా పోయాయి. ఓ వైపు చేతినిండా సినిమాలు, మరో వైపు వ్యాపార విస్తరణ. క్షణం తీరికలేని జీవితం. తన కష్టానికి భగవంతుడి కృప కూడా తోడయింది అంటున్న రకూల్‌తో....

# ప్రమోషన్ వద్దా?

## -రకూల్‌ప్రీత్ సింగ్

**టాలీవుడ్, కోలీవుడ్ సినిమాలతో బిజీ బిజీగా ఉన్నట్టున్నారు?**

చిన్నతనం నుంచీ నాది బిజీ షెడ్యూలే! ఆరు సంవత్సరాల వయస్సు నుంచే నాకు రకరకాల వ్యాపకాలుండేవి. ఉదయం డ్యాన్స్, స్కూలు, ఆ తరువాత ఆటలు, రాత్రి డిన్నర్, పది గంటలకు పడుకోవాలి. ఉదయం ఐదు గంటలకి లేవాలి. మా ఫాదర్ ఆర్మీ వ్యక్తి కావడంతో అన్నీ పద్ధతిగా జరిగిపోయేవి. నేను అన్ని రంగాల్లోనూ రాణించాలన్నది మా పేరెంట్స్ కోరిక! ముఖ్యంగా మా మదర్ ఈ విషయంలో చాలా పర్టిక్యులర్‌గా ఉండేది. నా షెడ్యూల్ అంతా తనే చూసుకునేది. ఈ కారణంగా ఇప్పుడు ఎంత బిజీగా ఉన్నా కూడా టెన్షన్ అనిపించదు. కూల్‌గా చేసుకుంటూ వెళ్ళిపోతాను.

**రకూల్ రెమ్యునరేషన్ పెంచిందంటున్నారు! ఎంత వరకు నిజం?**

ప్రతి ఉద్యోగికి ప్రమోషన్ ఉంటుంది. జీతంలో హైక్ ఉంటుంది. నటన కూడా ఓ ప్రొఫెషనే కదా! మరి నాకెందుకు జీతం పెరగకూడదు. నా మొదటి సినిమాకి కేవలం ఐదు లక్షలు మాత్రమే తీసుకున్నాను. అప్పటికి అదే ఎక్కువ. ఇప్పుడు నాలో చాలా పరిణతి పెరిగింది. సినిమా సినిమాకీ అది తెలుస్తూనే ఉంది. ఓ సినిమాకి ఎక్కువ ఇచ్చారు అంటే దానికి రకరకాల కారణాలు ఉంటాయి. ఒక్కో సినిమాకి 30 రోజులు మాత్రమే ఇవ్వాల్సి ఉంటుంది. మరో సినిమాకి 60 రోజులు పనిచేయాలి. 30 రోజులకి తీసుకున్నదే 60 రోజులికీ తీసుకోలేం కదా? డబుల్ పని చేశాను కనుక డబుల్ తీసుకుంటాను. అంతమాత్రాన రకూల్ రెమ్యునరేషన్ పెంచిందనడం ఎంత వరకు కరెక్ట్? ఈ మాట అనే ముందు నేను చెప్పిన మాటలు అర్థం చేసుకుంటే బాగుంటుంది.

**బిజినెస్ ఎలా ఉంది?**

బ్రహ్మాండంగా ఉంది. మరో రెండు శాఖలు ప్రారంభించే ఆలోచన ఉంది. అదంతా మా ఫ్యామిలీ చూసుకుంటోంది. నా పర్యవేక్షణ అంతంత మాత్రమే!

**రకూల్‌కి ఇల్లు గిఫ్ట్‌గా ఇచ్చారు...లాంటి పుకార్లు విన్నప్పుడు ఎలా స్పందిస్తారు?**

ఇది ఎప్పుడో జరిగిన సంఘటన. దీని మీద గతంలోనే చాలా సార్లు వివరణ ఇచ్చాను. నేను కొన్న ఇంటి విలువ మూడు కోట్లు. అంత మొత్తం నగదు రూపంలో ఇవ్వ

**మీది గోల్డెన్ లెగ్ అంటారు కదా....ఆ మాట విన్నప్పుడు ఎలా ఉంటుంది?**

మొదటి సినిమా తరువాత గోల్డెన్ లెగ్ అన్నారు. ఆ తరువాత రెండు సినిమాలు సరిగ్గా ఆడకపోయేసరికి ఐరన్‌లెగ్ అన్నారు. ఇప్పుడు తిరిగి గోల్డెన్ లెగ్ అంటున్నారు. ఈ బిరుదులు శాశ్వతం కాదు. సినిమా సినిమాకీ మారిపోతూ ఉంటాయి. వీటిని వింటే నాలో ఎలాంటి ఫీలింగూ కలగదు. ఓ సినిమాలో అయితే నాది ఐరన్‌లెగ్ అంటున్నారని కొంత షూటింగ్ జరిగిన తరువాత తప్పించారు. అలా అన్నవాళ్ళే ఇప్పుడు గోల్డెన్ లెగ్ అంటున్నారు.



లేదు. బ్యాంక్ లోన్ తీసుకున్నాను. ఈ విషయం చాలా మందికి తెలుసు. ఇప్పటికీ నేను ఇఎంఐ కడుతూనే ఉన్నాను. ఆ ఇంటిని ఎవరో నాకు గిఫ్ట్‌గా ఇస్తే బ్యాంకు లోన్ ఎందుకు తీస్తాను? ఇలాంటివి విన్నప్పుడు నాకన్నా మా ఫాదరే ఎక్కువ ఫీలవుతుంటారు. ఎదురు నేను వాళ్ళకి సర్దిచెబుతూ ఉంటాను.

**మీ విజయ రహస్యం?**

చిన్నతనం నుంచీ ఒత్తిడికి గురవడం అంటూ జరగలేదు. కష్టపడి పనిచేస్తే విజయం దానంతటదే వస్తుంది అన్నది మా ఫాదర్ చెప్పేవారు. ఇప్పటి వరకూ దాన్నే ఫాలో అవుతూ వస్తున్నాను. కొన్నిసార్లు ఎంత కష్టపడినా సక్సెస్ రాకపోవచ్చు. కానీ మన కష్టం మాత్రం కనిపిస్తూనే ఉంటుంది. ఓ సినిమా సక్సెస్ అయినా, ఫ్లాప్ అయినా దానికి బోలెడన్ని కారణాలుంటాయి. సక్సెస్‌కి పొంగిపోయి నేనే కారణం అనుకోను. అలాగే నా వలనే ఫ్లాప్ అయిందని బాధపడుతూ కూర్చోను.

**మీ దృష్టిలో గెలుపంటే...**

నేను ఎవరితో పనిచేసినా వారు నా పట్ల మంచి ఒపీనియన్ కలిగి ఉండడమే నిజమైన గెలుపు. ఎదుటి వారిలో అలాంటి అభిప్రాయాన్ని కలిగించామంటే అదే నిజమైన గెలుపు. కొందరు చాలా సంపాదించడమే నిజమైన గెలుపు అనుకుంటారు. మనం ఎంత సంపాదించినా, చుట్టూ నలుగురు లేకపోతే, మాట్లాడే వారే లేకుండా, పలకరించేవారే కరువైతే అది గెలుపు అవుతుందా? మన మంచి కోరే నలుగురు ఎప్పుడూ మన వెంట ఉండడమే నిజమైన గెలుపు. గొప్ప స్నేహితులు తోడుంటే గొప్ప జీవితం ఉన్నట్టే!

**మీరు టైమ్‌కి షూటింగ్‌కి హాజరవుతారు అంటారు. ముందుగానే ప్లాన్ చేసుకుంటారా?**

ఏ పని చేసినా కరెక్ట్‌గా చేయాలి అన్నది మా ఫాదర్ దగ్గర్నుంచి నేర్చుకున్నాను. అలాగే టైం పంక్చుయాలిటీ కూడా! మామూలుగా అందరి కన్నా నేనే ముందు ఉంటాను. నా తరువాతే ఒక్కొక్కరూ వస్తుంటారు.

**రెజీనాను కాంపిటీటర్‌గా భావించారా?**

ఇక్కడ నాకున్న మంచి స్నేహితురాలు తను. స్నేహితురాలు కాంపిటీటర్ ఎలా అవుతుంది? ఆఫీసులో చాలా మంది కలిసి పనిచేస్తుంటారు. వారిలో వారు అలా ఫీలవరు కదా! ఎవరి పని వారికుంటుంది. ఈ ఫీల్డ్ కూడా అంతే! తన సినిమాలు తనకుంటాయి. నా సినిమాలు నాకుంటాయి.

**రకూల్ గ్లామర్ హీరోయిన్ అంటారు. ఎంతవరకు నిజం?**

స్టయిల్‌కీ, గ్లామర్‌కీ చాలా డిఫరెన్స్ ఉందని నా అభిప్రాయం. నేను చేసిన సినిమాల్లో చాలా వరకూ పల్లెటూరి అమ్మాయి పాత్రలే చేశాను. రెండు మూడు సినిమాలు స్టయిలిష్‌గా ఉండే పాత్రలు చేశాను. ఆ పాత్రలకి మోడ్రన్ డ్రస్సులు వేసుకోవాలి. అంత దానికే గ్లామర్ హీరోయిన్ అనడం సమంజసం కాదేమో!



**మీ పేరెంట్స్‌తో కలిసి మీ సినిమాలు చూస్తుంటారా?**

కచ్చితంగా చూస్తాను. నేనేమీ అడల్ట్ సినిమాలు చేయడం లేదు కదా! మామూలు సినిమాలే చేస్తున్నాను. అలాంటప్పుడు వారితో కలిసి చూడడానికి ఎందుకు భయపడాలి. అడల్ట్ కంటెంట్ ఉన్న సినిమాలు ఎంత ఇచ్చినా చేయను.

**మీకు సరైనోడు...?**

ఇంకా కంటపడలేదు. అలాంటి వాడి కోసం ఎదురు చూస్తున్నాను అని అనుకోకండి. సమయం వచ్చినప్పుడు కంటపడతారు. అంతే! దానికి ఇంకా టైముంది.

**ప్రేమ పెళ్ళా? అరేంజెడ్ మ్యారేజా?**

మొదట నాకు వివాహవ్యవస్థ మీద గౌరవం ఉంది. పెద్దలు కుదిర్చిన పెళ్ళిలో ఎక్కువ సంతోషం ఉంటుంది. అది మా పేరెంట్స్‌ని చూసి తెలుసుకున్నాను. నా విషయానికి వస్తే ఎలాంటి మ్యారేజ్ చేసుకోవాలి అన్నది ఇంకా నిర్ణయించుకోలేదు. బోలెడు టైముంది కదా! అప్పటి నిర్ణయం అప్పుడు తీసుకుంటాను.

హైదరాబాద్‌లో ఇల్లు తీసుకున్నారు. మరి బాలీవుడ్‌లో సినిమాలు చేస్తే అక్కడ కూడా తీసుకుంటారా? ముంబయి చాలా కాస్ట్‌లీ. నేను ఎన్ని సినిమాలు చేసినా అక్కడ ఇల్లు తీసుకోవడం కుదరదు. దక్షిణాది వారు ఇంతగా ఆదరిస్తుంటే అక్కడికి వెళ్ళాల్సిన అవసరం ఏముంది? ఒక వేళ ఏదైనా మంచి కథ దొరికి సినిమా చేసినా ఇక్కడి నుంచే వెడతాను. నేను ఎక్కడ పుట్టినా నా హోమ్ టౌన్ హైదరాబాదే!

—స్పందనారెడ్డి

ఇంటర్వ్యూ



# భవిష్యత్తు తెలుగు చిత్ర పరిశ్రమదే!

## -రాజీవ్ కనకాల

**నట కుటుంబం, నట గురువుల కుటుంబం నుండి వచ్చిన నటుడు రాజీవ్ కనకాల. రెండున్నర దశాబ్దాలుగా 110 కిపైగా చిత్రాల్లో నటించి ప్రేక్షకుల్లో మంచి గుర్తింపు పొందారు. తెలుగు చిత్ర పరిశ్రమ అంతర్జాతీయ ఖ్యాతి సంపాదించిందనీ, తెలుగు పరిశ్రమలో ఉన్నంత బలం మరెక్కడా లేదనీ అంటారాయన. భవిష్యత్తు తెలుగు చిత్రసీమదే. పౌరాణికాలు, జానపదాలు, కుటుంబ కథ, కౌబోయ్ చిత్రాలేవైనా విజయవంతంగా నిర్మించగల దమ్ము, ధైర్యం తెలుగు దర్శకులకే ఉన్నాయని ఖచ్చితంగా చెప్పగలనంటున్న రాజీవ్ కనకాల ఇంటర్వ్యూ ఈ వారం...**

మా నాన్నగారు దేవదాస్ కనకాల. అమ్మ లక్ష్మీ దేవి కనకాల. ఇద్దరూ నటులే. ఎంతోమంది ప్రముఖ నటులను నట శిక్షణాలయం ద్వారా తీర్చిదిద్దిన ఘనత వారికి దక్కింది. నేను పుట్టింది హైదరాబాద్ పాతనగరం అఫ్జల్‌గంజ్ ప్రభుత్వ ఆసుపత్రిలో. ఆ రోజుల్లో నగరంలో అదొక్కటే మంచి ఆసుపత్రి. ప్రైవేటు ఆసుపత్రులు కూడా తక్కువగా ఉండేవి. ఎల్.కె.జి నుంచి ఫస్ట్ క్లాస్ వరకు హైదరాబాద్‌లో రెండు మూడు తరగతులు చెన్నైలో చదివాను. ఆ తర్వాత నా చదువంతా హైదరాబాద్‌లోనే. పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంలో థియేటర్ ఆర్ట్స్‌లో పట్టా తీసుకున్నాను. ఈ విశ్వవిద్యాలయం మా బ్యాచ్‌తోనే ఆరంభమైంది. జె.వి.సోమయాజులు, చాట్ల శ్రీరాములు, దీక్షితులు, ప్రసాద్ రెడ్డి కల్యాణి, వినోద్‌బాలగార్లు మా గురువులు. దశిక రాములుగారి టీచింగ్ పద్ధతి మాత్రం చాలా ప్రత్యేకంగా ఉండేది. గచ్చిబౌలిలోని సెంట్రల్ యూనివర్సిటీలో థియేటర్ ఆర్ట్స్‌లో ఎం.ఏ చేశాను.

### నాటకానుభవం

నాలుగో తరగతి చదువుతున్నప్పుడే నా నాటకరంగ ప్రవేశం జరిగింది. 'మాలపిల్ల', 'శాకుంతలం', 'మా నాన్న కావాలి' నాటకాలు వేసేవాణ్ణి. ఈ విషయంలో నాన్నతో గొడవపడి మరీ నాటకాల్లో నటించే వాణ్ణి. ఆ ధ్యాసలోపడితే పూర్తిగా చదువుపోతుందేమో అనేది నాన్నగారి ఆలోచన. అందుకే నాన్నగారు నన్ను వీటికి కొంచెం దూరంగా ఉంచేవారు. అయినా నేను పట్టుబట్టి నాటకాల్లో వేసే వాణ్ణి.

### రసరంజని

కె.వి.రమణాచారిగారి ఆధ్వర్యంలో రసరంజని సంస్థ ప్రారంభమైంది. నాటకాన్ని ఎంతో అభివృద్ధిలోకి తీసుకువెళ్ళాలనే సంకల్పంతో ఈ సంస్థను స్థాపించారు. ప్రేక్షకులు ఎంతోకొంత టిక్కెట్టు కొనుక్కుని నాటకాలు చూసేలా చెయ్యాలని వారి ఉద్దేశం. ఇందులోభాగంగా ఎంతోమంది పెద్దలు కృషి చేశారు. 'ప్రసన్నకు ప్రేమతో', భరణిగారి 'కొక్కొరొక్కో' లాంటి ప్రముఖ నాటకాలను ఒక్కొక్కటీ దాదాపు 15 రోజులపాటు ప్రదర్శించేవాళ్ళం. వాటిల్లో ముఖ్య పాత్రలు నాకే వచ్చేవి. ఇలా నా నట జీవితం నాటకాలతో ముడిపడి వెండితెర వరకు వెళ్ళింది.

### తొలిచిత్రం 'బోయ్‌ఫ్రెండ్'

నా మొదటి చిత్రం 'బోయ్‌ఫ్రెండ్'. 1991లో వచ్చింది. ఈ సినిమా నిర్మించేముందు భరత్‌గారు జూబ్లీహిల్స్‌లో ఇంటర్వ్యూలకు పిలిచారు. నీకు వేషం ఇస్తున్నాం అన్నారు. చాలా సంతోషం కలిగింది నాకు. ఆర్టిస్టుగా గుర్తింపు పొందడానికి మొదట్లో చాలా ఇబ్బందులు పడ్డాను. అవమానాలు కూడా ఎదుర్కొన్నాను. కనీసం జూనియర్ ఆర్టిస్టు అనే గౌరవం కూడా లేకుండా ప్రవర్తించేవారు. ఇదంతా మద్రాసులో సంగతి.

నా రెండవ చిత్రం 'సూర్యపుత్రులు'లో ఏ.వి.ఎస్ గారు ఎస్సై పాత్ర చేశారు. అప్పటికే ఏ.వి.ఎస్.గారు మంచి పికప్‌లో ఉన్నారు. ఆ షూటింగ్‌లో నా నటన చూశాక నన్ను దగ్గరకు పిలిచి, "విరగదీశావ్ కదయ్యా, కీపిటప్' అని ఆశీర్వదించారు. కాకపోతే ఈ చిత్రం మూడు సంవత్సరాల తర్వాత 1996లో విడుదలైంది.

నా మూడో చిత్రం 'రామబంటు'. సూర్యపుత్రులు కంటే ఈ చిత్రమే ముందు విడుదలైంది. ఈ చిత్రంలో రాజేంద్రప్రసాద్‌గారు హీరో. నాది కొడుకు పాత్ర. మంచి కుటుంబ కథా చిత్రమిది. బాపు దర్శకత్వంలో వచ్చిన ఈ చిత్రం 1995లో విడుదలైంది. పెద్దన్నయ్య, స్టూడెంట్ నెంబర్ వన్, ఆది, ఏ ఫిలిమ్ బై అరవింద్, సరైనోడు, బ్లాక్ అండ్ వైట్, సై, విక్రమార్కుడు, జనతాగ్యారేజ్, యమదొంగ, నాన్నకు ప్రేమతో, లక్ష్మి, దూకుడు, క్షేత్రం, నాయక్...ఇలా ఎన్నో చిత్రాలు ప్రేక్షకులు మెచ్చినవి, నాకు నచ్చినవి ఉన్నాయి.

### నా చిత్తశుద్దే నన్నీస్థాయిలో నిలబెట్టింది

ఏఎన్నార్, ఎన్టీఆర్‌లు అన్నపూర్ణా స్టూడియో, రామకృష్ణ సినీ స్టూడియో నిర్మాణాలతో హైదరాబాద్‌లో ఉండేవారు. అప్పటికి ఇండస్ట్రీ మద్రాసులోనే ఉండేది. సూర్యపుత్రులు సినిమా కోసం హైదరాబాద్ బంజారాహిల్స్‌లోని ఒక పాఠశాలలో సెలక్షన్స్ జరిగాయి. హైదరాబాద్ బోయిన్‌పల్లి పోలీస్ స్టేషన్లో షూటింగ్ ప్రారంభించారు. తర్వాత చెన్నైకి రమ్మన్నారు.

నా ముతకబట్టలు చూసి షూటింగ్‌లో బోయ్ నన్ను ఈసడించుకుని ఫో, పోయి అక్కడ చెట్టు దగ్గర కూర్చో, ఇక్కడ సీనియర్స్ కూర్చుంటారు అన్నాడు హేళనగా విసుక్కుంటూ. వెంటనే ఏ.వి.ఎస్ గారు నన్ను పిలిచి తన దగ్గర కూర్చోబెట్టుకున్నారు. విశేషం ఏమిటంటే ఈ సినిమా షూటింగ్ మూడు సంవత్సరాలు కొనసాగింది. ఈ షూటింగ్ కోసం నేను దాదాపు పదహారు సార్లు చెన్నై – హైదరాబాద్ మధ్య తిరిగాను. మమ్ముట్టి, సుమన్‌ల డేట్స్ దొరికేవి కావు. షూటింగ్ ఉందనేవారు, వెళ్తే కేన్సిల్ అయిందనేవారు. నాన్నగారు నేర్పిన క్రమశిక్షణ కారణంగానే నేను ఆ రోజుల్లో ఈ సినిమాలో పాత్రకోసం అన్నిసార్లు ఎంతో కమిటెడ్‌గా ఓపికగా తిరిగాను. అవన్నీ మరపురాని సంఘటనలు. ఆ ఓపిక, చిత్తశుద్ధే నన్ను ఈ రోజు ఈ స్థాయిలో నిలబెట్టింది.

జూనియర్ ఎన్టీఆర్ నేను క్లాస్‌మేట్స్ కాదు, మిత్రులం మాత్రమే. ఆయనతో నటించిన చిత్రాలన్నీ విజయవంతమైనవి కావడం ఒక సెంటిమెంట్. ఆయన చిత్రాల్లో నేను నటిస్తే బాగుంటుందని ప్రేక్షకులు అనుకుంటారు. మా కాంబినేషన్ బాగుంటుంది. అంతేతప్ప మరింకేం లేదు.

### నచ్చిన దర్శకులు

తెలుగు చిత్ర పరిశ్రమలో అందరూ గొప్ప దర్శకులే. కొత్త కొత్త యువ దర్శకులు తెరమీదకు వస్తున్నారు. నూతన సాంకేతిక పరిజ్ఞానంతోపాటు యువ దర్శకుల ఆలోచనా విధానం కొత్తరకంగా ఉంటోంది. నటీనటులు కూడా అంతే. నాకు నచ్చిన దర్శకులలో రాజమౌళి, వి.వి.వినాయక్, బాపు, విశ్వనాథ్, రాఘవేంద్రరావుగారు...వీరందరి దర్శకత్వం నాకు బాగా నచ్చుతుంది. శాంతినివాసం సీరియల్‌లో చేశాను. 'స్టూడెంట్ నెంబర్ 1' కూడా రాఘవేంద్రరావుగారు ప్రొడ్యూస్ చేసిన చిత్రమే. ఈ చిత్రానికి రాజమౌళి దర్శకత్వం వహించారు. అదేవిధంగా బాపుగారి టి.వి.సీరియల్ 'భాగవత కథలు' సీరియల్‌లో చేశాను. మేం ఫీల్డుకు వచ్చినప్పుడు జానపదాలు లేవు. పౌరాణికాలు లేవు. ఏవో అడపాదడపా పౌరాణికాలు వచ్చేవంతే.

### నాకీ తృప్తి చాలు

తెలుగు చిత్రపరిశ్రమ వచ్చి 80 సంవత్సరాలు గడిచింది. ఒకప్పుడు, టి.వి. పరిశ్రమ సినిమాను డామినేట్ చేస్తుంది, సినీ పరిశ్రమ మూసుకుపోతుంది అనుకున్నారు. కానీ అలాంటిదేం జరగలేదు. రెండు పరిశ్రమలూ నిలదొక్కుకున్నాయి. కొత్తనీరు వచ్చి పాతనీటిని తోసేస్తుంది. అదేవిధంగా నటుడు ఎంతకాలం ఫీల్డులో ఉంటాడనే గ్యారంటీ లేదు. నేను ఇంతకాలం ఇండస్ట్రీలో కొనసాగానంటే కారణం ఆయా వ్యక్తుల మంచితనం, గొప్పతనం, సహకారం ఉండబట్టే. నిర్మాతలు, ప్రేక్షకులు నన్ను ఎంతో ఆదరించారు గనుకనే ఇప్పటికి 110 సినిమాలు చేయగలిగాను. ఉన్నంతకాలం సంతోషంగా ఉన్నాను. నాకీ తృప్తిచాలు.

### ఇప్పటి నటులకు అవకాశాలెక్కువ

అప్పట్లో నటులకు మెయిన్‌రోల్ మీదే ఎక్కువ మక్కువ ఉండేది. సినిమా అయినా, స్టేజీ నాటకమైనా నటులు ఎంతో జాగ్రత్తగా దర్శకుని అడుగుజాడల్లో నడిచేవారు. ఇప్పటి నటులకు అదేం లేదు. ఫాస్ట్‌ఫుడ్‌లా వేడి వేడిగా చేసేస్తున్నట్టే ఉంటోంది. అన్ని రకాల పాత్రలు చేసే అద్భుతమైన నటులు, మంచి నటులు మనకున్నారు. కంపేర్‌చేస్తే, ఆనాటి నటుల్లోనే ఎక్కువశాతం మంచి నటన కనబరిచేవారున్నారనడంలో ఎలాంటి సందేహం లేదు. కానీ ఇప్పటితరంలో మాత్రం అలాంటివారిని వేళ్ళమీద లెక్కబెట్టవచ్చు. ఇప్పుడు మంచి నటుడుగా తయారవ్వడానికి ఎన్నో మంచి అవకాశాలున్నాయి. జాగ్రత్తగా చేసుకుంటే లాంగ్ స్టాండింగ్ కెరీర్ ఉంటుంది.

### మనది అంతర్జాతీయ స్థాయి

ఒకప్పుడు 'లవకుశ', 'మాయాబజార్' వంటి చిత్రాలతో తెలుగు పరిశ్రమను జాతీయస్థాయికి తీసుకువెళ్ళారు. కె.వి.రెడ్డి, హెచ్.ఎం.రెడ్డి, సి.పులయ్య, నాగిరెడ్డి, చక్రపాణి, ఎన్టీఆర్, ఏఎన్నార్, ఎస్వీఆర్ లాంటి మహనీయులు అందుకోసం ఎంతో కృషి చేశారు. ఇప్పుడు బాహుబలితో తెలుగు చిత్ర పరిశ్రమ అంతర్జాతీయస్థాయికి ఎదిగింది. మన మార్కెట్ పెరిగింది. జానపద, పౌరాణిక, కుటుంబకథ, కౌబోయ్ చిత్రాలు ఏవైనా బ్రహ్మాండంగా తీయగల దర్శకులు మనకున్నారు. భవిష్యత్తు తెలుగు చిత్ర పరిశ్రమదే!

### నాన్నగారు ఒక నిఘంటువు

నాన్న దేవదాస్ కనకాలగారు ఒక నిఘంటువు. విజనరీ. మోర్ ఓవర్ దిక్సూచి. ఈనాటి గొప్ప నటులంతా ఆయన దగ్గర పాఠాలు నేర్చుకున్నవారే. రజనీకాంత్, చిరంజీవి, రాజేంద్రప్రసాద్, శుభలేఖ సుధాకర్, నాజర్, ప్రదీప్‌శక్తి, భానుచందర్, అరుణ్ పాండ్యన్, రాంకీ, రఘువరన్ వీళ్ళంతా దక్షిణాదిన స్టార్సే. టీవీలో ఉన్న నటులంతా నాన్నగారివద్ద తర్ఫీదు పొందినవారే.

### నా జీవితంలో ఒక అద్భుతం 'సుమ'

ఒక భర్తగా నేను చెప్పాలంటే, నా జీవితంలో ఏవైనా అద్భుతాలు జరిగాయంటే అందుకు నా భార్య సుమ ముఖ్య కారణం. ఒక తల్లిగానే కాదు, అన్ని రంగాల్లో ఆమె రాణించడం నిజంగా గొప్ప విషయం. యాంకర్‌గా ఈనాడు తెలుగు రాష్ట్రాలలోనే కాదు, అన్ని రాష్ట్రాలవారు ఆమెను ఆదరిస్తున్నారు. ఒక మనిషికి ఉండాల్సిన అన్ని క్వాలిటీస్ ఆమెలో ఉన్నాయి. ఆడవారిలో ఉండే ఓర్పు, సహనం, నైపుణ్యం అన్నీ తనలో ఉన్నాయి. వేలు లక్షలమంది ముందు వేదికపై నిలబడి ఆమె తొణకకుండా బెణకకుండా ఏకధాటిగా మాట్లాడటం, యాంకరింగ్ చెయ్యడం అంటే కత్తిమీద సాము లాంటిదే. అది అందరికీ సాధ్యం కాదు. ఒక భర్తగానే కాకుండా, ఒక అభిమానిగా నేను చెబుతున్నాను. షి ఈజ్ రియల్లీ గ్రేట్.



కుటుంబసభ్యులతో

### మా అమ్మ లక్ష్మీదేవే

మా అమ్మ అంటే అమ్మే! ఆవిడ నటి. మా అమ్మగారు సాంగ్ అండ్ డ్రామా డివిజన్‌లో పని చేస్తున్న సమయంలో 1971 నవంబరు 21న మా అమ్మా నాన్నల వివాహం జరిగింది. అమ్మ బి.ఏ.బిఇడి చదివి థియేటర్ ఆర్ట్స్‌లో డిప్లొమా చేసింది. అనేక సార్లు ఉత్తమనటి అవార్డు అందుకున్న స్టేజీ ఆర్టిస్టు. నాన్నగారి శిష్యులందరూ ఇంచుమించు అమ్మ దగ్గర కూడా శిష్యరికం చేసినవారే.

### కుటుంబం

నా భార్యపేరు సుమ. మాకు ఇద్దరు పిల్లలు. అబ్బాయి రోషన్. ఇంటర్మీడియట్ మొదటి సంవత్సరం చదువుతున్నాడు. అమ్మాయి మనస్విని. ఐదవ తరగతి చదువుతోంది.

–కె. హరనాథ్,
సెల్:97035 42598

# ఇవన్నీ నిజాలే!

## ఐదేళ్ల వయసులో మాతృత్వం!

- 1933లో లిండా మెడినా అనే అయిదేళ్ళ బాలిక మగబిడ్డకు జన్మనిచ్చింది. అరుదైన శరీర నిర్మాణం కారణంగా ఆమెకు అపురూపమైన యవ్వనం సంప్రాప్తించింది. ప్రపంచంలో అతి పిన్నవయసులో మాతృత్వం చవిచూసిన రికార్డు ఇదే.
- మన దేశంలో మొట్టమొదటి మహిళా మైనింగ్ ఇంజనీర్ డాక్టర్ చంద్రాణి ప్రసాద్‌వర్మ.
- ఒక ఏనుగు తన నూరేళ్ళ జీవితకాలంలో 30-90 మధ్య వయసులో సగటున ఆరు పిల్లల్ని కనగలదు.
- మైక్రోసాఫ్ట్‌లో 34 శాతం ఉద్యోగులు భారతీయులే.
- దేశంలో 77 శాతం నదులు బంగాళాఖాతంలోనే కలుస్తున్నాయి.
- ప్రపంచ దేశాల్లో ప్రతి సంవత్సరం 35 కోట్ల రూబిక్ క్యూబ్స్‌ను యువతరం కొనుగోలు చేస్తోంది.
- తిరుమలలో ఏడాదంతా 450 ఉత్సవాలు జరుగుతాయి.
- మనదేశంలో 11వ శతాబ్దంలో నాటి పాలకులు మొదట ప్రవేశపెట్టింది జిజియా పన్ను.
- శ్రీకృష్ణదేవరాయలు పట్టాభిషేకానికి పోర్చుగీసు రాయబారి లూయిజ్ ప్రేయర్ హాజరయ్యాడు.
- నీ పుట్టుక అతి సామాన్యమైనదే కావచ్చు, కానీ నీ మరణం చరిత్రాత్మకమైనదిగా ఉండాలి. —అబ్దుల్ కలామ్
- మన దేశంలో 74 కోట్ల క్రెడిట్ కార్డులున్నాయి. పి.ఓ.ఎస్ (పాయింట్ ఆఫ్ సేల్) పరికరాల ద్వారా 2016లో 63 వేల 500 కోట్ల రూపాయల లావాదేవీలు జరిగాయి.
- ప్రతి వందమంది మగవారిలో ఏడుగురు రంగుల్ని సరిగ్గా గుర్తించలేరు.

## గ్రేట్

- శనిగ్రహంపైకి ఇరవైయేళ్ళ క్రితం ప్రయోగించిన కేస్సినీ అంతరిక్ష నౌక ఇప్పటివరకు ఏ నౌకా వెళ్ళని ప్రాంతాలకు వెళ్ళింది. 13 ఏళ్ళుగా శని చుట్టూ తిరుగుతూ దాని వలయాల మధ్య ప్రయాణించి విలువైన సమాచారం అందించింది. శని ఉపగ్రహం టైటాన్ గురించీ తెలుసుకుంది. ఇక 2017 సెప్టెంబరు 15 నాటికది శని గ్రహంపైపడి అంతమైపోతుంది.
- ఛార్లెస్ డార్విన్ 1859లో 'ఆరిజిన్ ఆఫ్ స్పీసిస్' పుస్తకం ప్రచురించినప్పుడు మొదటిరోజే 1250 పుస్తకాలు అమ్ముడుపోయాయి.
- కూచిపూడి నృత్యాన్ని అబుల్ హసన్ తానీషా ప్రోత్సహించాడు. బ్రాహ్మణులకు అగ్రహారం ఇచ్చాడు.
- ఐ.బి.ఎంలో 28 శాతం ఉద్యోగులు భారతీయులే.
- అబుల్ హసన్ తానీషాను బంధించి చెరసాలలో వేసి గోల్కొండను మొఘలు సామ్రాజ్యంలో విలీనం చేసింది ఔరంగజేబు.

—చిన్నారి

# సుధామ పదగారడి-313

సెల్: 98492 97958



## ఆధారాలు

**అడ్డం**

1. వేసవి ఎండ కొంచెం గంభీరంగా! (5)
5. గోనెసంచీయే! (3)
7. పెళ్ళిలో బంధుమిత్రులందరికీ తప్పక వుండేది (5)
10. జలబిందువు (4)
12. కబడ్డీ! (4)
14. కాకాయరక సరిచేస్తే ఓ కాయగూర (5)
16. ధ్రువుడు కాదు. భర్త! (3)
18. ఎండాకాలంలో బాటసారులకై వదాన్యులు నెలకొల్పేది (5)

**నిలువు**

1. కంఠం (3)
2. సందు మొదట్లో ఓ అక్షరం వుంటే ఇష్టం, ప్రీతి (3)
3. ఇంగ్లీషులో పొగరు, అహం (2)
4. శరీరంలేని మన్మథుడు (4)
6. చిప్ప దీనికి చెందింది బేటీ! (3)
8. ఈయన మొహం చూడగానే కవిత్వం పుట్టుకొచ్చేదట! (3)
9. రహస్యం (2)
10. బ్లూ స్కై-కవితాత్మకంగా! (4)
11. కాలు తీసేసిన బొగ్గురకాలు (3)
12. ప్రియురాలు (2)
13. ఒజ్జ (3)
15. నెల్లూరు జిల్లాలోని ఓ ముఖ్య పట్టణం. పహరా! (3)
16. దీనిని మనం రక్షిస్తే ఇది మనను రక్షిస్తుందట! పుణ్యహేతువు (3)
17. ఆడు తాబేలు (2)

## పదగారడి-312 సమాధానాలు



Printed and Published by **VEMURI RADHAKRISHNA**, Managing Director on behalf of Aamoda Publications Pvt. Ltd., Published at Plot No:76, Ashwini Layout, Huda Heights, Jubilee Hills, Hyderabad - 500 033, Phone No: (040)23558233/44, Fax No: (040) 23558288 and Printed at Aamoda Press, Survey No: 70/1 & 2, Vedurupavuluru Village, Mustabad Grama Panchayathi, Gannavaram Mandal, Vijayawada, Krishna District, PIN: 521 107 on behalf of Aamoda Press, R.S No:191/3, Ward No:43, Donka Road, Patamata, Vijayawada 520 010, RNI No: APTEL/20047/12594, Editor : **A.N.JAGANNADHA SARMA**

# అలా కనిపించాలని ఉంది

## –లావణ్య త్రిపాఠి



**ఎక్కడో పుట్టి ఎక్కడో పెరిగి టాలీవుడ్‌కి వచ్చి సక్సెస్‌ఫుల్ హీరోయిన్‌గా ముద్ర వేయించుకోవడం అంత సులువైన సంగతి కాదు. అంతటి ఘనత సాధించింది లావణ్య త్రిపాఠి. లావణ్య చేసిన సినిమాలు పదుల సంఖ్యలోనే ఉన్నా అన్నీ మంచి విజయాల్నే సొంతం చేసుకున్నాయి. తొలిసారి పరాజయం 'మిస్టర్' రూపంలో లావణ్యను పలకరించింది. ఈ పరాజయం తననేమీ చేయలేదు అంటున్న లావణ్య త్రిపాఠితో....**

**తొలిసారి నిరాశ కలిగినట్టుంది?**

కథాపరంగా, పాత్రలపరంగా ఎలాంటి లోపమూ లేదు. ఎందుకనో 'మిస్టర్' సినిమా తెలుగు ప్రేక్షకులకు నచ్చలేదు. ఇప్పటి వరకూ నేను చేసిన సినిమాలన్నీ మంచి విజయం సాధించాయి. ఈ సినిమా కొద్దిగా నిరాశపరిచిన మాట వాస్తవమే! ఇవి నన్ను హెచ్చరిస్తాయేతప్ప నిరాశపరచవు. సినిమాల ఎంపికలో మరింత జాగ్రత్తగా వ్యవహరించమని ఇదొక వార్నింగ్‌గా భావిస్తాను.

**మిమ్మల్ని మోడ్రన్ డ్రస్సులో చూసే అవకాశమే లేదంటారా?**

మోడ్రన్ డ్రస్సులంటేనే నాకు చాలా ఇష్టం. బయట
ఎప్పుడూ వాటినే వేసుకుంటాను.
కాకపోతే నా మొదటి సినిమా నుంచి ఇప్పటి వరకూ నన్ను హోమ్లీగానే చూపిస్తూ వచ్చారు. తెర మీద మోడ్రన్‌డ్రస్సుల్లో కనిపించాలన్న కోరిక నాకూ ఉంది. ఆ కోరిక త్వరలోనే తీరుతుందన్న నమ్మకం నాకుంది.

**తెలుగులో ఇంత గుర్తింపు వస్తుందని ఊహించారా?**

అస్సలు ఊహించలేదు. నా మొదటి సినిమా 'అందాల రాక్షసి' తరువాత సక్సెస్ ఫుల్ హీరోయిన్ అన్న పేరు వచ్చింది. ఆ తరువాత వచ్చిన రెండు సినిమాలూ మంచి విజయం అందుకోలేకపోయినా, లావణ్య బాగా చేసిందన్న పేరు తెచ్చాయి. ఆ తరువాత వచ్చిన 'భలే భలే మగాడివోయ్', 'సోగ్గాడే చిన్నినాయనా' సినిమాలు స్టార్ హీరోయిన్ని చేశాయి. ఈ సినిమాల ద్వారా ఇంత పేరు వచ్చిందంటే అది నా గొప్పతనం కాదు. ఆ భగవంతుడి కృప. అదే లేకపోతే ఇంత పేరునూ, ఇంత మంది అభిమానులనూ సంపాదించుకునేదాన్ని కాదేమో!

**తండ్రితో నటించారు. ఇప్పుడు ఆయన కొడుకుతో నటిస్తున్నారు. ఎలా ఉంది?**

ఆ ఫీలింగుకి మాటలుండవు.
నాగార్జునగారితో 'సోగ్గాడే చిన్ని నాయనా' చేసే సమయంలో ఆయనతో ఎంత కంఫర్టబుల్‌గా ఉన్నానో, ఇప్పుడు నాగచైతన్యతో చేసేటప్పుడూ అంత ఫ్రీగానే ఉంటున్నాను. ఈ సినిమాలో మోడ్రన్ డ్రస్సుల్లోనే ఎక్కువగా కనిపిస్తాను. కాజల్ తరువాత తండ్రీకొడుకులతో నటించిన హీరోయిన్‌ని నేనే!

**శర్వానంద్‌తో చేస్తున్న 'రాధ' సినిమా గురించి....**

శర్వానంద్ పేరు రాధాకృష్ణ, నా పేరూ రాధనే! ఈ సినిమా గురించి నేను చెప్పడం కన్నా థియేటర్లో చూసి తెలుసుకుంటే ఇంకా బాగుంటుంది.

**కోలీవుడ్‌లో చాలా గ్యాప్ తరువాత సినిమా చేస్తున్నట్టున్నారు?**

మూడు సంవత్సరాల గ్యాప్ వచ్చింది. అక్కడ నా తొలి సినిమా తరువాత టాలీవుడ్‌లో బిజీ అయిపోవడంతో కోలీవుడ్‌లో సినిమా చేసే అవకాశం రాలేదు. ఇప్పుడు సందీప్ కిషన్‌తో చేశాను. మా జోడి బాగుందని అందరూ అంటున్నారు. ఈ సినిమాలో జీన్స్ ప్యాంటూ, టీ షర్టులో కనిపిస్తాను సందీప్ కిషన్ మంచి నటుడే కాదు, మంచి మనసున్న వ్యక్తి కూడా! చెన్నైలో షూటింగ్ జరుగుతున్నన్ని రోజులూ అక్కడి ఫుడ్ తినలేకపోయాను. నా అవస్థ గమనించి సందీప్ వాళ్ళ ఇంట్లో ఉత్తరాది వంటకాలు చేయించి వేడి వేడిగా తీసుకొచ్చేవాడు. తను అలా చేసి ఉండకపోతే ఆకలికి తట్టుకోలేకపోయేదాన్ని. దక్షిణాది టిఫిన్లు బాగా అలవాటయ్యాయి కానీ భోజనం కాస్త ఇబ్బందిగా ఉంటుంది. హైదరాబాదులో షూటింగ్ ఉంటే ఫుడ్‌కి ఇబ్బంది ఉండదు. ఇక్కడ అన్ని రకాలూ దొరుకుతాయి.

**తెలుగులో డబ్బింగ్ చెబుతారా?**

ప్రస్తుతానికి అలాంటి సాహసాలు చేయను. మాట్లాడడం వరకూ ఓకే! డబ్బింగ్ అంటే కష్టం. భాష బాగా నేర్చుకుని అప్పుడు చెబుతాను.

–కె. రామకృష్ణ



